ఓమ్.

# జయార్థప్రకాశిక.

## మూడవభాగము.

### ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము.

ఇయ్యది,

శ్రీమత్పరమహంస,

## స్వామి. జీ. యస్. బి. సరస్వతీగారిచే,

రచియింపబడినది.



మొదటికూర్పు ప్రతులు ౧౦౦౦.

నూజవీడు,

శ్రీగౌరీముద్రాక్షరశాలయందు,

ముద్రింపబడి,



వనిగళ్ళవారిపాళెములో నేతద్గ్రంథగౌరవమహాజనసమ్మేళనమున

గ్రంథకర్తచే ప్రకటింపబడియె.



1920.





వెల రు. 3-0-0.

ఓమ్.

# హెచ్చరికము.

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా పంగం జాగర్లమూడిలో జరిగిన పరిషత్తు యందు బ్రహ్మశ్రీ జెందుకూరి నృసింహశాస్త్రుల్లవారు, బ్రహ్మశ్రీ కాశీ కృష్ణమాచార్యులవారు, బ్రహ్మశ్రీ పానకాలశాస్త్రుల్లవారు, మఱియును రేపల్లి తాలూకా నల్లూరుగ్రామమునకు సమీపమునయుండు మైనేనివారి పాలెములో జరిగిన పరిషత్తుయందు బందరు నోబిల్ కాలేజి సంస్కృత పండితులగు బ్రహ్మశ్రీ శిష్టానృసింహశాస్త్రుల్లవారు ఈమొదలగువారితో శ్రీయుతులగు కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారని వాదము లొనర్చియున్నాము.

ఇట్టి మావాదములను బూర్వోక్తులగు పండితవర్యులు ఖండనమొనర్పకబోవుటచే అట్టి వాదవిషయములను సిద్ధాంతపఱచి జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకులనిర్ణయమను నీగ్రంథము నలిఖించి వెల్లడిబఱచి యున్నాము. ఈగ్రంథమందలి శాస్త్రవిషయములో నద్దియైనను సంశయముగలిగియుండినచో నూతనముగా శాస్త్రవివాదాంశములను గల్పించుకొని మఱికొందరెవ్వరైనను వాదించ తలచినయెడల క్రిందవివరించియున్న పద్ధతుల (షరతుల) ననుసరించి వాదములు జరుపుదురేని మేమును అట్టివాదములకు సంసిద్ధులమై నుందుమని ఇందుమూలమున దెలియబఱచుచున్నాము.

## [illegible]తులు.

1. [illegible]ై ఉభయులకు సమ్మతమైన పంచాయతీదార్లు కలిగి యుండవలెను.

2. వాదస్థలము సర్వ జనుల రాకల కుపయుక్తముగా నుండవలయును.

3. విషయమునకు సంబంధించిన గ్రంథయుక్తమైన శాస్త్రవాక్యమైయుండవలెను.

4. వాదమందు దూషణ శ్లేషార్థము లుండగూడదు. ఏతద్విరుద్ధ ప్రవర్తకులను సభనుంచి బహిష్కరించుటకు పంచాయితీదార్ల కధికారమిచ్చి యుండవలెను.

5. నిర్ణేతాంశముల నొప్పుకొన్నట్లు ప్రకటన చేయుటకై వారివారి సంతకములు నిచ్చుటకొప్పుకొని యుండవలెను.

6. విషయమునకు సంబంధమగు పూర్వపక్షగ్రంథస్థమైన వాక్యములను పత్రసంఖ్యానిర్ణయముతో వాద దివసమునకు 4 రోజులకు పూర్వమే తెలుపవలెను.

7. శాస్త్రార్థ మొనరించువారి నామములను తెలియపర్చుటేగాక తదితరులు ప్రసంగించకుండుటకు ఖండితమైన తగుయేర్పాటు పంచాయతీదార్లకు కలిగి యుండవలెను.

**Note**:—సభకగు యావత్తు ఖర్చులు మాచే రచియింపబడిన పూర్వోక్త గ్రంథఖండన మొనర్చువారే భరించవలయును.

ఆంధ్రనగరము,
ఆర్యావర్తాంతర్గతము,
14—3—20.

శ్రీమత్పరమహంస,
స్వామి. జీ. యస్. బీ. సరస్వతి.

ఓమ్.

# ధన్యవాదము.



ఆంధ్రమహాశయులారా !

గుణినామపినిజరూప ప్రతిపత్తిః పరతఏవసంభవతి।
స్వమహిమదర్శనమక్ష్ణోర్ముకురతలేజాయతేయస్మాత్॥

అనగా గుణవంతులకుగూడ స్వస్వరూప పరిజ్ఞానము పరుల వలననే కల్గుచున్నది. సమస్తమును వీక్షించెడి కనుల మహిమను అద్దము చేతనే దెలుసుకొనవలయు ననునట్లు,

శ్లో॥ గోపాలసచ్చిదానంద బ్రహ్మేంద్రార్యసరస్వతే।
శ్రీరాజమౌళికారుణ్య ముద్రాభద్రా విరాజతే॥

అను నీయుత్తమశ్లోకుడగు నొకయాంధ్రమహాశయుని చరిత్రాత్మకమగు ధన్యవాదమొనర్చుటకు సంతసించుచున్నాను. ఆయుత్తమశ్లోకులగు యాంధ్ర మహాశయులే స్వస్తిశ్రీ శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతీయను క్లుప్తనామముతో విరాజిల్లుచున్న యీ ధన్యాత్ముని చారిత్రాత్మకమగు యీధన్యవాదమును పంభ్రమమునొందుచున్న సజ్జనులకు నాయోపికకొలది తొల్దొల్త గొంత ముచ్చటించ దలచి క్రిందివిధమున ప్రారంభించుచున్నాను.

| శు శ | బు | ర | కు |
|---|---|---|---|
|  | రాశిచక్రము. |  | కే |
| చ<br>గు రా |  |  |  |
|  |  | ల |  |

| ర కు |  |  | ల గు |
|---|---|---|---|
| శు కే | అంశచక్రము. |  | చ |
|  |  |  | రా |
|  |  |  | బు శ |

స్వస్తిశ్రీవిజయాభ్యుదయకల్యాది గతాబ్దంబులు ౪౯౭౯ కి సరియగు శాలివాహన శకవర్షంబు ౧౮౦౦ లైన వృషభమాసము ౧౦ వ దివసమునకు తుల్యమగు ౧౮౭౮ సం॥ మేనెల ౨౨ తేదీకి సరియగు బహుధాన్య నామ సంవత్సర వైశాఖ బ ౬ సౌమ్యవాసరము. ౨౯, ౪౬ శ్రవణము ౩౯, ౫౭ బ్రాహ్మము ౪౨, ౪౮ వణి ౨౯, ౪౬ రావి ౧౮, ౩౨ మిధునాయనగతో రవిః ౩౬, ౬ నిర్గః ౧, ౧౩ భరణి ౨ బు॥ బుధః ౧ రేవతి ౩ శుక్రః ౧౨ శ్రవణము రవివేషః భుక్తిః ౧, ౨౫ మసుదినము ధనిష్ఠః ౪౪, ౫౪ అహస్సు ౩౨, ౮ ఈపంచాంగశుద్ధి యగు శుభదివసమున సూర్యోదయానంతరము ఘడియలు ౨౯ విఘడియలు ౧౫ తత్కాల భోగసమయము తులాలగ్నము, శుక్రదైవత్యము. చంద్రహోరా మిధునబుధద్రేక్కాణము, మిధున బుధనవాంశము సింహ రవి ద్వాదశాంశము, కుజత్రింశాంశము, బుధాద్యంతము ౬౩, ౫౧ బుధభుక్తి ఘడియలు $\frac{౫౩,\ ౦౯}{౧౦,\ ౪౨}$ వ్యష్యము బ ౫ కుజవాసరము ౨౭, ౪౨ ఉత్తరాషాఢ ౩౬, ౬ శుభ్రము ౪౩, ౧౮ తైతుల ౨౭, ౪౩ రాత్రి ౧౪, ౩౨ మహావైధృతిః ప్రవేశము ౪౬, ౪౧ వృషభ సంక్రమణ భుక్తిః ౧, ౬ చంద్రమహాదశా శేషము ౧ సం॥ ౮ మాసములు ౩ దివసములు ౧౭ ఘడియలు ౨౦ విఘడియలు.

ఈశుభషడ్వర్గ సమయమున సాత్త్విక వేళయందు చిత్తూరుజిల్లా చంద్రగిరి తా॥ మల్లవరమను గ్రామమున ప్రాగినాటి నియోగులగు మహారాజరాజశ్రీ చదలవాడ శేషయ్యగారి ధర్మపత్నియగు వరదాంబ గర్భసంభూతులైన పూర్వాశ్రమమున రామకృష్ణయ్యయను నామమును ధరించిన స్వస్తిశ్రీ శ్రీమత్పరమహంసేత్యాది సకలబిరుదావళి విరాజమాన శ్రీమద్రామానంద సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతీ స్వాములవారి ప్రియతమాంతేవాసులగు గోపాల సచ్చిదానంద బ్రహ్మేంద్ర సరస్వతీ స్వామివారియొక్క జన్మస్థితియీప్రకారమైయున్నది.

౩ శ్రీవారు పూర్వాశ్రమమున ప్రబంధ పరమేశ్వరులగు భారత గ్రంథకర్తలలో మూడవ వారగు ఎఱ్ఱాప్రగడ వంశములో పదమూడవ పురుషులై యున్నారు. వీరివంశ మీక్రింది విధమున తెలియబడుచున్నది.

౧ భారతగ్రంథకర్తయగు ఎఱ్ఱాప్రగడ, ౨ లింగన, ౩ విప్రనారాయణచరిత్ర గ్రంథకర్తయగు మల్లన, ౪ కేశవయ్య, ౫ సూరయ్య, ౬ సాంబయ్య, ౭ సుబ్రహ్మణ్యయ్య, ౮ బిషక్సార్వభౌములగు నారాయణయ్య, ౯ ముత్యాలయ్య, ౧౦ పేరయ్య, ౧౧ చెంగయ్య, ౧౨ వేదాంతకేసరియను బిరుదాంకితులగు శేషయ్య, ౧౩ రామకృష్ణయ్య.

శ్రీవారికి పూర్వాశ్రమమున మాతామహులగు రావినూతల నారాయణయ్య మేనమామలైన ౧ గోపాలయ్య, ౨ వెంకటేశ్వరయ్య, ౩ రామయ్య, ౪ నరసింహయ్య, ౫ కృష్ణయ్య, ఇట్లు సంబంధములు గన్పట్టుచున్నవి.

౪ ఈయుభయవంశములకు జన్మస్థానము తిరుమలక్షేత్రము (శ్రీనగరము) నకు ౪ మైళ్లు (రెండుకోసులు) పశ్చిమందును వసుచరిత్రయందు ప్రసిద్ధిగ కన్పట్టునట్టి చంద్రగిరిపట్టణమునకు ప్రాగ్దిశ ౨ మైళ్ళయందును భాసిల్లుచున్నట్టి మల్లవరగ్రామమైయున్నది. సర్వమత సిద్ధాంతరూపమును, జగదామోదబంధురమును, నిశ్చలమును, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమునగు అద్వైతతత్వమొక్కటియే నిశ్చలమని స్వీయజన్మమాత్రముననే ప్రకటించెననంబోలి తమజననీజనకులకు శ్రీవారొక్కరే జననమైరి. ఇట్టి యద్వైతైక పరాయణత తమతండ్రి పదముప్పేరి జన్మస్వభావములయందు తాజేర్చెనని చెప్పుటకు మిగుల నానందమయ్యెడిని.

౫ వీరికి పదిరెండువత్సరములు వయస్సు వచ్చునప్పటికే తండ్రిగారగు శేషయ్యగారు స్వర్గస్థులైరి. జననియు భర్తృమార్గానుసరణము పతివ్రతాధర్మమని జగంబునకు వెల్లడించుచు తదనంతరము ౨ వత్సరములకు శివమలంకరించెను.

౬– శ్రీవారికి ౫వ సంవత్సరమునందు తల్లితండ్రు లక్షరాభ్యాస మొనరించిరి. అంతట కొంతకాలమునకనగా ౮వ వత్సరము వచ్చిన తోడనే తాత్కాలిక పరిస్థితుల ననుసరించి కుమారునకు రాజభాషను జెప్పింపదలచి తిరుపతి (శ్రీనగరము) బ్రవేశించి యచ్చటనున్న మహాంతు భగవాన్‌దాసు హైస్కూలులో జేర్చిరి.

అహా? భగవద్విలాసము మానవప్రకృతి నిరాశాహతమైనది. ఈమకుమారుడు రాజభాషాకోవిదుడై యున్నతస్థాన మలంకరించి తమ్ము నానందింపజేయునని తలచిన తలితండ్రుల తలంపులకు వేయిమడుంగులు గ నార్జించిన పుత్రుని జగద్గురుపదవిస్థజూచి యానందింపజాలడయ్యె. అప్పటికిని శ్రీవారు కొంత హూణభాష నభ్యసించుచుండ ౧౮౯౩ సంవత్సరమునందే తల్లియగు వరదాంబికయును స్మృతినొందుటచే ఆంగ్లేయ భాషాధ్యయనమున కంతరాయము వాటిల్లెను.

౭ అటుపిమ్మట వీరి మేనమామయగు రావినూతల గోపాలయ్యగారిచేతను, పితామహియగు పేరమాంబగారిచేతను, పెనుపబడుచు గొన్ని దివసములు గడిపిరి. ఇట్టిభాగ్యమును గొంతకాలమైనను అనుభవించుటకు వీలు లేక బోయినది. ఎందులకనినచో పితామహియగు పేరమాంబగారు దివమలంకరించుటయే ముఖ్యకారణముగ మనమూహించవలయును.

౮ అటుపిమ్మట భవితవ్యతా ప్రభావముచే శ్రీవారు క్రమక్రమముగ గీర్వాణభాషయందు ప్రవేశమునుసంపాదించి వేదవేదాంతవిద్యాపబోధమువందు తీవ్రమైన మనోరధము గలవారై యుండుచో గారకాంతరమున కర్నూలు పురంబునకుం జని యట సర్వవిద్యాలంకృతుండును శ్రీమత్పరమహంసేత్యాది సకల బిరుదాంకితుండును శ్రీవాసుదేవానంద సరస్వతి ప్రియతమాంతేవాసి వర్యుండును అయిన రామానంద సరస్వతీస్వాములవారి సన్నిధిని జేరి తచ్ఛుశ్రూషాపరాయణుండై తర్కవేదాంత శాస్త్రముల జక్కగ నధ్యయన మొనరించెను.

౯ అంతట వీరి వేదాంత విద్యావ్యాసంగము శీఘ్రముగ క్రియా
రూపము గాంచజొచ్చెను.

ఇట్టిసందర్భమున తీవ్ర ముముక్షువగు శ్రీవారికి గావలసిన యు
త్కృష్ట పదార్థమేది? సద్గురుజ్యోతిస్సు, దానికై నిరీక్షించుచుఆవరణ
విక్షేపాది రూపాత్మ ప్రకృతిధ్వాంత నిరాస భాస్కరులును, శ్రీకాంచీ
నగరస్థిత ఉపనిషద్బ్రహ్మేంద్రమఠ సంప్రదాయకులును, స్వస్తిశ్రీ శ్రీమ
త్పరమహంసేత్యాది సకల బిరుదావళీ విరాజమానులును, శ్రీమహాదే
వేంద్ర ప్రియతమాంతేవాసి వర్యులును, అయిన సదాశివ బ్రహ్మేంద్ర
సరస్వతీస్వాములవారి సన్నిధియందు తంజావూరు మండలాంతర్గతమైన
మాయవరమను పురమున కావేరీనొడ్డున విరాజిల్లుచుండు చేందంగుడి
మఠమున బ్రహ్మచర్యాశ్రమము నుండియే తుర్యాశ్రమ స్వీకారమును
గ్రహించిరి.

౧౦ శ్రీవారు విళంబినామ సంవత్సర కార్తీక శు ౭ మంగళ
వార దివసమున ఆశ్రమ స్వీకారము జేసినది మొదలు ఆరుమాసముల
వఱకును స్వగురుసాన్నిధ్యముననే బ్రహ్మాత్మైక్యాను సంధానము జేసి
కొనుచు నుండునంతి తమశిష్యుని, పరాకాష్ఠకును, నిశ్చలచిత్తమున
కును, తర్క వేదాంత విద్యాపటుత్వమునకును, మిగుల సంతసించి శ్రీపా
దులు (గురువులు) మనస్వామికి పీఠాధిపత్యమొసంగి అద్వైతసంప్రదా
యముల లోకులకు వెల్లడించి తరింపజేయుచు వైదికక్రియానుష్ఠానముల
సుపథముంజేర్చునట్లు శాసించిబనిచిరి.

౧౧ అంతట మన శ్రీమత్పరమహంస స్వామి, జే. యస్. బి.
సరస్వతీగారు నెల్లూరు (సింహపురి) మండలాంతర్గతమైన ఇందుకూరి
పేటకు తమపీఠముతో విజయముజేసిరి.

ఆగ్రిమవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ కందనూరు రామచంద్ర సోమ
యాజులగారును, బ్రహ్మశ్రీ పాటూరు వెంకటసుబ్రహ్మణ్యసోమయాజుల
గారును, బ్రహ్మశ్రీ భిషగ్వరులగు గాడేపల్లి వెంకటసుబ్బయ్యగారును,

బ్రహ్మశ్రీ కనపర్తి రాఘవయ్యగారును, మహారాజరాజశ్రీ పాటూరి
వెంచయ్యగారి సుబ్బయ్యగారును, మహారాజరాజశ్రీ శ్రీయుత బండేపల్లి
జమీదారు అనుమూరి సుబ్బానాయుడు గారును, మహారాజరాజశ్రీ శ్రీయుత
మక్కెన కొండప్పనాయుడుగారును, మహారాజరాజశ్రీ శ్రీయుత గును
పాటి యానాదిరెడ్డి గారును, ఈమొదలగు మహా మహులు ప్రోత్స
హించుటచే అచ్చట తమ సంస్థ నేర్పరుచుకొని ౧ కృష్ణా, ౨ గోదా
వరి, ౩ నెల్లూరు, ౪ గుంటూరు, ౫ గంజాము, ౬ విశాఖపట్టణ
ము, ౭ కడప, ౮ కర్నూల్, ౯ బళ్ళారి, ౧౦ అనంతపురము, ౧౧
చిత్తూరు, ౧౨ సేలము, ౧౩ వేలూరు, ౧౪ కోయంబుత్తూరు, మొ
దలగు చన్నపురి రాజధానియందుండు యీమండలములయందును, మ
రియు, ౧౫ నల్లగొండ, ౧౬ వరంగల్లు, ౧౭ కరింనగరము, ౧౮ ఏదు
లాబాదు, ౧౯ మెతుకు, ౨౦ మహబూబునగరు, ౨౧ హైదరాబాదు,
౨౨ బీదరు, ౨౩ ఇందూరు, ౨౪ నాందేడు, ౨౫ ఔరంగాబాదు,
౨౬ రాయచూరు, నైజాములోనుండు యీమొదలగు మండలముల
యందును, ౨౭ కోలారు, ౨౮ బెంగుళూరు, ౨౯ మైసూరు, ౩౦ శి
వమొగ్గ, ౩౧ శృంగేరి, మొదలగు మైసూరులోనుండు యీమండల
ములయందును, వెండియును, ౩౨ చాందా, ౩౩ వరాడ, ౩౪ వరోడా,
౩౫ అమరావతి, ౩౬ నాగపూరు, మొదలగు మధ్యప్రాంతములోనుండు
యీమండలములయందును, ౩౭ ఠాణా, ౩౮ కళ్యాణ, ౩౯ పునహా,
౪౦ బొంబై ఈమొదలగు బొంబై రాజధానియందు యీమండలముల
యందును ఇట్లు ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట, మహారాష్ట్రాది దేశముల
యందును బూర్వోక్తమండలములయందు సాధ్యమైనంతలో ప్రతిగ్రా
మమును గూడ విడువక శ్రీపీఠముతో సంచారము గావించుచుండిరి.

౧౨ ఇట్లు పర్యటన మొనర్చుచుండు నాసందర్భమున శ్రీవారు
విజయనగరమునందుండుతఱి తమగురువులగు శ్రీపాదులవారు సిద్ధిబొం
దిరను ఘోరవార్త నిదాఘతప్తుండగువాడు వర్షాగమనంబుచే సంతో
షంబు జనించుచుండ పిడుగుమీదబడినట్లు వినవచ్చెను. నిత్యనిరంతర

నిరంతరాయాభ్యస్త సమాధి ప్రత్యస్తాశేష వికల్పుండై, ఘటాద్యవచ్ఛి
న్నమై, కేవలాకాశము నానాత్వమందున్నట్లు, ఉపాధ్యనుగతమైన జీవ
త్వమునందు మిథ్యాప్రతీతిని సాక్షాద్దర్శనముచే విస్పష్టముగ గ్రహించి
నవారయ్యెను, "చంచలత్వం మనోధర్మో వహ్నెర్ధర్మోయథోష్ణతా"
అను నుపనిషద్వాక్య ప్రకారముగ తాత్కాలిక చేతనంబు నిశ్చలనముం
గాంచియు, నంతస్తంభితోత్కలికుండై విశ్రాంతిబొందెను.

చదువరులారా!

౧3 అంతట శ్రీవారు గుర్వారాధనలు గావించి బూర్వమువలె
సంచారం బొనర్చుచున్నవారు.

ఇయ్యది శ్రీమత్పరమహంస స్వామి జీ. యస్. బి. సరస్వతీగారి
యొక్క పూర్వపుచారిత్రయగు ధన్యవాదమని మీరూహించుకొనదగియు
న్నది. ఇటుపై ఉత్తరయుగచారిత్రాత్మకమగు ధన్యవాదము సుప్రసిద్ధ
ముగుటవలన ప్రత్యేకముగ నాచేజెప్పుటనవసరమైయుండినను, శ్రీవారిచే
రచితమైన జయార్థప్రకాశిక మొదటిభాగము, అజ్ఞానతిమిరభాస్కరము,
రెండవది, జయార్థప్రకాశిక మూడవభాగము, ప్రచ్ఛన్న రాజకులనిర్ణయ
ము అను నీగ్రంథరాజములను జూచితిరేని దెలియుననుసంగతిమాత్రము
వ్రాయుచున్నాను. ఇంతివరకు వీరింగూర్చివ్రాసినచారిత్రాత్మకమగు ఈ
ధన్యవాద మొకక్రొత్తవిషయముగాదు. ఇట్టిది ప్రతిమానవవ్యక్తియందు
నుకొంచముగనో గొప్పగనో దోచుచునేయుండును. కావునయిట్టి సర్వసా
మాన్యమైన చరిత్రాత్మకమగు ధన్యవాదమును వ్రాయుటయే నాప్రధా
నోద్దేశ్యముకాదు. అట్టియల్పోద్దేశ్యమును మాత్రమే వివక్షజేసినచో నిం
తవరకు మీకు శ్రమనిచ్చియుండను. లోకములోననేక చేతనజంతువులు ఉ
త్పత్తిస్థితిలయములంబొందుచున్నవి. వానితో వాని చరిత్రములుగూడ
నంతరించుచున్నవి. వానినిగూర్చి చరిత్ర మేమియు దెలియవా యెగదాయ

నిమనము విచారించుచుంటిమా? లేదు. క్రిందిటి సంవత్సరపు పంచాంగ మును జాగ్రతపరచుకొనుటకే విసువుంగాంచు మనకు సృష్ట్యాది నుండి యు గడచిన మానవులచరిత్రములున్నను నెవడు చూడ నిచ్ఛగించును. శిలావంచయమునందు వెదకి దాచుకొనతగిన వజ్రమువలె మానవకోటి లోబుట్టిన శ్రీవారియొక్క చరితాత్మకమగు నీధర్మవాదమను వజ్రము ను మీకు సమర్పించుచున్నాను.

ఇట్లు వచించిన దీని నూతనోన్మేషము మీహృదయ గహ్వరము లందు వింతవింతకాంతులనీని మిమ్ముల నలంకరించగలదు.



నల్లూరు,
రేపల్లి తాలూకా,
గుంటూరు జిల్లా,
13—3—1920.



ఇట్లు భవద్విధేయుడు,
యార్లగడ్డ శ్రీకృష్ణశారది.



ఓం.

# ఉపోద్ఘాతము.

సదయహృదయులారా!

ప్రాచీనార్యులైన మనపూర్వులను గురించియు వారల విద్యాజ్ఞానైక్యమత్యముల గుఱించియు ప్రశంసింపదలచి యున్నవారము. ఇందులో ప్రాచీనశబ్దమున కేమియర్థమన్నను వెనుకటికాలము వారనియర్థము. వెనుకటి కాలమున కొక్క మొదలును ఏర్పఱచి అదిమొదలు వారియొక్క స్వరూపస్వభావములను ప్రశంసింప వలసియున్నది. కల్పమనియు మహాకల్పమనియు రెండు గొప్ప కాల పరిమాణములుకలవు. అందున కల్పమన పరబ్రహ్మయొక్క ప్రథమసృష్టి అందులకారంభమున ప్రభవసంవత్సర చైత్రశుద్ధ ప్రతిపత్తు ఆదివారమునై యుండుటయు ఏడు గ్రహములు మేషముయొక్క మొదటి భాగములో మొదటి కళలో మొదటి వికళలోయుండుట ఎప్పుడు తటస్థించునో అది కల్పమనబడును. ఈయంశముసిద్ధాంత శిరోమణియను గ్రంథములో భాస్కరాచార్యులగారిచే జెప్పబడియున్నది.

శ్లో॥ లంకానగర్యాముదయాచ్చభానో స్తస్యైవవారేప్రథమంబభూవ।
మధోస్సితాదేర్దినమాసవర్ష యుగాదికానాంయుగపత్ప్రవృత్తిః॥

ఇటు గ్రహములు మొదలగునవి కుదురుటయే కల్పాదిగాన జ్యోతిష్కులు విలోమగణితముచేసి దాని పరిణామమును కనుగొనుటకు అవకాశముకలిగియున్నది. ఇట్టికల్పముయొక్క పరిమాణమెంత యన్నను దీనివిషయముగూడా భాస్కరాచార్యులు జెప్పియున్నారు. నలువదిమూడులక్షల ఇరువదివేలు సౌరసంవత్సరములు చతుర్యుగమగును. అనగా కృత, త్రేతా, ద్వాపర, కలియుగముల నెడి నాలుగుయుగములు, ఈనాలుగునుగూడి ఒక్కమహాయుగమనబడును. ఈమహాయుగములు వేయిఅయ్యేనేనిఒక్కకల్పమగును. ఈయుగములనునవి రెండువిధములు.

అవి జ్యోతిషయుగములనియు, ధర్మయుగములనియు, జెప్పబడును. ఇక ధర్మయుగము లెట్లువియనిన ధర్మములన్నియు క్రమముగానుండు కాలము కృతయుగమనియు ముప్పాతికధర్మములు నడుచుకాలము త్రేతాయుగమనియు సగము ధర్మమునడుచుకాలము ద్వాపరయుగమనియు, ఒకపాతికధర్మము నడుచుకాలము కలియుగమనియు, ఇట్లు ధర్మమునుబట్టి యుగములు ఏర్పడియున్నవి. ఈధర్మయుగములు పరిపాలించెడు రాజు ననుసరించియుండునని మనుస్మృతిలో జెప్పబడియున్నది.

శ్లో॥ కృతంత్రేతాయుగంచైవ ద్వాపరం కలిరేవచ।
రాజ్ఞోవృత్తానిసర్వాణి రాజాహియుగముచ్యతే॥

అయితే ప్రకృతమేమన్నను ధర్మము సంపూర్ణముగానడిచెడికాలములో అసత్యము లేకపోవుటచేత చేయబడినది చేయబడలేదని జెప్పబడకుండుటచే కృతయుగమనెడి పేరు కలిగినది. ఇందువలననే దీనికి సత్యయుగమని నామాంతరముకలదు. అటుపయిని ముప్పాతిక ధర్మము నడిచెడికాలములోనే త్రేతాగ్నులతో హోమములుచేయుట మొదలగు నాచారము లారంభములైనవి. త్రేతాగ్నులన్న దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయములని జెప్పబడుచున్నవి. ఇందువలననే త్రేతాయుగమని వాడబడుచున్నది. అటుపైన సగము ధర్మమునడుచు కాలములో జనులకు సంశయములు అతిశయించుటచేత ఆయుగమునకు ద్వాపరమనిపేరు కలిగినది ద్వాపరశబ్దము ద్విపరఅను శబ్దము మీదకలిగినది అనగా ఉన్నది, లేదు. అను రెండువిషయముల యందు ప్రవర్తించెడి బుద్ధిగాన సంశయమును ద్వాపరశబ్దముచే జెప్పబడినది. సందేహా ద్వాపరౌచ అని అమరమందును కనబడుచున్నది. ఇక కలియుగ శబ్దార్థము జెప్పవలసియున్నది. కలి యనగా కలహము.

శ్లో॥ సంప్రహారాభి సంపాతకలిసంస్ఫోటసంయుగాః॥ అమరము.

సంప్రహారము, అభిసంపాతకము, కలి, సంస్ఫోటము, సంయుగము, అనునీప్రకారము సమానార్థక పదములై యున్నవి. కాబట్టి కలహములు ప్రధానముగాగల యుగము కలియుగమనబడును. కలహము

ష్టూమును క్రోధమువలనకలుగును. క్రోధము కామమువలన కలుగును. కాబట్టి కామక్రోధములు ప్రధానముగాగలయుగము కలియుగమన బడును. ఇవినిజముగా ధర్మయుగములని పేరులైనను జ్యోతిష్కులుగూడా మొదటిది, రెండవది, మూడవది, నాలగవదియను క్రమమునుబట్టి జ్యోతిష్క యుగములకు గూడా నీపేరులేబెట్టిరి. కాబట్టి ప్రాచీనులన ఈసృష్టిలో మనమెఱింగినవరకు పూర్వకాలపువారని యర్థము. ఇంతకన్నభిన్నార్థము మఱియొకటి కలుగజాలదు.

2 ఈసృష్టిలో అతిపురాతనులైనవారు దేవతులనియు, అసురులనియు వారివారి స్వభావములనుబట్టి జెప్పబడుచుండిరి. ఇందుకు ఉపష్టంభముగా మహాభారతము ఆదిపర్వము 16 అధ్యాయములో నొక్క శ్లోకము గలదు.

> శ్లో॥ పురాదైవయుగేబ్రహ్మా ప్రజాపతిసుతేశుభే।
> అస్త్రాంభగిన్యౌరూపేణ సముపేతేమ్యతేనఘ॥

ఇచ్చట దైవయుగమని జెప్పియుండుట ప్రకృతాంశమునకు ఉపష్టంభకము ఇందుచే పూర్వము దైవయుగమని యొకయుగముగానే యెన్నుచుండిరి. దేవతులు ప్రజాసంఘమునకు సుఖమును కలుగజేయుస్వభావముకలవారలు. అసురులు తమకుమాత్రము సుఖముగోరి ఇతరులనుహింసించియైనను సుఖమును సంపాదించుకొనువారు. అందువలననే భగవద్గీతలలో దైవసంపత్తనియు అసురసంపత్తనియు ఇట్లు మనుష్యులను రెండుతెగలుగా విభజించి వారికి తగిన గుణములుగూడా జెప్పబడియున్నట్లు క్రింది శ్లోకములచే తెలియుచున్నది

> శ్లో॥ అభయంసత్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః। దానందమశ్చ
> యజ్ఞశ్చస్వాధ్యాయస్తపఆర్జవం। అహింసాసత్యమక్రోధస్త్యా
> గశ్శాంతిరపైశునమ్ దయాభూతేష్వలోలత్వం మార్దవంహ్రీర
> చాపలమ్। తేజః క్షమాధృతిశ్శౌచ మద్రోహోనాతిమానితా।

భవంతిసంపదందైవీమభి జాతస్యభారత॥ దమ్భోదర్పోభి మాన
శ్చక్రోధః పారుష్యమేవచ। అజ్ఞానంచాభి జాతస్య పార్థసంపద
మాసురీమ్॥ భగవద్గీత. 17 అ.

ఈశ్లోకములకు సులభమైన యర్థము కనబడుచుండుటచే అర్థ
మువ్రాయమైతిమి. దేవతలకును అసురులకును ఈప్రకారము స్వభావ
మునందు భేదముండుటచేతనే పూర్వము అనేక పర్యాయములు దేవా
సురయుద్ధములు జరిగినవి. ఇట్టి దేవాసురయుద్ధములు పండ్రెండని లె
క్కబెట్టబడినది. ఈయుద్ధముల చరిత్రములన్నిటిని చెప్పుట గ్రంథము
విస్తరమగునను భయముచేత నిలుపబడినవి. ఇందు దేవతలు క్రమక్ర
మముగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణముల
వారైరి. అయితే మొట్టమొదట దేవతలందరును బ్రాహ్మణ ధర్మము
లనే యవలంబించి బ్రాహ్మణులై యుండిరి. అటుపైని అందరును అట్టి
ధర్మములను చక్కగా పరిపాలించుకొనలేక క్రమక్రమముగా క్షత్రియ
వైశ్య శూద్రులైరి. ఈవిషయము మహాభారతము మోక్షధర్మమున
భృగు భరద్వాజ సంవాదములో స్పష్టపరుపబడినది.

శ్లో॥ కథంసృష్టానిభూతాని కథంవర్ణ విభక్తయః।
శౌచాశౌచం కథంతేషాం ధర్మాధర్మవిధిః కథమ్॥

భూతములన్ని ఎట్లు సృజింపబడినవి. వర్ణవిభాగమెట్లు కలిగినది.
వారికి శౌచమును అశౌచమును ఎట్లు కలిగినవి. వారలకు ధర్మాధ
ర్మముల ఏర్పాటు ఎట్లుఅని భారద్వాజుండు ప్రశ్న జేయ.

శ్లో॥ అసృజద్బ్రాహ్మణానేవ పూర్వంబ్రహ్మాప్రజాపతిః। ఆత్మతేజోభి
నిర్వృత్తాన్ భాస్కరాగ్నిసమప్రభాన్॥ 1॥ నవిశేషోస్తి వర్ణా
నాం సర్వంబ్రాహ్మ్యమిదంజగత్। బ్రహ్మణాపూర్వసృష్టం హి
కర్మభిర్వర్ణతాంగతమ్॥ 2॥ కామభోగ ప్రియాస్తీక్ష్ణాః క్రోధ
నాః ప్రియసాహసాః। త్యక్తస్వధర్మారక్తాంగాస్తేద్విజాః క్షత్ర
తాంగతాః॥ 3॥ గోభ్యోవృత్తిం సమాదాయపీతాః కృష్యుపజీ

వినః। స్వధర్మంనానుతిష్ఠంతితే ద్విజా వైశ్యతాం గతాః॥ 4॥
హింసారతిప్రియాలుబ్ధా స్సర్వకర్మోపజీవినః। కృష్ణాశ్శౌచ పరి
భ్రష్టాస్తేద్విజా శూద్రతాంగతాః॥ 5॥ ఇత్యేతైః కర్మభిర్వ్యస్తా
ద్విజా వర్ణాంతరంగతాః। ధర్మోయజ్ఞ క్రియాచైషాం నిత్యంన
ప్రతిషిధ్యతే॥ 6॥ వర్ణాశ్చత్వార ఇత్యేతేయేషాం బ్రాహ్మీ సర
స్వతీ। విహితా బ్రహ్మణా పూర్వం లోభా_త్త్వజ్ఞా నతాం
గతాః॥ 7॥

ప్రజలకు అధిపతియైన బ్రహ్మ మొదట బ్రాహ్మణులనే సృజిం చెను. ఆబ్రాహ్మణులు బ్రహ్మ యొక్క తేజస్సు వలన గలిగినవారు, సూర్యుడు అగ్ని వీరివంటికాంతిగలవారు అప్పుడు వర్ణములభేదము లేనిదై యుండెను. ఈజగత్తంతయు బ్రాహ్మణులతో నిండియుండినది గానే బ్రహ్మచేత సృజింపబడినది. వారివారి పనులచేత వర్ణభేదములను పొందిరి. ఇట్టి బ్రాహ్మణులలో కామము, లోభము, వీటియందుప్రీతిగలవారును, తీక్ష్ణస్వభావముగలవారును, క్రోధిష్ఠులును సాహస కార్యములయందు ప్రీతిగలవారునై తమ బ్రాహ్మణ ధర్మమును విడిచిన బ్రాహ్మణులు క్షత్రియత్వమును పొందిరి. వారు ఎరుపువర్ణముగలవారుగా జెప్పబడుచున్నారు. గోవులవలన జీవనమును సంపాదించుకొని వ్యవసాయమువలన జీవించెడివారునై తమధర్మమును ఆచరింపని బ్రాహ్మణులు వైశ్యులైరి. వారు పీతవర్ణముగలవారుగ నెన్నబడుచున్నారు. హింసించుటయందును, స్త్రీసంభోగమునందును, ప్రీతిగలవారును లోభముగలవారును, అన్నిపనులకు సహాయమైనవారును, దానివలననే జీవించెడివారును అయి బ్రాహ్మణధర్మమును ఆచరింపనివారు శూద్రత్వమును బొందిరి. వీరు నల్లనిరంగుగలవారుగ జెప్పబడు చున్నారు. ఇట్లు ఈకర్మలచేత భేదించినవారై బ్రాహ్మణులు వర్ణాంతరములనుపొందిరి. వీరలకు ధర్మాచరణంబును యజ్ఞాచరణంబును నిషిద్ధములుగావు. వేదమనెడి బ్రహ్మవాక్కునకు అధికారులుగా మొదట నేర్పరుప బడినవారే క్రమముగా ఆయావ్యాపారముల యందలి లోభముచేత అజ్ఞానమునుబొంది నాలుగు వర్ణములవారుగానైరి.

రి. అసురులనువారు పశ్చిమదేశములు మొదలగు వానియందు చెదరి వర్ణవ్యవస్థలు లేని కొన్ని జాతులవారైరి. ఈవిషయము మనుస్మృతి 10 అధ్యాయమునందు చక్కగానొక్క వక్కాణింప బడియున్నది.

శ్లో॥ శనకైస్తు క్రియాలోపాదిమాః క్షత్రియజాతయః। వృషలత్వం గతాలోకే బ్రాహ్మణా దర్శనేనచ। పౌండ్ర కాశ్చోడద్రవిడాః కాంభోజాః యవనాః శకాః। పారదాః పహ్లవాశ్చీనాః కిరాతాఃదరదాఃఖశా। ఇతి ముఖబాహూరుపజ్జానాంయా లోకేజాతయోబహిః। మ్లేచ్ఛవాచశ్చార్య వాచస్తే సర్వేదస్యవః స్మృతాః। ఇతిచ॥

ఈక్షత్రియులు రాజ్యలోభముచే దూరదేశము వెళ్ళి శ్రౌతస్మార్తకర్మలేక రానురాను శూద్రప్రాయులైరి. వారిసంతతి ఇతర దేశములో వ్యాపించుటచే వారికి పౌండ్ర చోళద్రవిడ కాంభోజ యవన శక పారద పహ్లవ చీన కిరాత దరదఖశాదులను నామములు వచ్చెను. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు తమదేశమునుండి వెళ్ళి అక్కడ మ్లేచ్ఛభాషలోగాని లేక ఆర్యభాషయుక్తమైన మ్లేచ్ఛభాషలోగాని వ్యవహరించుచు కర్మబాహ్యులై యున్నవారు దస్యులనబడుదురు అనియర్థము. రాజ్యాదిలాభముచే దేశాంతరము వెళ్ళిన శక యవనాదుల భాషాస్వరూప తారతమ్యము పరీక్షచేసిన తల్లి, తండ్రి, కోడలు, సోదరుడు, మనుమడు, లోనగు యర్థప్రతిపాదకములగు వారి మాటలు ప్రాయకముగ గీర్వాణ భాషయొక్క అపభ్రష్టములుగ నున్నట్లగుపడు చున్నవి. దీనినిబట్టి యీభాషలను బలుకువారిపూర్వులు ఏకభాషను మాటాడుచును ఏకకుటుంబులుగ నుండిరని యనుమేయింపనగు. కాని స్వేచ్ఛావృత్తిగల స్త్రీపురుషుల సంపర్కము వల్లను అనేకానులోమవిలోమజాతులు గలిగెననియు వానిలోనివారు శక చీనా యవనాదులనియు, వీరు అనార్యులనియు వీరిదేశములు కీకటసంజ్ఞ కలవనియు మను యోగ్యాదుల యాశయము.

4 మ్లేచ్ఛపదవాచ్యులు మాత్రము ఆర్యులకాలమునుండి వేరు గానున్నట్లు వారిభాష సంస్కృతమునకంటె స్వతంత్రమనియు వేదము వల్లగనబడు, పూర్వమీమాంసా 1 వ అధ్యాయములోని 3 వ పాదము లో 6 వది యగు మ్లేచ్ఛప్రసిద్ధార్థ ప్రామాణ్యాధికరణసూత్ర మేమన,

చోదితంతు ప్రతీయేతా విరోధాత్ప్రమాణేన॥

దీని తాత్పర్యము మాధవాచార్యులీతీరున వ్రాసిరి.

గ్రాహ్యామ్లేచ్ఛప్రసిద్ధస్తు విరోధాధర్మనేసతి।
పికనేమాది శబ్దానాం కోకిలాద్యార్థతాతతః॥

పికమునకు కోకిలమని నేమకు అర్థమనీ తామరసమునకు పద్మ మని అనార్యులగు మ్లేచ్ఛభాషలో రూఢి. ఈయర్థములు ఆర్యప్రసిద్ధికి విరోధములుగావు గాన వానిని దెలియజేయుటకా శబ్దములు వేదభాష యందుగూడా నుపయోగింపవచ్చు. కావున దీనింబట్టి ఆర్యానార్యుల వ్యవహారము వేదకాలమందు గూడా నుత్తరదేశమందున్న దనియు, అరబిక్, సంస్కృతము, స్వతంత్ర భాషలైనను దేశీయుల పరస్పరవాణి జ్యాదివ్యాపార సంబంధ వశంబున అన్యదేశీయములు ఉభయభాషలలో జేరినవని పూర్వ మీమాంసా 5 వ అధికరణమునజెప్పబడియున్నది. పరి ష్యన్, ఉర్దు, హిందుస్థాని, పంజాబీ, లోను గాగల భాషలలో సం స్కృతాపభ్రష్టపదములు మెండుగ గలవనియు, ఇటులే ప్రాకృతము లగు షడ్భాషలు కాలానుసారముగ బ్రవర్తిల్లెననియు దెలుసుకోన తగి యున్నది. మరియు భారతాదిగ్రంథములలో ఆజాన, యవన, గాం ధార, చీనా, దేశముల బ్రశంసజూడ నాదేశస్థులతో నార్యులకు వ్యవ హారసంబంధము మిక్కుటముగ గలదనియుదెలియనగును గాని సింధు నదిదాటిన ద్విజత్వముపోవునను నూహకు బ్రమాణములేదని దెలియ తగియున్నది.

5 ఆర్యులజన్మకాలముయొక్క ప్రసంగసంగతియందు మన భర తవర్షపు పూర్వస్థితిదిఙ్మాత్రముగ సప్రమాణముగ విచారింపబడు చు

న్నది. శకుంతలకు దుష్యంతుని వలన గలిగిన భరతవంశపు రాజులచే పాలితమైనదిగాన నిది భరతవర్షము భరతఖండము అనబడునని మహాభారతమునందున్నది. మరియు ఆర్యాః ఆసమంతాత్ వర్తంతే అత్రేత్యార్యావర్తః॥ అని విగ్రహప్రకారము ఆర్యులు అంతటను నివసించుచున్నారు గాన ఆర్యావర్తమని చెప్పబడును. ఆర్యులన ఆరాత్ దూరాత్ యాతీత్యార్యః. అను విగ్రహముచేత దూరముగా నడచువాడు అని అర్థముఅగుచున్నది. అనగా ఐహికవిషయములనేమి ఆముష్మిక విషయములనేమి బహుదూరము వరకు నాలోచించువాడని భావార్థము స్ఫురించుచున్నది. ఇట్టియర్థముగల శబ్దము వీరికేలగునని ఇటుపై చెప్పబడు విషయమువలన స్పష్టమగును. ఈభరతఖండమనబడు ఆర్యావర్తములో నుత్తరభాగమే పూర్వపు క్షత్రియు లేలినట్లును గోదావరి మొదలు దండకారణ్యమైనటులను ఋష్యాశ్రమములును కొండజనుల పర్ణశాలలును ఉన్నటుల భారత రామాయణము వల్ల గన్పట్టుచున్నది. పూర్వము ఆర్యులనునామముచే బిలువబడిన వారిలో నొక శాఖయులు కాకసస్సుకొండలనుండి దిగి పీఠావరుదారిగుండా సింధునదిజేరి తన్నది మొద్దున దాని యుపనదుల మొద్దున గంగా యమునాదనదిజేరి క్రమశః బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులైరని పాశ్చాత్య పండితుల యాశయము. అందరు బ్రాహ్మణులుగానుండినస్థలము దేవికానదీతీరమని మా యభిప్రాయమగుచున్నది. ఎందుచేతనన్నను మహాభారతములో అరణ్యపర్వములో తీర్థములను జెప్పునప్పుడు ఈక్రింది శ్లోకము వ్రాయబడియున్నది.

శ్లో॥ అథగచ్ఛేతరాజేంద్ర దేవికాంలోకవిశ్రుతాం।
ప్రసూతిర్యత్ర విప్రాణాం శ్రూయతే భరతర్షభ॥
అరణ్యపర్వము 82 వ అధ్యాయము.

ధర్మరాజా తరువాతను లోకప్రసిద్ధమైన దేవికానది చేరవలయును అచ్చటనే బ్రాహ్మణుల ఉత్పత్తియైనట్లు వినబడుచున్నది. అని ఈ శ్లోకముయొక్క తాత్పర్యము. అయితే ఈదేవికానది మనభరతఖండ

ముయొక్క ఉత్తర పశ్చిమ భాగములోని నదియైయుండునని మాత్ర మునూహింపవచ్చును. అంతకన్న దీనివిశేషస్థితి ఇప్పటికి తెలియలేదు. అతిప్రాచీనమైన ఋగ్వేదములోని మంత్రభాగమగు నీక్రింది మంత్రము న ఆర్యావర్తమునందుండు నదులలో ఈదేవికానదియొక్క పేరు లేక యుండుటచే మన భరతఖండముయొక్క ఉత్తర పశ్చిమ భాగములో నీదేవికానదియుండునవియు అచ్చటనుండి మనఆర్యులు గంగా, యమునా, సరస్వతీ, శతద్రు, పరుష్ణీ, ఆర్జికీ, మరుద్వృధ, అసిక్నీ, వితస్తాసుషోమ, అనగా సింధుః ఈప్రాంత్యముల ఆర్యులు స్థిరనివాసము లేర్ప రుచుకొనిరని యూహించతగియున్నది.

> ఇమంమేగంగే యమునే సరస్వతి శుతుద్రిస్తోమగ్ం సచతా ప రుష్ణ్యా అసిక్న్యా మరుద్వృధే వితస్తయార్జీకీయే శృణుహ్యా సుషోమయా॥

దీనియర్థము. ఓగంగా, ఓయమునా, ఓసరస్వతీ, ఓశుద్రి, ఓ పరుష్ణీ, ఈనాస్తోత్రమును స్వీకరింపుడు. ఓమరుద్వృధా నీవు అసిక్నితోనును లెస్సగావినుముఅని సముదాయార్థము. భారతశాంతిపర్వము లో బూర్వము ఆర్యులందరు నొక బ్రాహ్మణ వర్ణలనియు గుణకర్మ విభాగముచే వారు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులైరనియు భృగు భరద్వాజసంవాదములోని వాక్యములవలన మనమింతకుపూర్వమే తెలుసుకొనియుంటిమి. మనపూర్వులు ఏదేశమునుండి యిటకు వచ్చిరో. అసంగతి మనగ్రంథములలో స్పష్టముగ జెప్పియుండలేదు. ఋగ్వేదము ఇప్పటికి 6 వేలు ఏండ్లక్రిందటనే ప్రకటింపబడియుండవలెనని తద్వేదోదాహృత గ్రహ నక్షత్రస్థానాదులం బట్టి జ్యోతిశ్శాస్త్రానురోధముగ సోపపత్తికముగ బ॥ బాలగంగాధరతిలకు బి. ఏ. ఎల్. ఎల్. బిగారు పూర్ణభాషలోవ్రాసిరి. దానిని గొందరు పాశ్చాత్యులుగూడ నంగీకరించిరి. మోక్షమూలరుగారు 4000 ఏండ్లనితలంపు. అట్టిఋగ్వేదము బ్రాహ్మణులను ఆర్యులని చెప్పుచున్నది. తృతీయాష్టకములోని 6 వ అధ్యాయమందీకీతిసూన్నది.

అహంభూమి మదదా మార్యాయాహం వృష్టిందాశుషే మ
ర్త్యాయేతి॥

దీనితాత్పర్యమేమన్నను వామదేవఋషి తనతపోబలముచే జగ
త్తు సర్వము తానేయని య నుభవించి,

అహంప్రజాపతి రూపః సన్ ఆర్యాయాంగీరసే భూమిం దత్త
వాన్। అహమింద్రరూపః సన్ దాశుషే హవిర్దత్తవతే మర్త్యా
యవృష్టిం దత్తవానితి॥

దీనితాత్పర్యమేమన్నను, నేను ప్రజాపతిరూపము కలవాడనై ఆ
ర్యుడగు ఆంగీరసునకు భూమినిచ్చినవాడనైతిని. నేను ఇంద్రరూపము
కలవాడనై హవిస్సునిచ్చిన మనుష్యునకు వర్షమునిచ్చినవాడనైతిని.
అనియనను. కావున నార్యులగు ద్విజులు భరతవర్షంబున 4 వేల ఏండ్ల
కు పైగానుండిరని యూహింపనగు. శృతిస్మృతులలోని,

ధాతాయధాపూర్వ మకల్పయత్.

ఇత్యాది వాక్యములు బ్రాహ్మణాదిసృష్టి యనాదియని చెప్పు
చున్నవి. ఋగ్వేదములోని గొన్నిఋక్కులకు పరశురాముని జనకుడ
గు జమదగ్నిఋషి ఋగ్వేదాంత భాగములలో శ్రీరామావతారకథత్రి
విక్రములగు వామనచరిత్ర శతపథబ్రాహ్మణములో మత్స్యావతార ప్ర
చారము. శతరుద్రీయాదులయందు శివసార్వాత్మ్యము చాందోగ్యో
పనిషత్తులో దేవకీసుతులగు శ్రీకృష్ణభగవానులు ఘోర ఆంగీరసునొద్ద
నుపదేశము బొందిన బురుషవిద్య. అధర్వణములో నాది వరాహనృ
సింహావతారములు. ఉపనిషత్తులలో శివశక్తి విష్ణ్వాద్యుపాసనలు చెప్ప
బడినవి. ఈవిషయములన్నియు ద్వాపరాంతమునకు బూర్వవృత్తము
లని వైదికులతలంపు. ఆప్రాంతములను మహర్షులుభగవదంశచే గృష్ణ
ద్వైపాయనులగ నుద్భవించి 28 వ ద్వాపరాంతమునందు వేదరాశిని
ఋగ్యజుస్సామాధర్వణములుగ విభాగము జేసిరి గాన వేదవ్యాసులు
అని నామముధరించిరని మహాభారతాదులందున్నది. ఇప్పటికి ద్వాప

రయుగమంతమయి 5 వేలుఏండ్లు అయినది. కాబట్టి అంతకుబూర్వమే వ్యాసావతారమైయుండనోపు. కాన నేటికి సుమారు 6 వేల ఏండ్లక్రిందట ఋగ్వేదాదివిభాగము జేయబడెననియు అందుకుబూర్వమే ఆర్యులగు ద్విజులు ఆర్యావర్తాదులలోనుండిగాని లేక అక్కడికి వచ్చిగాని రాజ్యపరిపాలనము జేయుచుండిరని నమ్ముటకు వీలులేకపోలేదు.

6 ఆర్యుల జన్మభూమి కురుక్షేత్రమనబడు డిల్లీ దగ్గర మత్స్య పాంచాలమనబడు పంజాబు శూరసేన దేశములు బ్రహ్మర్షి దేశ మనబడుననియు నది బ్రహ్మావర్తానంతరమనియు నాదేశములో బ్రాహ్మణులు జీవించిరనియు మనుస్మృతి 2 వ అధ్యాయమందున్నది. బ్రాహ్మణులు వ్యాపించినది బ్రహ్మావర్తమనియు ఆర్యులుత్పన్నమైనది ఆర్యావర్తమనియు బ్రహ్మర్షులచే వ్యాప్తమైనది బ్రహ్మర్షి దేశ మనియు నివియన్నియు నుత్తర భరతఖండమునందు సింధుగంగలమధ్యనున్నవనియు స్మృతులలోనున్నవి. మఱియు కురుక్షేత్రప్రశంస బ్రాహ్మణములందునున్నది. శతపథబ్రాహ్మప్రవర్గకాండలో,

శ్రు॥ కురుక్షేత్రం దేవ యజనం సర్వేషాం భూతానాంబ్రహ్మసదనం॥

అనియు ఋగ్వేదమందు.

ఇమంమే గంగే యమునే సరస్వతీ శతద్రీ॥

అనియు ప్రశంసగలదు. మరియు దేవతలనివాసము త్రివిష్టపమని చెప్పుటచే దానియాభాస టిబెట్ దేవతాస్థానమనియు మరియువది ఉత్తరకురుభూమిలోనిదనియు దానిలో శ్వేతగిరి కైలాసమానస సరోవరాదులున్నవనియు భారతాములందున్నది.

7 ఆర్యస్త్రీజనవైదుష్యముజూడ బూర్వకాలపు స్త్రీలు ఉత్తమవిద్యల నభ్యసించినట్లు కొన్నిప్రమాణములచే దెలియబడుచున్నది.

శ్లో॥ యవివాచాంప్రవదర్శాని ద్విజాతిరివసంస్కృతాం।
రావణంమన్యమానామ్మాం సీతాభీతాభవిష్యతి॥

అను శ్లోకమున ఆంజనేయులు సీతతో నేను ద్విజాతులవలె సంస్కృతభాషతో మాట్లాడినచో రావణునిగా నన్నుదలచి సీత భీతినొందునని ఆలోచించినట్లుండుటచే ఆకాలపు ఆర్యస్త్రీలకు సంస్కృతభాషయందు చక్కని పాండిత్యముండినట్లు దోచుచున్నది. మఱియు బృహదారణ్యక పంచమాధ్యాయ షష్ఠాష్టమ బ్రాహ్మణములందు వాచక్నుని దుహితయగు గార్గి భగవద్యాజ్ఞవల్క్యులను సర్వజగత్తు దేనియందు ఓతప్రోతముగనున్నదని ప్రశ్నజేసెను. యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి వేదాంతము ఉపదేశించెను. మఱియు ఋగ్వేద చతుర్థాష్టక ప్రథమాధ్యాయమందున్న, సమిద్ధో అగ్నిరితి అను షడృక్కులుగల సూక్తము అత్రిపుత్రికయగు విశ్వావరఅను స్త్రీ తనతపోబలముచే గనిపెట్టి దానికి ఋషికయెయ్యెను. ఈమె మంత్రదృష్టియే గాక యజ్ఞకర్త్రియు గూడా నైయుండెను. ఇడాదేవి అను ఆమె ఋగ్వేదమునందలి ప్రథమాష్టకములో ద్వితీయాధ్యాయమునందలి ముప్పదినాల్గవ వర్గాదిని, త్వామగ్నే ప్రథమయను కొన్ని ఋక్కులకు ఋషికయగుటయే గాక వేదకాలమందలి నహుష రాజునకు ధర్మోపదేశికురాలుగా ధర్మముల నెఱిగించుటకు అప్పటి ఆర్యులచే నియమింపబడియుండెను. వాగ్దేవి అను ఈమె ఋగ్వేదముయొక్క 10 వ మండలములో 175 వ సూక్తమీ వాగ్దేవీరచితము. ఈమె తత్త్వకోవిదయగు వనితాశ్రేష్ఠము. అంబృణ ఋషిపుత్రి ఈమెచేరచియింపబడిన ఈసూక్తమునందు తన యాత్మస్వరూపవర్ణముచేసి జీవ బ్రహ్మ వర్ణనమును సిద్ధాంతీకరించెను. మఱియు విశ్వాలాదేవి అను ఈమెయును అపలాదేవిఅను ఈమెయును వెండియు శ్రద్ధాదేవిఅను ఈమెయును (1) ఋగ్వేదమందలి ప్రథమాష్టకములోని 13వ ఋక్కునకును, (2) ఋగ్వేదమునందలి 8 వ మండలములోని 80వ సూక్తమునకును, (3) ఋగ్వేదమునందలి 10 వ మండలములోని 151 వ సూక్తమునకును, మంత్రద్రష్టులైరి. మఱియు భవభూతి మహాకవి ఉత్తరరామచరిత్ర ద్వితీయాంకమందిటుల వనదేవతాత్రేయుల సంవాదమును బ్రదర్శించిరి.

వన దేవతాకుతః పునరిహాగమ్యతే. కింప్రయోజనం వా దండకా
రణ్య ప్రవేశే॥

అత్రేయీ। అస్మిన్నగస్త్యప్రముఖాః ప్రదేశే భూయాంస ఉద్గీథ
విదో వసంతి। తేభ్యోధిగంతుం నిగమాంతవిద్యాం వాల్మీకి పా
ర్శ్వాదిహా పర్యటామి॥

వ్యాఖ్యానే। ఉద్గీథవిదః ఉద్గీథసామ వేదస్యాంశ విశేషః। తంవి
దంతి। ఇతితద్యోక్తాః ఉద్గీథాద్వేతార ఇత్యర్థః। నిగమాంతవిద్యాం।
నిగమాః। వేదాః। తేషాంఅంతాః। చరమభాగాః। వేదాంతాః
ఉపనిషదః తద్రూపాం విద్యాం॥

మఱియు కాదంబర్యాదిగ్రంథములయందు విశేషించిగనదగు.
ఇట్టి బహుప్రమాణములచేత నాకాలపు ఆర్యస్త్రీలు వైదికవిద్యయుం
దును పాండిత్య మవలంబించుకొనినట్టు గోచరించుచున్నది. గ్రంథవి
స్తరభీతిచే విస్తరించనైతిమి.

8 ఆర్యజనుల విద్యాశిల్పాది విజ్ఞానముజూడ ఆశ్చర్య మొనరిం
చుచున్నది. ఆర్యశబ్దము పూజ్యార్థమందు ప్రాచార్యులు ప్రయోగిం
చినను ఆర్యులు మూఢులనియు పెట్టిగొల్లవాండ్రవలె పశ్వాదిపాలకుల
నియు జానపదులనియు నాగరికగ్రంథము లేశ మెరుగరనియు ప్రస్తుత
పు గొందరియాగ్రహము. అదిమీమాంస్యము ఇంగ్లీషులోనగు నైరో
పుభాషలలో నీవిషయము మెండుగనున్నది. ఈవిషయమై సంస్కృత
మున భట్టయజ్ఞేశ్వరశాస్త్రులవారను పండితోత్తములు తమ ఆర్యవి
ద్యాసుధాకరములో నుపన్యసించిరి. కావున అందున గొన్ని ప్రమాణ
ములను ఇందున సంగ్రహించి వ్రాయబూనితిమి. మొదట అశనా
చ్ఛాదనములను పిదప నివాసములను సంపాదించుట. తర్వాత సంసా
రము, కులపుకట్టుబాటు, ఐకమత్యము, పురదేశనిర్మాణములు, కృషి
వాణిజ్యాదులు, వర్ణాశ్రమధర్మములు, ఆచారవ్యవహార ప్రాయశ్చిత్త
ములు, రాజ్యపరిపాలనము, సాంగ్రామిక ధర్మములు, విద్యాశిల్పాది

ఖ్యానంగములోనగు వానిని బడయుట జనులకు-గాలానుసరణముగ గ నుచునునది ఆబాలగోపాల ప్రసిద్ధముగద. ఇందునగూర్చియే ఋగ్వేద 3 వ అష్టకము 8 వ అధ్యాయము 9 వ వర్గము 4 వ ఋక్కునందిట్టుల నున్నది.

శ్రు॥ శునంవాహాః శునంనరః శునంకృషతులాంగలం॥

ఈశ్రుతికర్థమేమన్నను ఎడ్లు సుఖముగ భారమునువహించుగాక. వ్యవసాయదార్లగు నరులు సుఖముగ కృషికర్మ జేయుదురుగాక. నాగలితో లెస్సగ భూమిని దున్నుదురుగాక. ఆలాగే ఋగ్వేదమందున్నదిజూడుడి,

శ్రు॥ స్యోనాపృధివీభవా వృక్షరాజనివేశనీ। యఛ్చానః సర్మ సప్రధఇతి. 1, 2, 6, 15.

ఓభూమీ మేము సుఖముగను నిష్కంటకముగను గాపురముండుటకును నివేశనమిమ్మా. మఱియు విశాలమగు నిల్లిమ్మా. ఇత్యాది శ్రుతులచే నార్యులు కృష్యాదికముచే ధాన్యసంగ్రహముచేసి గిరికాననాదులందుగాని గ్రామనగరాదులందుగాని తమనగరాదులను గట్టుకొనినని తోచును. మఱియు వారికి బుర గ్రామాది వ్యవస్థగూడ నున్నట్లు ఋగ్వేద తృతీయాష్టక షష్ఠాధ్యాయమందీరీతి నున్నది.

శ్రు॥ శతమశ్మన్మయీనాం పురామింద్రోవ్యాస్యత్। దివోదాసాయదాశుషే॥ 3, 6, 22, 20.

రాళ్ళతోగట్టబడిన నూరునగరములను దనయజమానుడగు యజ్ఞముచేయించినవానికి ఇంద్రుడిచ్చెను. కృష్ణయజుర్వేదములోన మఖఖండలో నిట్లున్నది.

శ్రు॥ ఇమాగ్ంరుద్రాయ తవసేకపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహేమతిం। యధానః శమసద్ద్విపదే చతుష్పదేవిశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతురమితి॥ 4, 5, 10, 3.

మా పుత్రకళత్ర భృత్యవర్గమునకు గవాశ్వమహిష్యాది వర్గము
నకు సుఖము గలుగునటులు మఱియు నీయూరిలోనుండు సర్వప్రాణిజా
తమునకు నిర్దుఃఖ సుఖము గలుగునటులు బలశాలి, జటాజూటధారి, తప
స్వి, శత్రుసంహారి, అగు రుద్రదేవుని ధ్యానించెదము.

శ్లో॥ తక్షన్నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖంరథమితి॥

ఋగ్వేదం 1, 2, 1, 3,

అశ్వినీకుమారులిద్దఱుకు ఋభువులు వజ్రవానిచే సుఖకరమగు
రథమును జేయించిరి.

మఱియు కృష్ణవేదాంతర్గత తైత్తిరీయోపనిషత్తునందు.

యశ్ఛందసామృషభో విశ్వరూపః। ఛందోభ్యోధ్యమృతాత్సం
బభూవ। సమేంద్రోమేధయాస్పృణోతు। అమృతస్య దేవధార
ణోభూయాసం। శరీరం మేవిచర్షణం। జిహ్వామే మధుమత్తమా
కర్ణాభ్యాంభూరి విశ్రువం। బ్రహ్మణః కోశోసిమేధయాపిహితః।
శ్రుతంమేగోపాయ। ఆవహంతీవితన్వానా। కుర్వాణాచీర మా
త్మనః। వాసాగ్ంశ్చమమగావశ్చ। అన్నపానేచ సర్వదా। తతో
మేశ్రియమావహ। లోమశాంపశుభిస్సహస్వాహా ఇత్యారభ్యప్రతి
వేశోసిప్రమాబాహి ప్రమాపద్యస్వ ఇత్యంతంద్రష్టవ్యం।

అమృతస్వరూపమగు వేదములవలన పుట్టి వేదములలో శ్రేష్ఠ
మై సర్వస్వరూపమును పరమేశ్వర స్వరూపముగను ఓంకారము నన్ను
మరుపులేనిబుద్ధితో సృజించునుగాక. ప్రకాశస్వరూపమునగు ఓ ప్రణ
వమా బ్రహ్మజ్ఞానముయొక్క ధారణ నాకు కలుగునుగాక. నాశరీరముపరి
శుద్ధమగునుగాక. నాజిహ్వా మాధుర్యము కలది యగునుగాక. శ్రోత్ర
ములచేత నేను అనేకములు వినినవాడనగుదునుగాక.

ఓంకారమా నీవు బ్రహ్మకుస్థానమై మరుపులేని బుద్ధిచేత కప్ప
బడినదానవైతివి. ఇటువంటి నీవు నేనువినిన ఆత్మజ్ఞానము మొదలగు వి

జ్ఞానమును రక్షించుము, నాకువస్త్రములను కలుగజేయుచు గోవులను వృద్ధిపొందించుచు ఎల్లప్పుడు అన్నపానములను కలుగజేయుచు రోమములుగలమేకలు గొఱ్ఱెలు మొదలగు ఇతరపశువులతో గూడుకొనియున్న మహాలక్ష్మిని పొందింపజేయుమా. పూజార్హమగు ఓ ప్రణవమా బ్రహ్మవేత్తలు నన్నుగూర్చి వత్తురుగాక. సమస్తజనులలో నేనుకీర్తిగలవాడనగుదునుగాక. ధనవంతులలో మిక్కిలి శ్రేష్ఠుడనగుదునుగాక. ఆబ్రహ్మకు స్థానభూతమైన నిన్ను నేను ప్రవేశించుదునుగాక. అటువంటి నీవు నన్ను పొందుమా. అనేకభేదములుగల అటువంటి నీయందు నేను పరిశుద్ధిచేసుకొనుచున్నాను. బ్రహ్మస్వరూపమగు ఓ ప్రణవమా నీళ్లు పల్లపుప్రదేశమునకు పోయెడి విధముగానున్నూ, నెలలు సంవత్సరమును పొందినవిధముగానున్నూ, బ్రహ్మవేత్తలు సమస్తదిక్కులనుండి నన్ను గూర్చివత్తురుగాక. ఓ ఓంకారమా, నీవు నాకు సమస్తపాపములవలననైన దుఃఖమును బోగొట్టుటకు శ్రమనుబొందినవానికి గృహమువలెనున్నావు. ఆకారణమువలన నన్ను ప్రకాశింప జేయుమా. నీవు నన్ను పొందుమా. నీస్వరూపముగానే జేయుమా. మఱియు కృష్ణయజుర్వేద సంహితలో నిట్లున్నది.

శ్రు॥ వాజశ్చమే ప్రసవశ్చమే ప్రయతిశ్చమే॥
చమకఖండ 4, 7, 1, 1.

నాకు సంసారోపయుక్తములగు గ్రాసవాసాదుల నియ్యమని రుద్రస్తుతి దెలియుచున్నది.

ఋగ్యజుర్మంత్రములలో శెక్కుచోట్ల తంతువాయ కర్మారాది దృష్టాంతములుగలవు. కానవట్టి శృత్యాదులవల్ల నార్యులకు దారపుత్రాదులు, పశ్వాదులు, గృహక్షేత్రాదులు, కృషి, రథకారగృహనగర నిర్మాణాదుల కౌశలములు, అపరిమిత దేవతాభక్తి ఈశ్వరుడు సర్వవ్యాపకుడు అను జ్ఞానముగలవని ద్యోతితమగును.

శ్రు॥ ఆయాహీంద్ర పథిభిరీళితేభిర్యజ్ఞమిమంనో భాగధేయం జుష
స్వతృప్తాం జహుర్మాతులస్యేవ యోషాభాగస్తే పైతృష్వ
సేయీవపామివేతి. ఋ. 5, 4, 23.

ఓ ఇంద్రుడా మేము నీకు జేయుస్తుతులలో వచ్చి మేమిచ్చుహవిర్భాగముగొని అజ్యాదులచే సంస్కరింప బడినవపను జ్వాలప్రేమతో ననుభవింపుమా. ఎటులన మేనమామ కూతురిని బెండ్లి జేసికొనిన మేనల్లునివలెను, మేనత్తకూతురిని జేసుకొనిన మేనల్లునివలెను, తృప్తిపొందుమా అని ఇంద్రప్రార్థన. ఇది ఉపమానస్థానీయమగు ద్వివిధాచారమును సూచించుచున్నది. ఇందువలన ప్రాచీనకాలమునందు గూడ బాంధవ్యము ప్రాతప్పులేని చోటను జేసుకొనిరనియు, ద్రవ్యాశ దూరబంధువులతో సంబంధము చేసికొనకుండుటగూడ నుండెననియు దెల్లంబు. కాని మన్వాదిస్మృతుల కాలములో వానినిందజూచినట్టి సంబంధమువల్ల గలిగిన నష్టమరసి దానిని ప్రస్తుతపు ఆచారముక్రింద మార్చిరని యూహింపనగు. వివాహకాల నియమము శ్రుతులలో నాకగుపడలేదు. వివాహమంత్రములు జూచినచో వధూవరులు వానియర్థమును దెలుసుకొని దీక్షవహింపవలయునని యగపడు. ఎప్పుడు బాల్యవివాహాచారము ఉద్భవించినదో యిక దెలుసుకొనదగియున్నది. మఱియు ఋగ్వేదములో దితృతీయాష్టక షష్ఠాధ్యాయగతమగు 12వ వర్గములోని 9వ ఋక్కు.

శ్రు॥ భూయసావస్నముచరత్కనీయో విక్రీతో॥

అను నీవాక్యమువల్ల స్పష్టముగ క్రయవిక్రయరూపమగు వాణిజ్యము వ్యక్తీకరింపబడెను. అధర్వణసంహితలో పుత్రసంతానమునకు కృషికి, పశ్వశ్వాదివృద్ధికి, వాణిజ్యలాభమునకు, మంత్రానుష్ఠానంబులు విశేషముగ జెప్పబడినవి. మనుస్మృతిలో స్పష్టముగ విద్యా, శిల్పము, భృతి, సేవ, గోరక్షణము, వాణిజ్యము, వ్యవసాయము, ఆయుధభిక్షము, కుసీదములవల్ల జీవనము చేయవగునని యున్నది. ఋగ్వేదప్రథమాష్టక ద్వితీయాధ్యాయమందలి,

శ్లో॥ వేదా యో వీనాం పదమంతరిక్షేణపతతాం: వేదనావః సముద్రియ ఇతి॥

అష్టమాష్టక ద్వితీయాధ్యాయమందలి,

శ్లో॥ తైవీంనావంసస్త్వితా) ఇత్యాది॥

మంత్రములలో నౌకాయానాది వర్తక వ్యాపారములు సూచింపబడినవి. బర్మాయవన దేశముల రాకపోకలకు గంగానదీతరణమునకు నావయాత్ర శ్రుతులందేగాదు స్మృతియందు కూడ నగుపడుచున్నది. పరాశరస్మృతి విశేషములను వ్రాయుతరి నావయాత్ర ఔత్తరీయశిష్టులచే బరిగృహీతముగనుక వారికది దూష్యముగాదని బోధాయన వాక్యమున కనుకూలముగ మాధవులు సముద్రయానమున కనుజ్ఞనిచ్చిరి. యుద్ధసామగ్రి వేదత్రయమునందు విరళముగను అధర్వణమునందు విశేషముగను ఉపపాదింపబడినది. శస్త్రాస్త్రప్రయోగములు సరహస్యములతో దురీయవేదమునందు జెప్పబడియున్నవి. తురీయవేదమన అధర్వణవేదమని యన్నదగును. ఈశస్త్రాస్త్రవిద్య భారతయుద్ధముతో దుదముట్టె. ఋగ్వేద పంచమాష్టక ప్రధమాధ్యాయములోని 19వ వర్గములో 1వ ఋక్కునందు లోహమయకవచమును దొడుగుకొని గుప్తగాత్రుడై శత్రుపరాజయమునకై యుద్యుతుడైనరాజు ధనుర్బాణపాణులగు సైనికులు ఇటుల వర్ణింపబడిరి.

శ్లో॥ జీమూతస్యేవభవతి ప్రతీకం యద్వర్మీయాతి సముదముపస్థే। అనావిద్ధయాతన్వా జయత్వం సత్వావర్మణో మహిమాపిపర్తు॥

ఓరాజా కవచముదొడుగుకొని యుద్ధమధ్యమందు బోవుచున్నప్పుడు నీదేహము మేఘమువలెనున్నది. ఎండకాలమునందలి తాపమునుహరింపగలిగి శీతలజలపూరితమగు మేఘమువలె పరరాజ పరితాపకరమై శౌర్యపూర్ణమైనను నీలలోహిత కవచావృతమగు నీదేహమువల్లగ ప్రజానుగ్రహాముఖమై యున్నది. మఱియు ఋగ్వేదములో 8, 8, 28,

11, 4, 2, 8, 4, ఇంద్రాగ్ని దేవతలను యుద్ధమందు సహాయము చే యుమని నార్యులు వేడినట్లున్నది. కృష్ణయజుస్సంహితా ప్రథమకాండ అష్టమప్రశ్నలోని 9వ అనువాకములో రాజసూయ యజ్ఞమున కంగ ముగరత్ని హోమమను కర్మము.

శ్రు॥ బార్హస్పత్యం చరుం నిర్వపతి॥

ఇత్యాది వాక్యముచే విధింపబడినది. ఆకర్మ 12 పగళ్ళలో జేయ సాధ్యము. మొదటినాడు యజమానుడగు రాజు బ్రాహ్మణగృహమున కు వెళ్ళి బృహస్పతి చరువుచే దేవతను పూజించి తెల్లనివిరుదుగల యె ద్దును యజ్ఞాంగదక్షిణముగ వానికిచ్చును. పిదప 2వ నాడు క్షత్రియ గృహమునకు, 3వ నాడు పట్టపుదేవియగు మహిషీగృహమునకు, 4వ నాడు ప్రియురాలగు రాజభార్యయైన వావాతయింటికి, 5వ నాడు అ ప్రియురాలగు రాజపత్నియైన పరివృక్తయింటికి, 6వ నాడు సేనాపతి యింటికి, 7వ నాడు సారథియింటికి, 8వ నాడు అంతఃపురాధ్యక్షుని యింటికి, 9వ నాడు గ్రామముఖ్యుడనబడు గ్రామణియింటికి, 10వ నాడు కోశాధ్యక్షునియింటికి, 11వ నాడు ప్రజలవల్ల నారవభా గము పన్ను వసూలుచేయునట్టి భాగదుఘునింటికి, 12వ నాడు ద్యూ తకారునియింటికి బోయి శ్రుత్యుక్తప్రకారము ఆయా దేవతలకు నాయా యిండ్లలో యజమానుడు పూజచేయవలయునని శ్రుతిలోనున్నది. మరి యు ఛాందోగ్య సప్తమప్రపాఠకములో సనత్కుమార బ్రహ్మర్షులు నా రదునకు నామాద్యుపాసన లుపదేశించినట్లున్నది. దాని ప్రథమఖండ లో నధ్యాత్మ విద్యాగ్రహణయోగ్యతను బరీక్షించుటకు గురువు శిష్యు ని నీవేవిద్యలను నేర్చితివని యడుగ రెండవ వాక్యములో నారదుడిట్లు నుడివెను,

శ్రు॥ సహోవాచర్గ్వేదం భగవోధ్యేమి యజుర్వేదగ్ం సామవేద మాథర్వణం పఞ్చమం వేదానాంవేదం పిత్ర్యగ్ం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూ

తవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పజన విద్యామేతద్భ
గవోఽధ్యేమి॥

శ్రీభగవంతుడా ఋగ్యజుర్వేద సామాథర్వణ మహాభారతముల
ను, వ్యాకరణమును, శ్రాద్ధకల్పమును, గణితమును, ఉత్పాతజ్ఞానము
ను, మహాకాలాదినిధిశాస్త్రమును, తర్కశాస్త్రమును, నీతిశాస్త్రము
ను, నిరుక్తమును, వేదాంగములగు శిక్షాకల్పచ్ఛందమును, భూతతం
త్రమును, ధనుర్వేదమును, జ్యోతిషమును, సర్పవిద్యయగు గారుడము
ను, కుంకుమాదిసంపాదనమును, నృత్యగీత వాద్య శిల్పాదివిజ్ఞానము
లను నేను జదివినాను. అని నారదులు జెప్పుటచే ఆకాలపు ఆర్యులలో
సర్వత్ర విద్య సాధారణమైనదిగా యుండెనని యన్నవలయును. మఱి
యు ఈశ్రుతిస్మృతి వాక్యజాలముచే నప్పటి యార్యజనులు తేజోవంతు
లు. బహువేదశాస్త్రద్రష్టలు, ప్రజాపాలనదక్షులు, దీనరక్షకులు, స
న్మార్గప్రవర్తకులు, శూరులు, శత్రుపరాజయకుశలులు, సర్వసుఖము
లతో విజయసుఖేచ్ఛులు. మహోదారచరిత్రులు అని గోచరింపగల
దు. మెండియు లోకోపద్రవకారకులగు చోర, జార, పిశున, పాషండు
లని నిగ్రహించి దేశక్షోభవనము జేయు క్రూరకఖలులను సంహరించి నిజ
కుటుంబమునువలె ప్రజలను సన్మార్గప్రవర్తనమునందుండునట్లు పాలించి
ప్రజారాధనముజేసి స్వస్థమనస్కులై రాజులు రాజసూయాది మహాక్ర
తువులను జేసిరని ఋగ్వేదాదులలో నక్కడక్కడ ప్రశంసింప బడెను.
రాజనీతి యథర్వవేద శుక్రనీతికామందకీ మన్వాది స్మృత్యాదులలో
మెండుగ నుండుటంబట్టియు బ్రాహ్మణాదులకట్టి వ్యాసంగముహెచ్చు
గానుండుటవలనను పురాణార్యులు ఆరణ్యక పశుప్రాయులు కారనియు,
ఐహికాముష్మిక వ్యవహారదక్షులనియు, నాగరిక విశిష్టులనియు, విస్ప
ష్టముగ నరయనగునని శ్రుతిస్మృత్యాదు లుద్ఘోషించు చున్నవి. కాని
వారికిప్పటివారికంటె బరలోకచింత యెక్కువగాన నింత నాగరికత లే
కుండెననియు దెలియనగు. ఇంతియేగాక పూర్వులకు గలిగిన అసామా
ర్థ్యములను ఇప్పుడు మనము జేప్పినయెడల ఇట్టి సామర్థ్యములుగూడ

లోకములో నుండునాయని విశ్వసింప దగనియట్లుండును. అట్టిసామర్థ్యమునతో జేసినకార్యములలో అతిప్రాచీనమైన కార్యమొక్కటిగలదు. అదిఏదియన్నను సముద్రమదనము. ఇది విష్ణుపురాణములో మొదటియంశములో తొమ్మిదవయధ్యాయమున తెలియచేయబడినది.

శ్లో॥ నానౌషధీస్సమానీయ దేవదైతేయదానవాః। క్షిప్త్వాక్షీరాబ్ధిపయసి శరదభ్రామలత్విషి। మన్థానం మందరంకృత్వాయోక్త్రంకృత్వాచవాసుకిం। తతోమథితుమారబ్ధా మైత్రేయతరసామృతమ్। విబుధాస్సహితా స్సర్వేయతః పుచ్ఛంతతః కృతాః। కృష్ణేనవాసుకేర్దైత్యాః పూర్వకాయేనివేశితాః। తేతస్యముఖనిశ్వాస వహ్నినోపహతత్విషః। నిస్తేజసోసురాస్సర్వే బభూవురమితౌజసః। తేనైవముఖనిశ్వాస వాయునాస్తబలాహకైః పుచ్ఛప్రదేశే వర్షద్భి స్తథాచాప్యా యితస్సురాః। క్షీరోదమధ్యేభగవాన్ కూర్మరూపీ స్వయంహరిః మందరాద్రే రధిష్ఠానం భ్రమతోభూన్మహామునే॥

అని మొదలుపెట్టి జెప్పఁబడినది. దేవతలు దైత్యులును దానవులునను మూఁడుజాతులవారును, అనేకములగు ఓషధులను దెచ్చిశరత్కాలమేఘమువలె తెల్లగానుండెడి క్షీరసము ద్రోదకమున బడవైచిరి. అప్పుడు మంధరపర్వతమును కవ్వముగాను, వాసుగుని కవ్వపుతాడుగాను చేసిరి. అటుపైని అమృతమును తీయుటకు తలపడిరి. దేవుడు వాసుకియొక్క తోకవైపున దేవతలను ముఖమువైపున దైత్యదానవులను ఉంచెను. ఆదైత్యదానవులు వాసుకి నోటియూర్పున బుట్టుచుండిన సెగ దెబ్బతగిలి వాడిపోవుచుండిరి. ఈ వేడియూర్పుచేతనే మేఘములన్నియును తోకవైపునకు పసరబడి దేవతలపైని చల్లగా వర్షము కురియుచుండెను. మందరపర్వతము మునిగిపోకుండుటకు భగవంతుడు కూర్మ రూపియై దానిక్రింద నుండి ఆమందరమును ధరించుచుండెను.

ఈసముద్రమథన వృత్తాంతము మహాభారతమున ఆదిపర్వము లోకూడ పదియేనవయధ్యాయమున తెలియజేయబడినది. ఐతహాసకసిద్ధాంతమువారు ఇది యిట్లు పూర్వము జరిగిన వ్యాపారమయని చెప్పుదురు. ఇది అతిమానుష వ్యాపారముగాదా దీనివలన వీరిజ్ఞానాతిశయము స్పష్టపడుచున్నదిగదా. నైరుక్త సిద్ధాంతానుసారమున ఇది మన పూర్వులగు దేవతలును అసురులును గూడి అమృతము అనగా మరణము లేకపోవుటయనెడి మోక్షమును జెందుటకై చేసిన గొప్పయాలోచన. ఇందు క్షీరసముద్రమనునది పరతత్త్వము. మందరపర్వతమనునది వారిబుద్ధి. దానిచేత తరుచుటయనగా విమర్శించుట అని యిట్లు మిగిలినవానినిగూడ నిరూపింపవచ్చును.

ఈనైరుక్త సిద్ధాంతముచొప్పున నాలోచించినచో మనవారికి గల జ్ఞానాతిశయము సుస్పష్టమగుచున్నదిగదా జ్ఞానమనునది మోక్షమునుగూర్చినదనియును విజ్ఞానమనునది శిల్పాదులనుగూర్చినదనియును ఆరంభముననే జెప్పబడియెగదా. ఇట్లు జ్ఞానవిషయముననే విచారము చేసెడి మనప్రాచీనులకు బ్రహ్మవాదులని పేరుగలిగియుండెను. కావుననే శ్వేతాశ్వతరోప నిషదారంభమున, శ్లో॥ బ్రహ్మవాదినోవదంతి॥ బ్రహ్మవాదులు చెప్పుచున్నారు. అనువాక్యము వ్రాయబడియున్నది. మనప్రాచీనులు లోకాంతరమునకు వెడలి మరల ఈలోకమునకువచ్చెడి సామర్థ్యముకలవారై యుండిరి.

కావుననే మహాభారతము సభాపర్వమున నారదుడను దేవర్షిలోకపాలుల సభలనన్నిటిని వర్ణించి పండ్రెండవ యధ్యాయమున పాండు మహారాజు స్వర్గస్థుండై ధర్మరాజునకు పంపినవృత్తాంతమును తెలియజేసెను. ఇదిగాక లోమశమహాముని అర్జునుడు మొదలగు వారు దేవలోకమునకు బోయినట్లుకూడ భారతములోనే వ్రాయబడియున్నది.

ఇపుడుగూడ మెస్మరిజమ్ అను విద్యలో ఒక్కని మెస్మరైజ్ చేసిఆజీవుని శరీరములోనుండి వెలికితీసి తన ఇష్టమువచ్చిన స్థలమునకునడపించుట జరుగుచున్నట్లు ఇంగ్లీషుగ్రంథములవలననే కానవచ్చుచున్నది.

ఇందువలన తనయాత్మనుగూడ వెలికిదీసి లోకాంతరములకు న డిపించెడి శక్తి యుండవచ్చునని యూహించుటకు అవకాశము కలిగి యున్నది.

ఇందుకు దృష్టాంతముగా శంకరాచార్యులవారు తమ శరీరము నుండి ఆత్మను లింగశరీరముతో గూడ యోగశక్తిచేత పైకిదీసి మరి యొక్క శరీరమున బ్రవేశపెట్టినట్లు మాధవాచార్య విరచిత శంకర వి జయమున తొమ్మిదవసర్గమున జెప్పబడినది.

ఇదిగాక కొందరుఋషులు ఈభూలోకమున ఆకాశమార్గమున తిరుగుచుండిరి. వారికి చారణులనిపేరు. ఈయంశము రామాయణ ము సుందరాకాండమున 55వ సర్గమున స్పష్టమగును.

ఆరామాయణములోని ఆసర్గవలననే శ్రీరాములవారి కాలము నకే శకున శాస్త్రము సుప్రసిద్ధముగ నున్నట్లు కానబడు చున్నది. ఆ సర్గమున.

శ్లో॥ సనిమిత్తైశ్చ దృష్టార్థైః॥

అను శ్లోకమున్నదిగదా నిమిత్తములనగా శకునములు.

ఇదిగాక శ్రీమద్రామాయణముననే త్రిజటకు స్వప్నమయ్యెనని యును ఆస్వప్నమువలన శ్రీరామమూర్తికి క్షేమము కలుగుటయు రా క్షసులకు కీడు కలుగుటయు స్ఫుటమగుచున్నదనియును త్రిజట తెలు సుకొనెననియును గూడ వ్రాయబడియున్నది. దీనివలన స్వప్నశాస్త్ర ముగూడ నప్పటికే వాడుకలోనున్నట్లు కానబడుచున్నది.

ఇదిగాక విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులను తన యజ్ఞసంరక్ష ణమునకు తీసుకొని వెడలునప్పుడు వారలకు మార్గాయాసంబును ఆకలి యును దప్పికయును లేకుండుటకు బలయనతి బలయుననిమెడి రెండు విద్యల నుపదేశించెనని రామాయణము బాలకాండము 22వ సర్గము నం జెప్పబడియున్నది.

ఇవి మంత్రములనియును ఈమంత్రములకట్టి సామర్థ్యముకలదని యును నమ్మనివారుకూడ అట్టిఓషధీ విశేషములను వారికియిచ్చియుం దురనివిశ్వసించుటకు అవకాశముకలదు. ఎట్లంటేని ఇప్పుడు దక్షిణాది మిరికాఖండంబునకొక్కా అనియొక్క యోషధికనుగొనబడెనని అధికా ధముతోగూడిన ఆకులుకలది. దానిఆకులకు సున్నమును మొదలగున వివ్రాసి ఆయాకులను నమిలినవో ఆకలికలుగదు. గనులు మొదలగు వానిని త్రవ్వినప్పటికిని కొండలు మొదలగు వానిని ఎక్కినప్పటికిని. ని ట్టూర్పుగలుగదు. ఈయోషధివల్ల జేయబడిన కొకైన్ అనెడిసత్తును నీటితోగలపి మన యవయవములకు వేనికైనను వ్రాసినయడల అస్థల మున కత్తితోకోసినను మనకు తెలియదు. పూర్వము సుప్రసిద్ధముగా నుండిన ద్రోణాచలాదులలో నెట్టియోషధులుండినవో మనకు తెలియ దుగదా ఇందుచేతను,

సంజీవిని యున్నదనుటకూడ విశ్వసింపదగి యున్నది వైద్య శాస్త్రమున చరక సుశ్రుత రసార్ణవాది గ్రంథములయందు దివ్యౌషధి ప్రకరణమని యొక్క ప్రకరణముకలదు. దానిలో అనేకదివ్యౌషధులు చెప్పబడినవి. వానిలక్షణములను వానిగుణములనుగూడ ఆగ్రంథము అవలననే చెప్పబడి యున్నవి.

మనపూర్వులు మృతసంజీవియనువిద్యను ఎఱిగినట్లుకూడ భారత ములో నాదిపర్వమున 68వ అధ్యాయమున కానబడుచున్నది.

ఈకలియుగముననే పుట్టిన సిద్ధనాగార్జున తంత్రమని పేరుగల క క్షపుటమునగూడ నీవిద్యవ్రాయబడియున్నది. అయితే ఈవిద్యపూర్వ ముండెనని నమ్మించుటకు ఇప్పటికుండెడు సాధన సామగ్రులు చాలవు. క్రమముగామాత్రము ఈవిద్య పూర్వముండెనని నమ్మింపదగిన నిదర్శ నములు లభింపవచ్చునని తోచుచున్నది.

తిరస్కరణియను మరియొక్క విద్యకూడా నుండెనని నలచరిత్ర మున సుస్పష్టమేకదా, ఈవిద్యయే అదృశ్యకరణమనుపేరున సిద్ధనాగా ర్జున తంత్రమునకూడ కానబడుచున్నది.

ఇప్పుడు యూరోపియను పండితులు బెల్లూన్ అని యొక్క వ్యోమయానమును కల్పించియున్నారు. అది గాలికి పరాధీనమై ఎటుగాలి కొట్టునో అటునడుచుచున్నది. గాని లెస్సగా యథేష్టముగానడిపించుటకు శక్యముకాకున్నది.

పూర్వకాలమున యథేష్టముగా నడిపింపదగిన విమానములను మనపూర్వులు వాడుకజేసిరి. అందుకు నిదర్శనము ఉపరిచరవసువు ఇంద్రునిచే నీయబడిన విమానదర్శనము కలవాడై ఆకాశమునసంచరింపుచుండెనని మహాభారతమున ఆదిపర్వములోనున్న వృత్తాంతమును అందరు గుర్తెరిగియేయున్నారు. ఇంతమారుమూలలలో వెదుకనేల శ్రీరామమూర్తి పుష్పకముమీద అయోధ్యానగరమును చేరలేదా.

మనప్రాచీనులకు దివ్యదృష్టియనియొక్క విద్యకూడకలదు. దానింబట్టి వారు వారలకండ్లకు కానరానివానింగూడ తెలుసుకొను చుండిరి. కావుననే మహాభారతము ఆదిపర్వమున శకుంతలను దుష్యంతుడు పరిగ్రహించిన యంశమును తరువాత తనయాశ్రమమునకుజేరికణ్వమహాముని దివ్యదృష్టిచేత కనుగొనెనని వ్రాయబడినది.

ఇవిగాక అక్షయహృదయమనియును, అశ్వహృదయమనియును, రెండువిద్యలు మనప్రాచీనార్యులలో గలిగి యుండెను. అందు అక్షయహృదయమను నది తాడిచెట్టునుజూచి దానిలో నొక్కొక్క కొమ్మకు ఆకులు పూవులు కాయలు మొదలగునవి ఎన్నేసి కలవో కనుగొనుట. దీనిని నలమహారాజునకు ఋతుపర్ణుడు ఉపదేశించెను. ఈవిద్యను ధర్మరాజునకు బృహదశ్వుడుపదేశించినట్లుగూడ భారతము అరణ్యపర్వమువల్లనే తెల్లంబగుచున్నది. అశ్వహృదయమనగా అశ్వముయొక్క ఉద్దేశ్యమును కనిపెట్టుటయు దానికి తనహృదయమును తెలియజేసి తనయిచ్ఛవచ్చునట్లు దానిని నడిపించుటయు మొదలగునది. దీనిని నలమహారాజెరిగి యుండెను.

అర్జునుడు బిడుగును తనచేత ద్రొన్నెలో నిమిడ్చెననికూడ భారతమున వ్రాయబడియున్నది.

ఇవన్నియు నుండ నిందుమనప్రాచీనులు కల్పించిన లిపివంటి పరిశుద్ధమైనలిపి ఈభూమండలమున మఱియేదేశము నైనంగలదా.

ఇప్పుడు నాగరికతలకు చరమావధిగాతలబడుచున్న స్త్రీవిద్యాభ్యాసము మనప్రాచీనులలో కలిగి యుండెనను విషయము నింతకు బూర్వమే గ్రహించితిమి అయినను మరియొకని దర్శనము జూడుడీ. మేన, వైతరుణీ అను నీయిద్దరు స్త్రీలు బ్రహ్మవాదినులై యుండిరని విష్ణుపురాణముల మొదటి యంశములో పదివ యధ్యాయమున జెప్పబడి యున్నది. ఇట్టివి మన ప్రాచీనుల జ్ఞానాతిశయమునకు ధ్వజములుగానున్నవని గుర్తెరుగతగి యున్నవి.

9 ఆర్యజనుల మతాచార వ్యవహారముల జూడుడీ. సంహితలో ప్రాయికముగ అగ్నీంద్ర మిత్ర వరుణ విష్ణు గరుత్మాన్ రుద్ర వాయు సూర్యచంద్రులలోనగు దేవతలనుగూర్చి పూజలుగల కర్మలుజెప్ప బడినవి దీనినిబట్టి అధిభూత అధిదైవముల స్తోత్రములు వేదమందు మెండుగలవనియు. వానియనుగ్రహముచే నార్యులకొర్య నిర్వాహణమయ్యెననియు దెలియవచ్చుచున్నది. ఉత్తరహిందూదేశములోని సింధుగంగానద్యాదిప్రాంతములను నాక్రమించిన పిదప వసుగర్భయగు భూమివిశేషఫలవంతమై యుండుటబట్టి హాయిగా యజ్ఞాదులచే దైవారాధన చేయుటకు ఐహికాముష్మికాభ్యుదయముల ననుభవించుటకు వీలు గలిగె. దీనిచే బ్రతి పుట్టను జెట్టును వారు దైవసమానముగ జూచిరనిభ్రమపడవలదు. ఈశ్వరవిభూతి సర్వత్ర చరాచర ప్రపంచమునందు వ్యాపించెననుసంగతి ఆర్యులకు దెల్లంబు. ఋగ్వేదస్థపురుషసూక్తము యజుర్గత రుద్రాధ్యాయము జగదీశ్వర సార్వాత్మ్యమును లెస్సగ బోధించుచున్నవి. ఈశ్వరసర్వవ్యాప్తి యితరమతగ్రంథములలో నింతగ జెప్పబడలేదని పాశ్చాత్యులుగూడ నొప్పియున్నారు. ఇంకొకవిశేష మే

మన ప్రతివస్తువునకు అధిదేవత యున్నది. దానియనుగ్రహము చేతనే ఫలములభించును. అనుసంగతి సంహితాభాగమువల్ల దెలియనగు. అనగా చేతనాచేతనములకు సంబంధము అనిర్వచనీయమనుట వేదత్రయమందున్న కర్మాంగావబద్ధోపాసనలను, అధర్వవేద ఋగర్థములను అరసినచో బ్రపంచములో మనకగుపడని మితిలేని శక్తిమత్తులగు దేవతలున్నవనుట యొప్పనగు. ఈయాశయము జైమినిసమ్మతము గాకున్నను బాదరాయణాభిమతము పూర్వాచార్యస్వీకృతము వృద్ధపరంపరాగతము. మఱియు నింద్రుడు మొదలగు దేవతలు వివిధరూపము గలిగినను వారియందు చరాచరాత్మకమగు జగత్తునందు అనువృత్తముగ బ్రవహించుచున్న చైతన్యము ఒక్కటియని ఋక్సంహితలో నున్నది.

> ఇంద్రం మిత్రం వరుణ మగ్నిమాహు రథోదివ్యః సుపర్ణో గరుత్మాన్ । ఏకంసద్విప్రా బహుధావదంత్యగ్నిం యమంమాతరిశ్వాన మాహుః॥
>
> తదేవాగ్ని స్త ద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః। తదేవ శుక్రమమృతం తద్బ్రహ్మతదాపః సప్రజాపతిః॥
>
> సబ్రహ్మసశివః సేంద్రః సోఽక్షరః పరమస్స్వరాట్ సఏవ విష్ణుః సప్రాణః సకాలోఽగ్నిః సచంద్రమాః॥

అను నీరెండువాక్యములు నారాయణములోనున్నవి. ఇత్యాది శృతి తాత్పర్యమేమన అగ్న్యాదిదేవతలు పృథుగుపాస్యలు పృదక్ఫలదాయకులుగాన ఒకరికంటె నొకరువేరని తలంచదగని ఆభ్రిమ నివారణమును శృతి యేకకంఠరవమున జెప్పినను రాగద్వేషాభిభూతులై ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతస్థులు తత్వమునుగూర్చి కలహించిరి. ప్రథమము అగ్న్యుపాసనను తత్సంబంధులగు దేవతల ఉపాసనలను తదనంతరము మిత్రోపాసనను తత్సంబంధదేవతల ఉపాసనలను చెప్పి వారిద్దరు వరుసగ రుద్ర విష్ణు గణదేవతలనినుడివి ఈరెండు శివశక్తులగు నెడతెగని జంటలు తుదకు వీనికి నామమాత్రభేదమని చెప్పి

వీని ప్రకృతియగు చైతన్యము ఏకమేయనియు దానికి మహర్షులు అనేకనామములిడిరనియు దెలియునగునని శృతి పలుకుచున్నదని కొందరందురు. ఈయర్థమే వేదాంతములను నుపనిషత్తులలో లెస్సగ ప్రతిపాదింప బడియె. కాన వేదతాత్పర్యమేమన ఒకఆత్మయే స్థావరజంగమరూపములగు సర్వభూతములందు గూఢముగనున్నను చిత్తమను నుపాధి విశేషతారతమ్యము ననుసరించి కూటస్థనిత్యుడు ఏకరూపుడగు ఆత్మతారత మైశ్వర్యశక్తి విశేషము గలిగియున్నాడని తస్యయ ఆత్మానమావిస్తరాం వేద లోనుగాగల ఐతరేయ బ్రాహ్మణాది శృతులు చెప్పుచున్నవియట. సూక్ష్మబుద్ధితో నాలోచించిన నీరెండుమతములు ప్రధమమతముతో సంక్రమింపజేయనగు. ఏకమైన బ్రహ్మయే అనంతదేవతారూపములైనటులు వానికి భిన్ననామములు ఉపాసనార్థ మియ్యబడినట్లు రెండభిప్రాయములకు సామరస్యముచేయుచు వాజసేయశృతి జెప్పుచున్నది. బృహదారణ్యక పంచమాధ్యాయ నవను బ్రాహ్మణములోని మొదటి 9 వాక్యములజూడనగు. దీనికి దెలుగుతాత్పర్యమేమన జనకసభలో గార్గి ప్రశ్నానంతరము శ్రకల పుత్రుడగు విదగ్ధుడను శాకల్యుడు ఓయాజ్ఞవల్క్యుడా దేవతలెందరని ప్రశ్నజేసెను. యాజ్ఞవల్క్యుడు ఓ శాకల్యుడా వైశ్వదేవమను శస్త్రము నివిత్తను ఛందస్సునందు జెప్పబడినది. దానిలో నెన్నిపదములున్నవో అన్నిసంఖ్యలుగలదేవతలను ఉపాసింపనగుననియెను. అంత శాకల్యుడు నివిత్తసమంత్రమందు ఎన్ని దేవతలు జెప్పబడినవి అని యడుగ యాజ్ఞవల్క్యుడు చెప్పినదేమన 3033003 అనియె శాకల్యుడు ఎందరుదేవతలుఅని తిరిగి యాజ్ఞవల్క్యునడుగ 33 గ్గురని యతడు జవాబిచ్చెను. తిరిగిదేవతలెందరని అయిదుసార్లు ప్రశ్నచేయ ఆరుగురనియు, ముగ్గురనియు, ఇద్దఱనియు, ఒకటిన్నరనియు, తుదకొక్కదేవతనియు యాజ్ఞవల్క్యుడు జవాబిచ్చెను. అంత శాకల్యుడు సరేయని మూడువందల మూడు మూడువేల మూడు సంఖ్యగల దేవతలిక తమతే వరూపము గలవారని ప్రశ్నవేసెను.

1 పూర్వోక్త దేవతలు 33 దేవతల విభూతులేయనియు నిజము గా ముప్పదిముగ్గురే దేవతులనియు యాజ్ఞవల్క్యుడు చెప్పెను. అంత శాకల్యుడు 33 గ్గురు దేవతలెవరని యడుగ అష్టవసువులు ఏకాదశ రుద్రులు ద్వాదశాదిత్యులు వీరందరు కలసి ముప్పదియొక్కరు ఇంద్రుడు ప్రజాపతి కలిసి ముప్పదిముగ్గురు దేవతులని యాజ్ఞవల్క్యుడుపలికెను.

2 ఆఅష్టవసువు లెవరని శాకల్యుడడుగ అగ్ని, భూమి, వాయువు, ఆకాశము, సూర్యుడు, ద్యులోకము, చంద్రుడు, నక్షత్రములు, ఈయెనిమిదింటియందు వసువను ధనరూపమగు సర్వజగత్తు ఉంచబడినదిగాన వీనిని అష్టవసువులనుదురు. అనియాజ్ఞవల్క్యుడు ప్రత్యుత్తర మిచ్చెను.

3 ఆరుద్రు లెవరనియడుగ పురుషుని కర్మజ్ఞానేంద్రియములగు పదిప్రాణములు మనసుకలిసి ఏకాదశరుద్రులు. ఈపదునొకండు మరణమునుబొందు శరీరమును విడువగానే ఆపురుషునిగూర్చి తత్సంబంధులు ఏడ్చుటవలన వానికి రుద్రులను నామమువచ్చెను. అని శాకల్యునితో యాజ్ఞవల్క్యుడనెను.

4 ఆద్వాదశాదిత్యు లెవరను ప్రశ్నకు సంవత్సరాంగములగు 12 నెలలు ద్వాదశాదిత్యులు. ప్రాణులఆయుః కర్మఫలములను ఇవిగ్రహించుచున్నవిగాన వీనికి ఆదిత్యులనామము వచ్చెను. అని ప్రతివచన మీయబడెను.

5. ఇంద్రప్రజాపతు లెవరని ప్రశ్నవేయగా స్తనయిత్నులే అనగా ఉరుము, ఇంద్రుడు, యజ్ఞమే ప్రజాపతి అని ప్రత్యుత్తరమియ్యా దానితో తృప్తిజెందక ఉరుము యజ్ఞము నేమని యడుగ వజ్రమే ఉరుమనియు, పశువే యజ్ఞమనియు, పశువన్నను శ్రీర్హి పశవః అను శృత్యర్థానుసారముగ సంపదయే పశువనియు, యాజ్ఞవల్క్యుడు శాకల్యునితో బలికెను.

6. ఆరుగురని యంటివే అవి యేవియని ప్రశ్న వేయగ అగ్ని, భూమి, వాయువు, అంతరిక్షము, సూర్యుడు, ద్యులోకము, ఇవిఆరు అనియు ఇదివరకు జెప్పబడిన ముప్పదిముగ్గురే ఈఆరుగురగు చున్నారనియు అనెను.

7 ఆముగ్గురు దేవతులు ఎవరను ప్రశ్నకు నీమూడులోకములే ఈ మూడు దేవతలలోనే సమస్త దేవతులు ఆవిర్భవించి యున్నారనియు జెప్పెను. ఆయిద్దరు దేవతులెవరను ప్రశ్నకు అన్నము, ప్రాణము, అనియుత్రము. ఒకటిన్న రెవరనుటకును వాయువు అని బదులుజెప్పెను.

8 ఒకటియగు వాయువు, ఒకటిన్నరయెట్లయ్యె అను ప్రశ్నకు సమస్తసృష్టిజాలము సూత్రాత్మయగు వాయువువల్ల వృద్ధి బొందింపబడుచున్నది గాన నాదేవతను ఒకటిన్నర యనబడునని యుత్తరమని యాజ్ఞవల్క్యుడనెను. ఒక్కండగు దేవుడెవడనిన ప్రాణమనగ ప్రాణమే బ్రహ్మమగు తత్ అని చెప్పబడెననియె.

9 పరోక్షవాచకమగు తత్పదము బ్రహ్మకు ఛాందోగ్య షష్ఠమందు బ్రయోగింపబడెను.

ఇందులకు సంస్కృతమునయుండు ఉపనిషద్వాక్యములనుగనుడీ.

అథహైనం విదగ్ధః శాకల్యః పప్రచ్ఛకతి దేవా యాజ్ఞవల్క్యేతి। సహైవతన్నైవవిదా ప్రపేదేయావన్తో వైశ్వదేవస్యనివిద్యుచ్యన్తేత్రయశ్చత్రీచ శతాత్రయశ్చత్రీచ సహాస్రేత్యోమితి హోవాచకత్యేవ దేవాయాజ్ఞ వల్క్యేతిత్రయస్త్రింశ దిత్యోమితి హోవాచకత్యేవ దేవాయాజ్ఞవల్క్యేతి షడిత్యోమితి హోవాచకత్యేవ దేవాయాజ్ఞ వల్క్యేతిత్రయ ఇత్యోమితి హోవాచకత్యేవదేవాయాజ్ఞ వల్క్యేతి ద్వావిత్యోమితి హోవాచకత్యేవ దేవాయాజ్ఞవల్క్యేత్యధ్యర్ధ ఇత్యోమితి హోవాచకత్యేవ దేవాయాజ్ఞవల్క్యేత్యేకఇత్యోమితి హోవాచకతమేతేత్రయశ్చత్రీచ శతాత్రయశ్చత్రీచ సహాస్రేతి॥

1 సహోవాచమహిమానఏ వైషామేతేత్రయస్త్రిగ్ శత్త్వేవదేవా
ఇతి కతమేతేత్రయస్త్రిగ్ శదిత్యష్టావసవ ఏకాదశరుద్రాద్వాద
శాదిత్యాస్త ఏకత్రిగ్ంశదింద్రశ్చైవ ప్రజాపతిశ్చత్రయస్త్రిగ్ం
శావితి॥

2 కతమేవసవ ఇత్యగ్నిశ్చ పృథివీచవాయుశ్చాంతరిక్షం చాదిత్య
శ్చద్యౌశ్చ చంద్రమాంశ్చ నక్షత్రాణిచైతేవసవ ఏతేషుహీదం
వసుసర్వగ్ం హితమితి తస్మాద్వసవఇతి॥

3 కతమేరుద్రా ఇతిదశమే పురుషేప్రాణా ఆత్మైకాదశస్తేయదా
స్మాచ్ఛరీరాన్మర్త్యా దుత్క్రామన్త్యథరోదయన్తి తద్రుద్రోయన్తి
తస్మాద్రుద్రాఇతి॥

4 కతమఆదిత్యా ఇతి ద్వాదశవై మాసాః సంవత్సరస్యైత ఆది
త్యా ఏతేహీదగ్ం సర్వమాదదానాయన్తి తస్మాదాదిత్యాఇతి॥

5 కతమఇంద్రః కతమఃప్రజాపతిరితి స్తనయిత్నురేవేంద్రో యజ్ఞః
ప్రజాపతిరితికతమ స్తనయిత్నురిత్యశనిరితి కతమోయజ్ఞ ఇతి
పశవ ఇతి॥

6 కతమేషడిత్యగ్నిశ్చ పృథివీచ వాయుశ్చాన్తరిక్షం చాదిత్యశ్చ
ద్యౌశ్చైతేషడేతేహీదగ్ం సర్వగ్ం షడితి॥

7 కతమేతేత్రయోదేవా ఇతికతమఏవత్రయోలోకా ఏషుహీమే సర్వే
దేవాఇతి॥

8 కతమౌతౌద్వౌ దేవావిత్యన్నంచైవ ప్రాణశ్చేతికతమోధ్యర్ధఇతి
యోయం పవత ఇతి॥

9 తదాహుర్యదయమేక ఇవైవపవతేథకథ మధ్యర్ధఇతి యదస్మిన్ని
దగ్ం సర్వమధ్యార్ధ్నోత్తే నాధ్యర్ధఇతి కతమఏకోదేవ ఇతిప్రాణ
ఇతిస బ్రహ్మత్యదిత్యాచక్షతే॥

అవిద్యావస్థలోను పాస్యోపాసకాది వ్యవహారముగలదు. ఇహి కాముష్మికాభ్యుదయమునుగోరి ఛేయు నుపాసనాదులు ప్రతీకములనబడు వానిలో నంతర్భావములు వ్రతాదులు గృహ గ్రామదేవ పూజా రూపములగు దేవతార్చన విగ్రహారాధనములు పాశ్చాత్యపండిత శిరోమణియగు కార్లైయిలుచేసిన శూరారాధనము గ్రంథమునుజూడనగు కాని ప్రకృత దేవళములలోని యాచారములుగొన్ని మామదికింపుగా లేవు. అవియపూర్వ ప్రమాణమూలకములు ఇంక గొన్నియుపాసనములు క్రమముక్తిసాధనములగు దహారాదివిద్యలు వానిలో హృదయ పుండరీకాదులందలి తేజస్సు నీశ్వరునిగ భావనాధ్యానములు గలవు. వాని వలన ముక్తిక్రమముగ గలుగు మరికొన్ని యుపాసనలగు ఉద్గీథాలు కర్మసమృద్ధిని జేయును. సామభక్తి విశేషము ఉద్గీథ యనబడును. దాని యంగమగు ప్రణవమును ఆయుద్గీథ యేక్రతువునకంగమో దానిని జేయునప్పుడు ఉపాసించినచో యజమానునకు ఆయుపాసన ఫలాధిక్యమును సమకూర్చును. ఈశ్రౌతోపాసనల ననుసరించి వివిధస్మార్తాద్యుపాసనలు ఉపాస్యదైవమందు బుద్ధి గట్టిగ గుదురుటకు నార్యులేర్పరచిరి. నిర్గుణోపాసనలుగూడ శృతులలో నున్నవి. వీనికన్నిటికి శిరోభూతము జ్ఞానగమ్యమగునది నిర్గుణబ్రహ్మము. కనుకనే బాదరాయణులు బ్రహ్మసూత్రములందు శివశక్తి విష్ణ్వాదిదేవతల నామము లుచ్చరింపక బ్రహ్మశబ్దమునుమాత్రము స్వీకరించిరి. అదియు దాహృత ఋగ్వాక్యాదుల ననుసరించినది. కాని సంస్కృతవ్యాకరణాది పాండిత్య బలముచే ద్రావిడ ప్రాణాయామము ననుసరించి యర్వాచీనులు సూత్రస్థ బ్రహ్మశబ్దము శివవిష్ణ్వాది పరములని తర్జన భర్జనపడి తాము మోహపడి యితరులను మోహపరచిరి. కొందరు ఋషులు కర్మజ్ఞాన సముచ్ఛయముచే మోక్ష మలవడునందురు. కొందరు భక్త్యైకసమధిగమము బ్రహ్మమనుదురు. నారద శాండిల్యాది సూత్రముల జూడనగు. పరమాత్మ జీవాత్మలకు వ్యవహారదశలో భేదమున్నట్లు ఛాయగనుపించినను వాస్తవముగ భేదమేమాత్రము లేదనియు అవి యొక్కరూపేయనియు ఈశ్ర

హాస్యము నరయుటయే మోక్షమనియు, నదిజ్ఞానైక సమధిగమమని యు, ముఖ్యోపనిషత్తులు స్పష్టముగ బలుకుచున్నవి. ఈయర్థమున్ను స్త్రీ శూద్ర ద్విజబంధువులకుగూడ జెప్పబడియుండెను. ఇందుచేతనేశ్రు త్యర్థము సర్వులకు దెలియగలందులకు స్థూణానిఖనన న్యాయముగ శ్రీమద్భాగవతమందు పురంజనోపాఖ్యానమనుకథ వ్రాయబడి దాని యర్థముకూడ నందే వ్యక్తీకరింపబడినది. పరమాత్మపురంజనుని రెండ వయవతారమగు ప్రమదోత్తమయను స్త్రీని ఆత్మపురుషుడు కాడు. స్త్రీ కాదు అని బోధార్చి జీవాత్మ పరమాత్ములకు లేశమైనను భేదము లేదని,

శ్రు॥ యదంతరంకురుతేతస్య భయంభవతి॥

అనువారు ణోపనిషత్తున కనుకూలముగను ఇటుచెప్పెను.

శ్లో॥ అహంభవాన్న చాన్యస్త్వంత్వమేవాహం విచక్ష్వభో। వనా పశ్యంతికవ యశ్ఛింద్రంమనాగపి । యధాపురుష ఆత్మానమేక మాదర్శచక్షుషోః। ద్విధాభూతమవేక్షేత తథైవాంతర మావయోః॥ శ్రీమద్భాగవతము 4 స్కంధము 28వ అ. 62, 63 శ్లోకములు.

మఱియు ఇందుల కాంధ్రభాగవతముననున్న విషయముజూడుడీ.

ఏ నీవుగాని యన్యుండవుగావు నీవేనేగాని యన్యుండంగానిట్లు రుంగుము. విద్వాంసులు మనయిద్దరియందు నంతరంబునీక్షింపరు. పురుషుండు తన్నొక్క-నే యాదర్శ చక్షువులందు భిన్నరూపులుగా దలంచు చందంబున మనయిద్దరికిని భేదంబు గలిగినట్లు దోచు.

ఇట్టి జీవబ్రహ్మైక్యము జ్ఞానైకసమధిగమమని వేదాంతములని షట్ప్రస్థాభిప్రాయమని పాశ్చాత్య విపశ్చితులు దలచిరి. ఈవిషయము నుగూర్చి శంకర రామానుజ బ్రహ్మసూత్రభాష్యాభిజ్ఞులగు డాక్టరు థీబో గారుగూడ వ్రాసిరి. ఇందువల్ల భగవద్గీతలలో నుక్తమగు భక్తివైరాగ్య

ములు నిష్కామకర్మానుష్ఠాము జ్ఞానోదయమునకు నంతర్బహిరంగసాధ
నప్రాయము. వానివలన జ్ఞానోదయమై దీపమువల్ల గాంత్యభివ్యక్తిగలు
గునట్లుకలుగునని వివేకమరయునగు. అట్టిజ్ఞానమునే పరాభక్తి యని
గూడ పెద్దలనుదురు. కాన జ్ఞానము మోక్షమునకు సాక్షాత్కారణము.
జ్ఞానాదేవతు కైవల్యం. తరతిశోకమాత్మవిత్। బ్రహ్మవిదాప్నోతిపరం॥
లోనగు శృతిమస్తకముల జూడనగు

ఆర్యకులావతంసులారా!

ఈయభిప్రాయములనే మహామహోపాధ్యాయ బిరుదాంకితు
లగు శ్రీమాన్ పరవస్తు వెంకటరంగాచార్యులవారును, రిటైర్డ్ సబ్
జడ్జి శ్రీయుత వావిలాల వెంకటశివావధానులగారును, కీర్తిశేషులగు
ఆత్మకూరి లక్ష్మీనారాయణ దీక్షితులుగారును, ఈ మొదలగువారు
చెప్పియున్నారు.

ఇట్టి బూర్వపు ఆర్యుల చర్యలెక్కడ బ్రస్తుతపుఆర్యులలోచేరిన
వారి చర్యలెక్కడవిమర్శించి జూడుడీ.

బూర్వపు ఆర్యులలో దృష్టిదోషము లేదనియు సర్వత్ర భోజన
భాజనములుగలిగి సంబంధ బాంధవ్యములతో నిండియుండెననియు
మఱియు నహింసాత్సర్వ భూతాని అను న్యాయప్రాబల్యముచేయజ్ఞాదు
లయందును జీవహింస జేయక యుండిరనియు తోచుచున్నది.

ప్రస్తుతపువారు శాక్తేయమతావలంబకుల సహవాసముచే మధు
మాంస భక్షణలకు లోనై యున్నవారు. పూర్వము తపోమహిమచే
క్షత్రియ వైశ్య శూద్రాదులు గూడ బ్రహ్మర్షులగుట కవకాశముండి
యుండె. ప్రస్తుతము ఆర్యులలో గొందరికి స్వాతిశయమెక్కుడై అట్టి
స్వాతిశయమును వృథాబోనియ్యక గొన్ని స్మృత్యాదిగ్రంథములలో
సిమిడ్చి బూర్వులకు గళంకమును దెచ్చియున్నవారలు. మఱియు
శస్త్రాస్త్ర రాజనీతి వ్యవహారవాణిజ్య మంత్రశాస్త్ర ప్రచారముబూర్వ
పు విశేషముగ నుండెననియు, మణిమంత్రౌషధ రూపమగు వైద్య

ము తెన్నగ నుండెననియు, అథర్వణవేదమువల్ల దెలియనగు. మఱియు స్మార్తషోడశ కర్మలకు దానవ్రతాదులకు బ్రాతిపదిక తైత్తరీయ మంత్రవర్ణములు అథర్వణమంత్రములు ఇప్పటికి 2000 వేల యేండ్లవరకు అనగా కాళిదాస భవభూతికాలము వరకు నాలుగు వేదముల ప్రచారము మనదేశమున బహువిరళముగ గలదని యెన్నవగు. జూడుడీ రఘువంశము 1 సర్గ 59 శ్లోకము. పూర్వపు పురోహితులకు అథర్వణవేదాధ్యయనము గలదనిగూడ రఘువంశము 17వ సర్గ 13వ శ్లోకమున కాళిదాసు వర్ణించియున్నవాడు.

ఇట్లు ప్రాచీనార్యుల యొక్క వైభవోత్కృత్తులు గన్పట్టుచుండ యిందులకు వ్యతిరేకముగ నెవరో స్వార్థపరులు బ్రహ్మాముఖ బాహూరు పాదములవలన వర్ణోత్పత్తియైనదని యీక్రింది శ్లోకమువంటి శ్లోకముల నుగొన్నిటిని గల్పించి గ్రంథాదులయందు జేర్చినవారైరి.

శ్లో॥ లోకానాంతువివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః।
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచనిరవర్తయత్॥

ఇవ్విధముగనుండినను కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు మాత్రము సచ్ఛూద్రులు గారనియు, కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులైయున్నారని యు జెప్పుట కేయభ్యంతర ముండజాలదని మాయభిప్రాయమునుయీగ్రంథరూపముగ వెల్లడిబఱచితిమి.

ఇట్లు వచించుటకు కారణమేమనియెదరేని పూర్వము గుణకర్మ విభాగములవల్లనే వర్ణోత్పత్తి గలుగుచుండెననియు అటుపిమ్మట కొంత కాలమునకు స్వార్థపరుల ప్రోత్సాహ బలాత్కారములచే కులకట్టుబాటులు దిట్టముగ నేర్పడెననియు, అట్లేర్పడిన కులకట్టుబాటులను బట్టియు, పూర్వోక్తులగు కమ్మవారు మొదలగువారుమాత్రము సూర్యవంశజులగు క్షత్రియులైయున్నారని యీగ్రంథమున జెప్పుటయే మాయభిప్రాయమనియింతకు పూర్వము వ్రాసినదాని యొక్క యభిప్రాయమయి యున్నది. ఈకులకట్టుబాటు లెప్పుడేర్పడినవో నానంగతి సంపూర్ణముగ వ్రాయు

టకు యిచ్చుట వీలుగాకపోయినను జయార్థప్రకాశిక రెండవభాగము ప్ర
శ్నార్ణవాపాశవవాంతమాల అను గ్రంథమున విశేషించి వ్రాసియు
న్నాము. ఇట్టితతిమావాప్పిదములగు బూర్వోక్తవిషయములన్నియుశా
స్త్రసమ్మతములై యున్నవని మీరుగుర్తెరుగుటకై 1917 సం॥ కృష్ణాజిల్లా
గుడివాడతా॥ శాయపుర గ్రామ వాస్తవ్యులగు హవిర్యాజి కూనపులి
పూర్ణయ్యశాస్త్రుర్లవారు స్త్రీశూద్రాదులకు వేదాధికారములేదని జెప్పి
నవాదముపై అట్టిస్త్రీశూద్రాదులకు వేదాధికారముగలదను ప్రత్యుత్త
రరూపమైన జయార్థప్రకాశిక మొదటిభాగము అజ్ఞానతిమిరభాస్కరమ
నుగ్రంథమునువ్రాసి బ్రకటించియుంటిమి. ఆగ్రంథము అచ్చుపడినఒ
కమాసమునకే అయిదువందల ప్రతులు వ్యయబడుటయేగాక నటుపిమ్మ
టనాలుగైదుమాసములు గడిచిన వెనుకనాగ్రంథోక్తప్రకారముమహా
రాజరాజశ్రీ శ్రీయుత యర్రంశెట్టి వీరయ్యనాయుడుగారు యజ్ఞోపవీతధా
రణగావించుకొని తదితరులకు మార్గదర్శకులైరి.

ఇంతియేగాక మ.రా.రా.శ్రీ శ్రీయుతసూర్యదేవర రాఘవయ్య,
తలపనేని కోటయ్యకీర్తిశేషులైన చిరుమామిళ్ళ వెంకయ్యనాయుడుయీ
మొదలగువారి ప్రోత్సాహము చేతను గుంటూరుజిల్లా తెనాలితాలూ
కా కొల్లూరుగ్రామమున బ్రాహ్మణేతరుల కొఱకు నొక వేదపాఠశాల
నెలకొల్పబడియెను. ఈకొల్లూరుగ్రామమున పాఠశాలస్థాపించిన కొం
తకాలమునకు తెనాలితాలూకాలో క్రాప, దోనపూడి, అంగలకుదు
రు, చిలుమూరు, చాకమూరు, యీ గ్రామాదులలోను మరియు
రేపల్లి తాలూకాలో నల్లూరు, మైనేనివారిపాలెము, వెనిగళ్ళవారిపా
లెము యీగ్రామాదులలోను ఇదియునుంగాకను కృష్ణాజిల్లా బెజవా
డతాలూకా పెనమలూరు గ్రామములోను గన్నవరం తాలూకా కొ
మ్మమూరు, కాటూరు, కుందేరు, యీగ్రామాదులలోను మరియు
నుగోదావరిజిల్లా రామచంద్రపురంతాలూకాలో కుంకుదురు, పెద్దాపుర
ము, ద్రాక్షారామములను గ్రామములలోను బ్రాహ్మణేతరులకొఱకు
వేదపాఠశాలలు స్థాపించుటయైనవి.

ఉపాధ్యాయశాలలు పెట్టిన గ్రామాదులుగాక తదితరగ్రామాదులగు ఉదుపుగల్లు మొదలగు గ్రామాదులలోను శ్రీయుతలైన కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులగు కమ్మవారు మొదలగువారలు 2000 ప్రజలు యజ్ఞోపవీతములు ధరించుకొనియున్నవారలు.

ఇదియునుంగాక బూర్వోక్తములగు పాఠశాలలో జదువుకొనిన బ్రాహ్మణేతర విద్యార్థులవలన బ్రాహ్మణేతర పౌరోహిత్యముక్రింద శ్రీయుత కోవెలమూడి గోపాలకృష్ణయ్య బి. ఏ. బి. ఎల్. గారును రాయబహాదూరు కూర్మా వెంకటరెడ్డినాయుడు బి. ఏ. బి. ఎల్. గారును డిప్యూటికలెక్టరు తలారి గోపాలరావునాయుడు బి. ఏ. గారును బారిష్టరు త్రిపురనేని రామస్వామిచౌదరిగారును మరియు శ్రీయుత సబ్బెళ్ళ పద్దయ్యరెడ్డి, పడాల రామిరెడ్డి, తాడి రామయ్యరెడ్డి మొదలగు అనేకమంది ప్రముఖులు వారివారి గృహములయందు జరిగిన శుభాశుభ కర్మలను బూర్వోక్తవిద్యార్థులచే వేదోక్తవిధిగ నెరవేర్చుకొనుచున్నవార లెందరోగలరని వ్రాయుటకు సంతసించుచున్నాము.

జయార్థప్రకాశిక మొదటి భాగము అజ్ఞానతిమిరభాస్కరమను గ్రంథమున బ్రశక్తాప్రశక్తిగ గుణకర్మవిభాగమువల్లనే వర్ణాశ్రమ ధర్మములేర్పడినవని మేము నుడివినభాగమును స్థూనానిఖననన్యాయముగ బలపఱచుటకై మరల నావిషయమును గ్రహించి శికిందాబాదు వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి, శివపురపు వీరభద్రపాకయాజీగార్లచే రచియింపబడిన ప్రశ్నార్ణవాపోశనమను గ్రంథమునకు ఖండనగ్రంథముగ జయార్థప్రకాశిక రెండవభాగము ప్రశ్నార్ణవాపోశనవాంతమాల అను నీగ్రంథమును రచించి బ్రకటించుటకై ముద్రణాలయమునకు బంపియుంటిమి.

ఇది యిట్లుండ బూర్వోక్తమైన యీజయార్థప్రకాశిక రెండవభాగము ప్రశ్నార్ణవాపోశన వాంతమాల అను నీగ్రంథమును రచియించుటకంటె బూర్వము మేము గుణకర్మవిభాగములవలన వర్ణాశ్రమధర్మము లేర్పడినవని బూర్వోక్తవిధిగ నిశ్చయమును బలుచుకొని

యుందువారమై యుంకినను మాప్రతిపక్షులు జెప్పినట్టి బ్రహ్మముఖబా
హూరుపాదముల వలన వర్ణోత్పత్తియైనదను విషయమెంతవఱకు సత్య
మైయుండునోయని యోచించి జూడదలచి మొట్టమొదట కమ్మవారు
మొదలగువారు సచ్ఛూద్రులా అథవా ద్విజాతులలోచేరినవారా అను
నీవిషయమును జక్కగ దెలుసుకొనుటకై సచ్ఛూద్రులుమాత్రము వీరు
గారని శంకించుకొని ప్రచ్ఛన్నరూపములను ధరించిన సూర్యవంశజుల
గు క్షత్రియులై యుందురని నిశ్చయించుకొని కృష్ణాజిల్లా అవనిగడ్డతా
లూకా అముదాలలంక గ్రామ నివాసులగు శ్రీమతీసజ్జారత్నమాంబా
గారి ద్రవ్యసహాయముచేతను మఱియును తెనాలి తాలూకా ఎల్లపాడు
గ్రామవాస్తవ్యులగు శ్రీయుత పిన్నమనేని వెంకయ్య చౌదరీగారి ద్ర
వ్యసహాయముచేతను క్షత్రకులాదర్శ ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము అను నీ
రెండు కరపత్రములను ప్రకటించి వెల్లడిజేసితిమి.

ఇట్టితఱి తెనాలితాలూకా సంగం జాగర్లమూడి అను నీగ్రామ
మున బారిష్టరు శ్రీయుత టీ. రామస్వామివర్మగారి యాజమాన్యము
క్రింద నొక బ్రాహ్మణేతర మహాజనసభ జరుపబడి నాసభలో మేమా
రెండుపత్రికలనుగూర్చి యుపన్యసించుచుండ గుంటూరువాస్తవ్యులగు
శ్రీమాన్ కాశీ కృష్ణమాచార్యులవారును బ్రహ్మశ్రీ దెందుకూరి నృసిం
హశాస్త్రుల్లువారును, పానకాలశాస్త్రుల్లువారును అను నీపండితవర్యు
లానభకు నాహ్వానముపై విచ్చేసియుండి మా ఉపన్యాసానంతరము
బూర్వోక్తులగు నా రెండు కరపత్రములలోజెప్పిన కమ్మవారు మొదలగు
వారు కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులు గారనియు
సచ్ఛూద్రులై యున్నారనియు, ఇట్లని ప్రమాణ రహితమైనమాటలచే
జెప్పుచు నీసభవారు మాకొకమాసము గడువిచ్చినచో నా రెండు కర
పత్రములయందుండు విషయమును మేము ఖండించెదమనిజెప్పి ఆసమ
యములో నానభయందుండు కొందఱు ప్రముఖుల వలన అనుజ్ఞనుగ్ర
హించి నాప్రకారముగనే గడువునుబొంది వెళ్ళిరి.

మేమును యీమధ్యకాలములో కొన్నికార్యాంతరతొందరల
చే మద్రాసు వెళ్ళియుంటిమి. అట్టితఱి మేము మద్రాసులో యుండు

కన్నెమెరా ఓరియంటల్ లైబ్రరీయందు యుండునట్టి కొన్ని ప్రాచ్య
లిఖితగ్రంథములను ఇండియన్ అంటిక్వేరి మొదలగు వాటియందు ప్ర
కటింపబడియుండు పురాతనములగు దానశాసనములను మరికొన్ని పా
శ్చాత్త్యపండితులచే వ్రాయబడిన గ్రంథములను బూర్వోక్తములగు క్ష
త్రకులాదర్శ ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము అను నీరెండుకరపత్రములకు
సంబంధించి నవిషయములను అచ్చుటచ్చుటసమకూర్చుటకలిగినది. ఇంతి
యేగాకనటుపిమ్మటనొకమాసమునకు మద్రాసునుంచి రేపల్లి తాలూక
నల్లూరుగ్రామమునకు వచ్చుట తటస్థపడినది. మేము మద్రాసునుంచి
వచ్చిన పదిరోజులకనగ 1919 సం॥ డిశంబరునెల 25, 29 తేదీలగు నీ
రెండు దివసములలో నల్లూరుగ్రామమునకు సమీపమునయుండు మై
నేనివారిపాలెములో బూర్వోక్తములైన క్షత్రకులాదర్శ ప్రచ్ఛన్నరాజ
కులనిర్ణయము అను నీ రెండుపత్రికల విషయమై మాకును బందరు నో
బిల్ కాలేజీ సంస్కృతపండితులగు బ్రహ్మశ్రీ శిష్ట్లా నృసింహశాస్త్రుల

వారికిని వాదప్రతివాదములు జరిగి మావాదమును శ్రీశాస్త్రులవా
ఖండించలేక పోవుటచేతను, బూర్వోదాహృతులగు శ్రీమాన్ కాశీ
కృష్ణమాచార్యులవారును బ్రహ్మశ్రీ దెందుకూరి నృసింహశాస్త్రులవా
రును, పానకాలశాస్త్రులవారును, పూర్వము సంగం జాగర్లమూడిగ్రా
మములో జరిగిన సభయందు నాసభికులవలన గ్రహింపబడిన గడువునే
టికి నెంతోకాలమునకు క్రిందటగడుచుటచేతను ఈరెండుపత్రికలు బు
ట్టిన దారభ్య నేటివరకు ఎవరును ఖండనపత్రికలు వ్రాసి ఖండింపక
పోవుటచేతను బూర్వోక్తములగు క్షత్రకులాదర్శ ప్రచ్ఛన్నరాజకుల
నిర్ణయముఅను నీరెండుపత్రికలు పై హేతువులవలన సిద్ధాంతీకరింపబడి
నవై యుండుటచే నారెండుపత్రికలయొక్క రాద్ధాంత విషయములనువి
పులముగ లోకులకు దెలియుటకై జయార్థప్రకాశిక మూడవభాగము
ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము అని యిట్లుగ గ్రంథమును బూర్తిచేసితిమి
ఈగ్రంథము సమగ్రము బూర్తియైన ఒకటి రెండు దివసములలో నేరే
పల్లితాలూక ధూళిపూడి శివారు మునసబుగారిపాలెము అథవా మై

నేనివారిపాలెములోయుండు మహారాజరాజశ్రీ శ్రీయుత మైనేని బసవయ్యచౌదరీగారికుమారులు చలమయ్యచౌదరీగారును మఱియు వెనిగళ్ళవారిపాలెములో యుండునట్టి చౌదరీప్రముఖులు మరికొందఱును ఈ తాళపత్రగ్రంథమును జూచుటకలిగినది.

ఆగ్రంథమునువారు జూచినవెంటనే శ్రీయుతమైనేని చలమయ్యచౌదరీగారు మాత్రము ముద్రణమునకగు వ్యయమంతయు నేను భరించెదనని చెప్పి యాతక్షణమువారుస్వయముగ రు. 400 మాకిచ్చిరి. మేమాద్రవ్యమును గ్రహించి నూజవీడు గ్రామమునకుముద్రణముకొఱకు వచ్చిచేరితిమి ఇచ్చట మొదటినుండి సహాయకులై పరిచితులగు మహారాజరాజశ్రీ తిరుపూరి వెంకటాద్రిగారితో కలసి ముచ్చటించ ఈగ్రంథము సంపూర్ణముగ ముద్రణ యగుటకుగాను రు 1000 వ్యయమగునట్లు తటస్థపడెను. అప్పుడు మామిత్రులయొక్క సహాయముచే గ్రంథములో గొంత సవరణజేయుట వలన రు 600 వరకు వ్యయమగునట్లు స్థిరపడెను. ఈశేషించిన ద్రవ్యమునకుగాను బూర్వోక్తమైన ఆముదాలలంక నివాసస్థులగు కీర్తిశేషులగు సజ్జా అంకినీడుగారి ధర్మపత్నియైన రత్నమాంబాగారితో మేము ప్రస్థాపించ యావెంటనే శేషించిన రు 200 ఆమే సహాయమొనర్చెను.

ఈయుభయులయొక్క ద్రవ్యసహాయము వలన జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకులనిర్ణయమను నీగ్రంథమును ముద్రణమునుబూర్తిజేసి లోకమునకు వెల్లడిపఱచితిమి. ఈగ్రంథమును బ్రకటించుటకు కారకులుగనుండు మహాశయులందఱిని బ్రాణవస్వరూపుడగు పరమేశ్వరుడు రక్షించుగాత యని యిట్లు భగవంతుని బ్రార్థించుచు నీ క్రింది శ్లోకోక్త ప్రకారము ఆశీర్వచనము జేయుచు నింతటితో నీవిషయమును విరమించుచున్నాము.

శ్లో॥ జగద్వంద్య పదద్వంద్వంధ్యాత్వామనసి గౌరవం।
విహితాత్త్రియోభూయాత్సదా నారాయణస్మృతిః॥

శ్రీనగరము,
27—2—20.

శ్రీమత్పరమహంస,
స్వామి. జే. యస్. బి. సర్వజిత్.

# విషయానుక్రమణిక.

## ప్రథమసముల్లాసము.


| పేజీ | పేర | |
|---|---|---|
| 1 | 1 | ప్రతిజ్ఞ. |
| 8 | 2 | కూర్మశబ్దనిరూపణము. |
| 17 | 3 | కూర్మశబ్దమునకు రసవీర్యాది శబ్దములు పర్యాయపదముల ని నిరూపించి జెప్పుట. |
| 22 | 4 | కూర్మశబ్దమును ముతపు అర్థమునందు నిరూపించిజెప్పుట. |
| 23 | 5 | కూర్మశబ్దమునకు ఇంద్ర రాజఅను నీశబ్దములుపర్యాయపదము లై యున్నవని జెప్పుట. |
| 26 | 6 | కూర్మశబ్దమునకు రాజన్య క్షత్రియ బలవాన్ నాయక అను నీశబ్దములు పర్యాయ పదములై యున్నవని నిరూపించి జెప్పుట. |
| 27 | 7 | కూర్మశబ్దమునకు భూపతి క్షత్రియ అను నీశబ్దములు పర్యాయపదములై యున్నవని నిరూపించిజెప్పుట. |
| 29 | 8 | కూర్మశబ్దమునకు వర్మశబ్దము పర్యాయపదమై యున్నదని ని రూపించి జెప్పుట. |
| 31 | 9 | కూర్మశబ్దమునకు రాట్శబ్దము పర్యాయ పదమై యున్నదని జెప్పుట. |
| 33 | 10 | కూర్మశబ్దార్థనిర్వచనము |


## ద్వితీయసముల్లాసము.


| | | |
|---|---|---|
| 38 | 1 | కూర్మశబ్దార్థమునుండి జనించిన కూర్మకులా[illegible] ార్య వంశమైన క్షత్రియవ[illegible]ని నిరూపించి జె[illegible] |
| 39 | 2 | సూర్యవంశానుక్రమ[illegible] |

43 3 కూర్మకులావతంసము కూర్మమహాఋషివల్లనేప్రచారమునకు వచ్చినదని జెప్పుట.

46 4 వీతహవ్యుడనురాజు భృగు మహాఋషి కృపవలన బ్రాహ్మణత్వమునొందుటయు అతని వలన గృత్సమద మహాఋషియు అతనివలన కూర్మమహాఋషియు జనించెనని జెప్పుట.

49 5 జయపురాధీశ్వరులు పృధ్వీరాజు మొదలగువారందరు కూర్మకులావతంసులని జెప్పుట.

50 6 కూర్మకులావతంసమునుండియే చంద్రవంశముగూడా జనించినదని జెప్పుట.

52 7 చంద్రవంశోత్పత్తి కథనము.

55 8 కూర్మకులావతంసము సూర్యవంశమనిగొన్ని దానశాసనములద్వారా నిరూపించి జెప్పుటలో మొదట నేపాలక్షితిపాల వంశావళినిగూర్చి జెప్పుట.

49 9 శ్రీకురువంశావతంస శ్రీజనమేజయ భూపాలునియొక్క దానశాసనము.

60 10 ధారానగరాధిపతియగు సుప్రసిద్ధుడైన భోజరాజుయొక్క పితామహుడైన వాక్పతిరాజుయొక్క దానశాసనము.

62 11 ధారానగరాధిపతియగు సుప్రసిద్ధుడైన భోజరాజుయొక్క దానశాసనము.

64 12 శిలాహార వంశోద్భవుడగు శ్రీచిత్తరాజదేవునియొక్క దానశాసనము.

67 13 రాష్ట్రకూటవంశోద్భవుడగు చతుర్థగోవింద నృపతియొక్క దానశాసనము.


తృతీయసముల్లాసము.


72 1 కూర్మకులావతంసులనువారే కమ్మవారుగను, కాపువారుగను, వెలమవారుగను, రెడ్డివారుగను అయియున్నారని జెప్పుట.

73 2 కూర్మకులావతంసకులు నుత్తరహిందూస్థానమునుండి దక్షిణ హిందూస్థానమునకు వచ్చిరని గొందరభిప్రాయము ననుసరించిజెప్పుట.

74 3 ఇట్లు కూర్మకులావతంసకులు దక్షిణ హిందూస్థానమునకువచ్చి కర్ణాటీలుగను, మహారాష్ట్రులగను, కమ్మవారుగను, కాపువారుగను, వెలమవారుగను, రెడ్డివారుగను అయియున్నారని జెప్పుట.

79 4 కూర్మకులావతంసకులే కమ్మవారని జెప్పుకొనుటకు కారణములు.

82 5 కూర్మకులావతంసకులను కమ్మవారు చౌదరీలను పదమును బిరుదాంకముగ ధరించియున్నారని జెప్పుట.

83 6 చక్రధారియను నీశబ్దమునుండి చౌదరీయనుశబ్దము జనించినదని నిరూపించిజెప్పుట.

84 7 కూర్మశబ్దమునుండి కమ్మయను నీశబ్దము తద్భవముగ జనించినదని జెప్పుటకన్నను మరికొన్ని హేతువులవలన కమ్మశబ్దము బుట్టినదనిజెప్పునట్టి అభిప్రాయములను ఖండించుకొని జెప్పుట.

91 8 కూర్మకులావతంసకులు కాపువారు గూడ నై యున్నారని జెప్పుట.

95 9 కూర్మకులావతంసకులు వర్మశబ్దతద్భవులగు వెలమలుగూడా నై యున్నారనిజెప్పుట.

96 10 కూర్మకులావతంసకులు రాట్ శబ్దతద్భవులగు రెడ్డివారుగూడ నై యున్నారనిజెప్పుట.

103 11 కూర్మకులావతంసకులగు కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారి యొక్క బాహ్వలే రాజ్యపాలనములొనర్చిరని జెప్పుట.

105 12 ఛత్రపతియగు శివాజీయును కూర్మకులావతంసకులై యు న్నారని నిర్ణయించిజెప్పుట.

106 13 ఇపుడుండు అనేకమంది జమీందారులును కూర్మకులావతం సకులై యున్నారనిజెప్పుట.

108 14 ఈకూర్మకులావతంసకులలో గొందరు కుణబీలనువారును, మరాటాలనువారును వేదోక్తవిధి ననుసరించి షోడశ కర్మ లను జేసుకొనుటయేగాక యజ్ఞోపవీతములను గూడ ధరిం చియున్నారని జెప్పుట.

112 15 ఈకూర్మకులావతంసులకు గొన్ని బిరుదునామములు గలిగి యున్నవని జెప్పుట.

112 16 ఈకూర్మకులావతంసకులకు ఋషిగోత్రములు గలిగి యున్న వనిజెప్పుటచే ప్రస్తుతపు గోత్రములనుబట్టి ప్రచ్ఛన్నరూపధ రులైయున్నారని అనుమానించి జెప్పుట.

116 17 ఈకూర్మకులావతంసులను సచ్ఛూద్రులనిజెప్పుటకు వలనుబడ దనియు సచ్ఛూద్రులనువారు దాసనాపిత గోపాల కులమిత్ర అర్థశీరి ఆత్మనివేదకులను నీయాఖ్యులైయున్నారనిజెప్పుట.

123 18 ఈసచ్ఛూద్రులనువారివలన బ్రాహ్మణాదులు భుజించవచ్చు నని జెప్పిన పరాశరస్మృతిలోనుండు సచ్ఛూద్రవిచారః అ నునీశీర్షిక మైనేనివారిపాళెములో 1919 సంవత్సరము డిసం బరునెల 25, 28, తేదీలలోజరిగిన సభయందు బందరునో బిల్ కాలేజి సంస్కృతపండితులగు బ్రహ్మశ్రీ శిష్టా నృసింహ శాస్త్రులవారు ఈశీర్షికను తప్పుగా నచ్ఛాత్తువా రచ్ఛా త్తిరని జెప్పినట్టుగాక విద్యారణ్యులువారు వ్యాఖ్యానము నర్చునపుడు వచించిన శీర్షికమైయున్నదని జెప్పుట.

127 19 ఈకూర్మకులావతంసకులగు కమ్మవారు మొదలగువారు స చ్ఛూద్రులుగాని శూద్రులుగాని గారనియు వీరాపద్ధర్మ

ములందు ప్రచ్ఛన్నరూపములను ధరించిన సూర్యవంశజు
లైన క్షత్రియులై యున్నారని మార్కండేయోత్తరపురాణ
గాధనుబట్టి జెప్పుట.

136 20 ఈకూర్మకులావతంసులయొక్క బూర్వులు కొన్నిగోత్రము
లవారు ప్రచ్ఛన్నరూపధరులై యుందురని గొన్ని ప్రమాణ
వాక్యములను గనుబరచి జెప్పుట.

చతుర్థసముల్లాసము.

148 1 శృత్యర్థమునే స్మృతులు జెప్పుచున్నవని జెప్పుట.

148 2 శృత్యర్థమునే స్మృతులు జెప్పునెడల శృతిస్మృతులని రెండు
విధములని జెప్పుటకు కారణములు.

156 3 శృత్యర్థమునే స్మృతి జెప్పినను యీశృతితో స్మృతి సమాన
ముగాజాలదని జెప్పుట.

137 4 స్మృతులయొక్క సంఖ్యానిర్ణయము.

159 5 ఈస్మృతులు మహాఋషులయొక్క నామముతోనుండినను
నామహాఋషులు గ్రంధకర్తలై యుండలేదని జెప్పుట.

162 6 వైదికమతరీత్యాస్మృతులయొక్క కాలనిర్ణయమును జెప్పుట

163 7 లౌకికమతరీత్యాస్మృతులయొక్క కాలనిర్ణయము.

165 8 శృతిధర్మములకు వ్యతిరిక్తముగ స్మృతులు శూద్రుడు విద్య
నభ్యసించగూడదని జెప్పినవాక్యములను జూపుట.

167 9 శృతిధర్మములకు వ్యతిరిక్తముగ శూద్రుడుధనమార్జించగూ
డదని జెప్పినవాక్యములను జూపుట.

172 10 శృతిధర్మములకు వ్యతిరిక్తములైన నిందితకార్యములను జే
యగూడదని నిరూపించి జెప్పుట.

174 11 బ్రాహ్మణుడు శూద్రునికి జీతమిచ్చియైనను ఇవ్వకయైనను
నాశూద్రునిచే సేవ జేయించుకొనవలయునని జెప్పుట.

175 12 శూద్రుడు బ్రాహ్మణుని సేవజేయక స్వతంత్రించి వ్యవసాయాదికృత్యములుజేసినచో అతడైహికాముష్మికములను రెంటిని బొందక నశించుననిజెప్పుట.

177 13 బ్రాహ్మణసేవజేయునట్టి శూద్రునికి జీతముక్రింద ఎంగిలన్నము బెట్టవలయుననియు చినిగినబట్టల నియ్యవలయుననియు జెప్పుట.

178 14 రాజు శూద్రునికి సేనాధిపత్యము మొదలగు నుద్యోగము యివ్వగూడదనిజెప్పుట.

179 15 శూద్రుడు జితేంద్రియుడైనను పూజ్యుడుగాడనిజెప్పుట.

180 16 శూద్రుడు బ్రాహ్మణునికి తనప్రాణమును అర్థమును భార్యను సమర్పించినచో అట్టి శూద్రునియింట బ్రాహ్మణుడు భుజించవచ్చునని ఐకమత్యమును గలుగునట్లు జెప్పుట.

180 17 శూద్రుడు తప్పుజేసినచో శిక్షించువిధానముజెప్పుట.

181 18 శూద్రుడు జపతపస్తీర్థ యాత్రాదులను జేయగూడదని జెప్పుట.

181 18 ఇట్టిహేతువులన్నియు ఈకూర్మకులావతంసులగు కమ్మవారు మొదలగు వారియందు గన్పడుట లేకబోవుటవలన వీరు సచ్ఛూద్రులనిగాని శూద్రులనిగాని జెప్పుటకు వీలుగాక బోవుటచే శివాజీమహారాజువలె వీరును యజ్ఞోపవీతములను ధరించుకొని క్షత్రియులమని జెప్పుకొనుటకు ఏ యభ్యంతరముండజాలదని జెప్పుట.

183 20 ఉపసంహారము మంగళాచరణ



ఓమ్.

# జయార్థప్రకాశిక.

ఓం హ్రీం శ్రీం। ఐంకఏఈలహ్రీం। క్లీం హసకహలహ్రీం। సౌః సకలహ్రీం। యో అస్మభ్య మరాతీయాద్యశ్చనో ద్వేష తేజనః। నిందాద్యో అస్మాన్ దిప్సాచ్చ సర్వంతం భస్మసాకురు। శతూన్మోహన హన హుంఫట్ స్వాహా। శుక్లయజుర్వేదే ౧౧ అధ్యాయే ౮౦ మంత్రః.

ఓ ప్రణవస్వరూపుడగు అగ్నిహోత్రుడైన పరమేశ్వరుడా, ఎవరు మాకు శత్రువులో ఎవరుమమ్ములను ద్వేషించుచున్నారో ఎవరు మమ్ముల నిందించుచున్నారో ఎవరు మమ్ములను జంప ప్రయత్నించుచున్నారో అట్టి నలుగురైన ఈశత్రువులను మాకధీనుల జేయుము.

## ప్రథమసముల్లాసము.

అస్మద్దేశస్థితార్యవర్యులారా! మహాశయులారా!

శ్రు॥ యాన్యనవద్యాని కర్మాణి। తానిసేవితవ్యాని। నో ఇతరాణి। యాన్యస్మాకసుంగ్ చరితాని । తానిత్వయోపాస్యాని। నోఇతరాణి॥ తైత్తరీయోపనిషది శిక్షావల్లి.

టీక॥ అనవద్యాని। నిందితములుకాని: కర్మాణి। కర్మలను। యాని। ఏవో। తాని। ఆకర్మలను। త్వయా। నీచేతను। సేవితవ్యాని। సేవింపదగినవి। అనగా చేయదగినవి। ఇతరాణి। అన్యములైనవాటిని। నో। కూడదు। యాని। ఏవి। అస్మాకం। ఆచార్యులమగుమాకు। సుచరతాని। శుభచరితములో। తాని। అవి। త్వయా। నీచేతను। ఉపాస్యాని। ఉపాసింపదగినవి। లేక చేయదగినవి। ఇతరాణి। ఆచార్యులయందు పాపిష్ఠాదీనములైన కర్మలను। నో। చేయగూడదు॥

తా॥ అనగా అనిందితకార్యములనుచేయుచు నిందితకార్యములను విడువుము. మనకు మిక్కిలిశుభములగు కార్యములనుచేయుచు అశు

భములకు వాటినివిడుపుము. ఈ యభిప్రాయమునే యీక్రింద యుదహరించు స్మృతులుకూడా చెప్పుచున్నవి.

శ్లో॥ కురుకర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతం॥ భగవద్గీతా ౪ అ॥ ౧౫ శ్లో॥

హే అర్జున తస్మాత్ త్వంపూర్వైః కృతం పూర్వతరం కర్మైవ కురు. ఓ అర్జునా అందువలన నీవు పూర్వులచేత చేయబడిన కర్మలనే చేయుము.

అని శృతి స్మృతి ప్రమాణములు గన్పడుటచే మనముకూడా బూర్వులు వెళ్ళిన వేదమార్గముల ననుసరించియే వెళ్ళి ప్రస్తుతమున వర్ణాశ్రమ ధర్మములను నిర్ణయించుకొన తగియున్నది గాని అన్యమార్గముల వెళ్ళుటచే నాధర్మములు నిర్ణీతములుగావని యీక్రింది శృతిస్మృతిప్రమాణములచే గుర్తెరుగ తగియున్నది.

శృ॥ అహోరాత్రాణి విదధద్విశ్వస్యమిషతోవశీ। సూర్యాచంద్రమసౌధాతా యథాపూర్వ మకల్పయత్। దివంచ పృథివీంచాంతరిక్షమథోసువః। తైత్తరీయోపనిషది నారాయణవల్లీ॥ 3౦ మంత్రము.

టీక॥ మిషతః। పొందబడినసత్తాగల। విశ్వస్య। జగత్తునకు। వశీ। నియంతయగు। ధాతా। పరమేశ్వరుడు। అహోరాత్రాణి। రాత్రిపగళ్ళను! విదధత్। చేయుచున్నవాడై। సూర్యాచంద్రమసౌ। సూర్యచంద్రులనున్ను। దివంచ। స్వర్గమునున్ను। పృథివీంచ। భూమినిన్ని। అంతరిక్షం। ఆకాశమునున్ను। అథః। తరువాత। సువః। సువర్లోకమునున్ను। యథాపూర్వం। పూర్వమువలనే। అకల్పయత్। నిర్మించెను.

తా॥ పొందబడిన స్థితిగల ప్రపంచమునకు నియామకుడగు పరమేశ్వరుడు అహోరాత్రములను చేయుచు సూర్యచంద్రులను, స్వర్గ

మును, భూమిని, అంతరిక్షమును, సువర్లోకమును, వీటినన్నిటిని పూర్వమువలెనే సృష్టించెను. మఱియును,

సూ॥ శబ్దఇతిచేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యాం॥

బ్రహ్మసూత్ర శంకరభాష్యము ౧ అ 3 పా ౨౮ సూత్రము.

టీక॥ శబ్దే। వేదమునందు। ఇతిచేత్। దేవతాబోధక శబ్దములకనిత్యత్వదోషము వచ్చునంటివేని। అతఃప్రభవాత్। ఇంద్రాదులు వేదానుగుణముగా సృజింపబడినవారగుట వలన। న। అట్టిదోషము రాదు। మఱియును। ప్రత్యక్షానుమానాభ్యాం। ఆ విషయమునందు శ్రుతి స్మృతి ప్రమాణములుండుటచేతను, అట్లుచేయుటకు వేదమే ప్రజాపతికి సహాయముగానున్నదిగాని, వేరొండు లేదు. ఇచ్చట ప్రత్యక్షానుమానములను సప్పుడు శంకరభాష్యమున యీక్రిందివాక్యముచే శ్రుతిస్మృతులని చెప్పియున్నారు.

భాష్యం॥ కథంపునరవగమ్యతే శబ్దాత్ప్రభవతి జగదితి। ప్రత్యక్షానుమానాభ్యాం। ప్రత్యక్షంహిశ్రుతిః ప్రామాణ్యం ప్రత్యనపేక్షత్వాత్। అనుమానం స్మృతిః ప్రామాణ్యం ప్రతిసాపేక్షత్వాత్॥ బ్రహ్మసూత్రభాష్యము ౧౮౨ పత్రము.

ఇట్లగుటచే వేదమున కనిత్యత్వదోషము సంభవించలేదు. శ్రు॥ ఏతఇతివై ప్రజాపతిర్దేవానసృజత। వేదము వలన దేవతలిట్టివారని బ్రహ్మతెలుసుకొని వారిని సృజించెను. శ్రు॥ రశ్మిరిత్యేవాదిత్యమసృజత. రశ్మియని పరమేశ్వరుడు తలుచుకొని ఆదిత్యుని సృజించెను. శ్రు॥ వేదేననామరూపే వ్యాకరోత్సతాసతి ప్రజాపతిః. సదసదాత్మకమగు నామరూప ప్రపంచమును వేదసహాయముతో భగవంతుడు సృజించెను. శ్రు॥ సభూరితివ్యాహరన్ సభూమిమసృజత. భూమి యిట్టిదని తెలుసుకొని భగవంతుడు భూమిని సృజించెను. మఱియును, శ్లో॥ నామరూపంచ భూతానాం కృత్యానాంచ ప్రపంచనం। వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీ

నాంచకారసః॥ భూతములయొక్కయు నామరూప ప్రపంచముల యొక్కయు, కృత్యములయొక్కయు, భగవంతుడు విపులత్వమును వేదశబ్దములనే గ్రహించి మొదట సృష్టిచేసెను. ఇదియునుంగాకను,

శ్లో॥ సర్వేసాంతుసనామానికర్మాణిచ పృథక్ పృథక్। వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాచ్ఛనిర్మమే॥ మను అ ౨౧ శ్లోకము.

భగవంతుడు సృష్టికి మొదలు అందరి యొక్క నామములను, అందరియొక్క కర్మములను వేద శబ్దముల వల్లనే గ్రహించి సృష్టించియున్నాడు.

సూ॥ అతఏవచనిత్యత్వం॥ బ్రహ్మసూత్ర భాష్యము. ౧ అ. 3 పా. ౨౯ సూత్రము.

టీక॥ అతఏవ। అందువలననే వేదములకు। నిత్యత్వం। నిత్యత్వము। ప్రత్యేతవ్యం। తెలుసుకొనతగినది॥ ఇందువలన వేదములకు నిత్యత్వము సిద్ధించుట కలిగినది. ఇచ్చట శంకరభాష్యములోని ప్రత్యక్షానుమానములను శబ్దములకు శృతిస్మృతులని యింతకుబూర్వము జెప్పియున్నాము. అట్లుజెప్పుటకు కారణము నాభాష్యమే వచించి యున్నది. ఎట్లనగా నితర ప్రమాణమును అపేక్షించక పోవుటచే శృతికి ప్రత్యక్షప్రమాణమనియు, ఇతరప్రమాణమును అపేక్షించుటచే స్మృతికి అనుమానప్రమాణమనియు, ఇట్లు శృతిస్మృతులని ద్వివిధముగాను దెలియబడుచున్నది. అనుమాన శబ్దమున కేమియర్థమనినచో, అను అర్థాత్ ప్రత్యక్షస్య పశ్చాన్మీయతే జ్ఞాయతేయేన తదనుమానమ్। అనగా ప్రత్యక్షమునకు బిమ్మటగలుగునది అని అనుమానశబ్దముయొక్క అర్థము. ఏలయనగా పొగను ప్రత్యక్షముగా జూడకయే కనుబడని అగ్నియొక్క జ్ఞానముకలుగజాలదు. కాబట్టి కొంత ప్రత్యక్షమైనపిమ్మట నే అనుమానముకలుగుచున్నది. ఇచ్చట కార్యమైన స్మృతికి గారణమైనమూలమగు శృతివాక్యమును గనుగొనుటయే ముఖ్య కర్తవ్యము. ఇట్లుగానే స్మృతి, మూలశృతి ననుసరించి జెప్పబడినదని బూర్వోక్త

మైన శంకర వాక్యమగు అనుమానం స్మృతిః ప్రామాణ్యం ప్రతిసాపేక్షత్వాత్. అనువాక్యమునకు రత్నప్రభయను వ్యాఖ్యానమందీ క్రిందివిధమున జెప్పబడియున్నది.

> వ్యా॥ కథంపునరితి । స్మృత్యాస్వప్రామాణ్యార్థం మూలశ్రుతిరనుమీయత ఇత్యనుమానం స్మృతిః॥ బ్రహ్మసూత్ర భాష్యము. ౧౪౨ పత్రము.

ఇట్లు వచించునప్పుడు మూలమను శ్రుతి యుండగను అన్యమైన స్మృతితో ప్రయోజనము గలుగజాలదని గొందరు ప్రశ్నింపవచ్చును. ఈవిషయమై మున్ముందు స్మృతి ప్రామాణ్యాప్రామాణ్య మను విషయమును గూర్చి చతుర్థసముల్లాసమున చెప్పదలచియుంటిమి. కాబట్టి ప్రస్తుతమున వేదచతుష్టయములనెడి శ్రుత్యర్థపరిజ్ఞానా శక్తులగు వారికుపకరించునటుల వైదికభావయందుని గూఢములైన గంభీరయుక్తములగు సాచార వ్యవహారములను లౌకిక సంస్కృతమున భిన్న భిన్న కాలములలో వేఱువేఱుఋషులచే నప్పటప్పటి దేశకాల జనితాది భావముల ననుగుణ్యమగునటుల,

> శ్లో॥ శ్రుతింపశ్యంతిమునయః స్మరంతిచతథాస్మృతిం । తస్మాత్ప్రమాణముభయం ప్రమాణైః ప్రమితంభువి॥ పరాశర మాధవీయము. ౨ పత్రము.

అను నీవాక్యమనుసరించి సర్వజ్ఞులైన మునులు స్మృతులను రచించిరి. ఇందుచే నిట్లు ప్రయోజనము కలిగియున్నదని గుర్తెరుగతగియున్నది.

కాబట్టి మనము వర్ణములయొక్క ధర్మములను ఆశ్రమములయొక్క ధర్మములను నిర్ణయించుకొను నప్పుడు నన్నిటికి మూలప్రమాణమగు వేదశబ్దములనే గ్రహించి వర్ణాశ్రమముల ధర్మములను నిర్ణయించుకొనతగియున్నది. అయితే కుటుంబపోషణార్థమై నీవింద్రుడవు. చంద్రుడవని స్తోత్రపాఠమును వర్ణించు స్వార్థపరులగు వారి వచనములచే

ప్రత్యేకముగ వర్ణాశ్రమ ధర్మములను నిర్ణయించుకొనుటగాని లేక అమరకోశము, శబ్దరత్నాకరము, అను నీమొదలగుగ్రంథములచే నిర్ణయించి జెప్పుకొనుటగాని ఇప్పిన్నటికి వలను పడదనిమాత్రము జెప్పుచున్నాము.

పాఠకమహాశయులగు సదహృదయులారా!

ఆంధ్రదేశపాలనా త్త్యాధిష్ఠానము స్వీకరించి నెట్టివిషమకాలంబునను తమస్వాతంత్ర్యస్ఫూర్తికై వెనుకులాడి పరాభూతులుగాక మహావేశపరవశులగు దుర్మార్గుల ధుర్నయౌద్ధత్యము క్రశాంతముగావించి చిరంతనకీర్తి గడంచిన కమ్మవారును, కాపువారును, వెలమవారును, రెడ్డివారును, ఈ మొదలగువారు కూర్మకులావతంసులైన క్షత్రియులని మీకు దెలియబఱచుటకు సంతసించుచున్నాము. ఈకూర్మక్షత్రియకుల సముదాయమునుండి వర్తమానకాల జనసంఖ్య భారతవర్షమునయుండు జనసంఖ్యలోను వీరధిక జనసంఖ్యాకులై యుండుటచేతను, ఉత్కృష్టమైన శూరతాదిగుణములనేకములు గలిగియుండుటచేతను కూర్మకులావతంసమను సార్ధకనామమును వేదచతుష్టయ ప్రమాణములచే ప్రాచీనకాలమునుండి వీరికి చెల్లుబడి కలిగియుండుటచేతను, మనుస్మృతిలోని, శ్లో॥ సర్వేషాంతుస నామాని కర్మాణిచ పృథక్ పృథక్। వేదశబ్దేభ్యఏవాదౌ పృథక్ సంస్థాశ్చనిర్మమే॥ అను నీప్రమాణవచముననుసరించి వీరివంశమును దెలుపుకొని వ్యవహరించుటకొరకు కూర్మ=కమ్మవారు, బలిజ=కాపువారు, వర్మ=వెలమవారు, రాట్=రెడ్డివారు, అని వేదచతుష్టయములందనుస్యూతమైయుండునట్టి క్షత్రియత్వమును ముఖ్యముగ వెల్లడిపఱుచునట్టి పర్యాయశబ్దములనె ఉదహరించుకొనుచుండుట చేతను సమరములందసమానశూరత్వమునుజూపి ధురంధరాది (బహదూరు మొదలగు) బిరుదాంకితములచె వెలయుచుండువారగుట చేతను వంశానుక్రమణంబుగ ప్రభుసూచకంబులగు చౌదరి, నేని, నీడు, నాయుడు, రావు, రెడ్డి ఇత్యాది పదంబులచె ప్రకాశించుచుండు వారగుట చేతను శాశ్వతంబుగ వగల్చివిటి. పట్టభ

ద్ర, సింహతలాట, పచ్చపల్లకి, మకరతోరణము మొదలుగాగల ౩౨ ముప్పది రెండు ప్రభుచిహ్నములను * ధరించినవారగుటచేతను, దానాదులయందు కరంబు కరంబుమీదనుంచి ప్రకాశించువారగుటచేతను ఈ కూర్మకులావతంస క్షత్రియులు శ్రేష్ఠులై యున్నారని దృఢవిశ్వాసముతో జెప్పుచున్నారము.

మరియును శ్రీయుత పఱచూరి కోటయ్యచౌదరీగారు ఇట్టికమ్మవారి బిరుదావళియ్యవారు చెంగల్పట్టుజిల్లాలో మరియొకరుండునట్టును చూతో తెనాలి తాలూక సంగం జాగర్లమూడిలో జెప్పియున్నారు.

౨ ఈకూర్మ క్షత్రియకులమును గూర్చి ఏయేగ్రంథముల ననుసరించి జెప్పెదరనినచో యాజ్ఞవల్క్య స్మృతిలో నాచారకాండము. ౩ శ్లోకమగు యీక్రిందిశ్లోకముననుసరించి ప్రస్తుతమున మేముజెప్పినను బూర్వముచింంచినటుల వేదభాగములకు వ్యతిరిక్తములైన భాగములను మాత్రము విషసంపృక్తాన్నమువలె వదులుచున్నామని జిత్రించుచున్నాము.

> శ్లో॥ పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగ మిశ్రితాః। వేదాః స్థానానివిద్యానాం ధర్మస్యచచతుర్దశ॥ యా ఆ ౩ శ్లోకము.

ఇందులకర్థమేమనినచో ౧ పురాణము, ౨ న్యాయము, ౩ మీమాంసా, ౪ ధర్మశాస్త్రము, ౫ వేదాంగములైన శిక్షా, ౬ కల్పము, ౭ వ్యాకరణము, ౮ నిరుక్తము, ౯ జ్యోతిషము, ౧౦ ఛందోలక్షణము, ౧౧ ఋగ్వేదము, ౧౨ యజుర్వేదము, ౧౩ సామవేదము,

౧ నెల్లూరుజిల్లా నెల్లూరు తాలూక ముతుకూరిలో ప్రతాపరుద్రుని మంత్రియగు యుగంధరుని వంశస్థులైన మహారాజరాజశ్రీ శ్రీకంఠం వెంకటచలమయ్యపంతులు. ఈనరసయ్యపంతులు అను నీయుభయులవద్ద కమ్మవారికి యీ బిరుదు చిహ్నములుండినట్టు కొన్ని దానశాసపత్రములుగలిగి అందువలన కమ్మవారి బిరుదులయ్యవారని వేరు వారికలకు గురువులై సంచరించుచున్నారు.

౧౮ అధర్వణవేదము, అను నీ ౧౮ ధర్మమును గుర్తించుగుటకు ప్రమాణగ్రంధములై యున్నవి.

ఇటుల నీవచనముండినను బూర్వోక్తవిధికి వ్యతిరిక్తమైన విషయములు తటస్థపడినచో వాటినిత్యజించెదమని మువ్వాటికి వాకొనుచున్నాము.

శ్రు॥ కూర్మముపదధాతి। రసోవై కూర్మోరసమేవై తదుపదధాతి యోవైసఏషాం లోకానామప్సు ప్రవిద్ధానాం పరాంగోస్సేత్యత్ రత్సఏష కూర్మస్తమేవై తదుపదధాతి యావానువైరసస్తవానాత్మాసఏష ఇమఏవలోకాః॥

శతపధ బ్రాహ్మణము, ౭ కాండము, ౫ అధ్యాయము, ౧ బ్రాహ్మణము.

ఇందులకర్థమేమన్నను, ఇపుడు కూర్మశబ్దమును గూర్చి స్థాపించుటయగుచున్నది. జలమునందు మగ్నమైనటువంటి ఈలోకము వేఱుగా చేయబడియున్నది. అందుచేనిది కూర్మశబ్దవాచకమైనది. ఇందువలన యిది స్థాపింపబడినదని జెప్పుటకు హేతువైనది. ఎప్పుడు రసము (వీర్యము) అయినదో నప్పుడు విస్తారమైనశరీరమైనది. అట్టిదానినేకూర్మశబ్దవాచకమని జెప్పబడును. అందువలన యీకూర్మశబ్ద వాచకమైనది పృథివీమొదలగు లోకముల కన్వయమైయున్నది. ఇట్టివిషయమునుగూర్చి యే విద్యారణ్యులవారీ క్రిందిభాష్యమున పైమంత్రమున కర్థమును జెప్పియున్నారు.

విద్యారణ్యభాష్యమ్॥ అస్మిన్ బ్రాహ్మణే కూర్మాదీనా ముపధానమ్ విధాస్యతే। ఏషాంపృథివ్యాదీనాం లోకానామప్సు ప్రసిద్ధానాం మగ్నానాం॥

ఇచ్చటను రసమనునప్పుడు వీర్యమని విశ్వనిఘంటు మొదలగు గ్రంథములయందు నీక్రిందిశ్లోకముచే దెలియబడుచున్నది.

శ్లో॥ రసోగంధోరసేస్వాదేతిక్తాదౌ విష రాగయోః।శృంగారాదౌద్రవేవీర్యే దేహధాత్వంబుపారదే॥ ఇతివిశ్వః.

ఆత్మానామశరీరమ్॥ ఆత్మాబుద్ధిస్వభావేపి ప్రయత్నమనసోరపి। ధృతావపిమనీషాయాం శరీరేబ్రహ్మణోరపి॥ ఇత్యమరసింహః.

ఇపుడీ కూర్మశబ్దము వీర్యమునకును విస్తారమైన భూలోకము మొదలగు లోకముల కన్వయమైయున్నది. ఈవిషయమీక్రింద జెప్ప బోవునట్టి శతపథబ్రాహ్మణమునగూడా వర్ణింపబడియున్నది.

శ్రు॥ తస్యయదధరంకపాలమ్। అయఙ్ంసలోక స్తత్ప్రతిష్ఠితమివభవతి। ప్రతిష్ఠిత ఇవహ్యయం లోకోధయదు త్తరఙ్ంసా ద్యౌ స్తద్యదవ గృహీతా న్త మివభవతి। వ్యవగృహీ తాన్తోవహిద్యౌ రధయద న్తరా తద న్త రిక్షఙ్ం సవేష ఇమవేవలోకాః ఇమానేవై తల్లోకానా ముపదధాతి ॥ శతపథబ్రా ॥ కాండ 2 అధ్యా ॥ బ్రాహ్మ॥ ౧

విద్యారణ్య భాష్యమ్. ప్రతిష్ఠితమధః సర్వత్రపృష్ఠతలమ్ వ్యవగృహీతా న్తం వివిధ మవగృహీతోవనతః ప్రాన్తోయస్యత త్తనో క్తమ్ కూర్మస్యో పరికపాలం సర్వతోమణ్డలా కారేణావనత ప్రా న్తమివభవతి॥ ౧ ఇతిసాయణాచార్యః॥

ఇందుల కర్థమేమనినచో కూర్మశబ్దవాచ్యముయొక్క క్రిందిభాగమున ఖండమైన పృథివీలోకము ప్రతిష్ఠింపబడియున్నది. ఎందువల్ల ననగా నీకూర్మశబ్ద వాచ్యమైన పృథివీలోకము జలమధ్య భాగమున యుండుటచే కూర్మశబ్ద వాచ్యమైన పృథివిగను ప్రతిష్ఠింప బడియున్నది. మరియు నీ పృథివీలోకమునకు పైభాగమున యుండు ఖండము దివ (స్వర్గ) మైయున్నది. ఈస్వర్గమెట్లున్నదనినచో గృహీతా న్త (గృహీతా అన్తా అస్య) మువలె యున్నది. ఈకూర్మశబ్దవాచ్యమైన స్వర్గమునకు పృథివినికి మధ్యమభాగము అంతరిక్షముగా యున్నది. ఈయంతరి

క్షమునకుగూడా కూర్మశబ్దవాచ్యమైన లోకమనిజెప్పెదరు. అందువల్ల
నే యీకూర్మశబ్దవాచ్యమైన వీర్యమునందు సర్వలోకములు ప్రతిష్ఠింప
బడియున్నవి. ఈయర్థమునే మనుస్మృతిలో ప్రథమాధ్యాయము ౮
శ్లోకము మొదలుకొని ౧౩ శ్లోకమువరకు జెప్పాచున్నది.

> శ్లో॥ సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్సిసృక్షుర్వివిధాః ప్రజాః। అపఏవస
> సర్జాదౌ తాసువీర్యమవాసృజత్॥ ౮ తదణ్డమభవద్ధైమం సహ
> స్రాంశు సమప్రభమ్। తస్మిఞ్జజ్ఞేస్వయం బ్రహ్మాసర్వలోక పితా
> మహః॥ ౯॥ (ఆపోనారాఇతిప్రోక్తా ఆపోవైనరసూనవః। తా
> యదస్యాయనం పూర్వంతేన నారాయణస్మృతః॥) ౧౦॥ య
> త్తత్కారణమవ్యక్తం నిత్యంసదసదాత్మకమ్। తద్విసృష్టః సపురు
> షోలోకేబ్రహ్మేతికీర్త్యతే॥ ౧౧॥ తస్మిన్నణ్డే భగవానుషిత్వా
> పరి వత్సరమ్। స్వయమేవాత్మనోధ్యానాత్తదణ్డమకరోద్ద్వి
> ధా॥ ౧౨॥ తాభ్యాంసశకలాభ్యాంచ దివంభూమించ నిర్మమే।
> మధ్యేవ్యోమదిశశ్చాష్టావపాంస్థానంచ శాశ్వతమ్॥ ౧౩॥
> మనుస్మృతిః ౧ అధ్యాయము.

అర్థము. పరమేశ్వరుడు తనయొక్క శరీరమునుండి (సంకల్పము
నుండి) అనేకప్రజలను సృష్టించవలయునని కోరికచే మొదట జలమును
సృష్టిజేసెను. మరియు నాజలమునందే వీర్యమునుకూడ నారోపణజేసి
సృష్టించెను. అటుపిమ్మట పరమేశ్వరుని యిచ్ఛవలన నావీర్యమును
వర్ణమయమునగ బహుళప్రకాశమైన అండముగనాయను ఆయండము
యొక్క ప్రభ సూర్యునిసదృశముగ నుండెను. అందుండి సర్వలోకము
లలోను మొదటివాడగు పితామహుడైన సాక్షాద్బ్రహ్మయను నామ
ముగలవాడొకడు పుట్టెను. బూర్వోక్తమైన పరమేశ్వరుడా ఖండము
ను తన సంకల్పమువలన రెండుభాగములుగను జేసెను. ఆరెండు ఖం
డములలో నుండునట్టి పైభాగమునకు దివమనియు (స్వర్గమనియు) అ
ధోభాగమునకు భూభాగమనియు, మధ్యభాగమునకు అంతరిక్షమని

యు, మఱియు నెనిమిదిదిక్కులనియు, వీర్యముతోనుండు జలభాగము నకు సముద్రములనియు, ఇట్లుగ నేర్పడునట్లుజేసెను.

ఇందులో నొక కుల్లూకభట్టుదప్పఅతిప్రాచీనులైన తదితరవ్యాఖ్యాతలందరు నీశ్లోకములోని, శ్లో॥ తాసుబీజవాసృజత్॥ అను నీపాఠమును విడనాడి, శ్లో॥ తాసువీర్యమవాసృజత్॥ అను నీపాఠమును గ్రహించి వ్యాఖ్యానములను జేసియున్నారు. మఱియును ప్రొఫెసరు, జీ. జాలీఅనువారిచే సంపాదింపబడిన మనుస్మృతియొక్క ప్రతిఅత్యంతశుద్ధమైన ప్రతిగ కన్పట్టుచున్నది. అందులోను తాను వీర్యమవాసృజత్। అను నీపాఠమును జెప్పబడి యున్నది. ఇదియునుంగాక కవికులసార్వభౌముడగు కాళిదాసుచే రచియింపబడిన అభిజ్ఞాన శాకుంతలమను నాటకమున, శ్లో॥ యాస్సృష్టిః స్రష్టురాద్యావహతి విధిహుతంయాహవిర్యాచ హోత్రీ॥ అను నీప్రథమశ్లోకవ్యాఖ్యానావసరమున రాఘవభట్టులనువారు. శ్లో॥ తాసువీర్యమవాసృజత్॥ అను నీపాఠమునే గ్రహించి వ్యాఖ్యానమును రచించియున్నవారు.

ఇందులోనొక కుల్లూకభట్టుమాత్రము తాను బీజమవాసృజత్॥ అను నీపాఠమునుగ్రహించి వ్యాఖ్యానమును జేసియున్నారు. ఇట్లుండినను అర్థభేదమేమియు గన్పట్టటలేదు. ఎట్లనినచో బీజమను శబ్దమునీర్యమను శబ్దమునకు పర్యాయపదముగను కోశములలో గ్రహింపబడియున్నది. శ్లో॥ శుక్రంతేజోరేతసీచ బీజవీర్యేంద్రియాణిచ| ఇత్యమరః। ఏవమ్। బీజంతురేతసీచ। ఇతిహైమః॥ అని యిట్లుచెప్పబడియున్నది. మఱియును కుల్లూకభట్టు స్వయముగనే (తాస్వప్సుబీజం శక్తిరూపం ఆరోపితవాన్) అని వ్యాఖ్యానము జేసియున్నారు.

ఇందులో మనుస్మృతిః ౧ అధ్యాయము ౧౦ శ్లోకమగు ఆపోనరాఇతిప్రోక్తా॥ అను నీశ్లోకము॥ శతపథబ్రాహ్మణము ౬ కాండము ౫ అధ్యాయము ౧ బ్రాహ్మణమగు శ్రు॥ తస్యయదధరంకపాలమ్॥ అ

ను నీమంత్రమునకు వ్యతిరిక్తముగనుండునట్లు గన్పట్టుటచే విచారణీయ
మైన శ్లోకమని వ్రాయుచున్నాము.

ఇటుపై బూర్వోక్తమైన శ్లోకములకు వ్యాఖ్యానములగు యీక్రిం
ది వ్యాఖ్యానములలోను బూర్వోక్తాభిప్రాయమునే దెలియబఱచు చుం
డుటవలన నావ్యాఖ్యానముల నీక్రిందను జిత్రించుచున్నాము.

౧ మేధాతిథివ్యాఖ్యానము. సపూర్వనిర్దిష్ట విశేషైర్హిరణ్య గర్భః
సమవర్తత అగ్రతఇత్యాదిభిర్మంత్రైర్లబ్ధ హిరణ్యగర్భాభిధా
నః। ప్రజావివిధనానారూపాః సిసృక్షుః స్రష్టుమిచ్ఛన్నప ఉదక
మాదావససర్జ ఉత్పాదితవాన్। శరీరాత్ స్వాత్ యత్నేన గృహీ
తం శరీరమధ్యైవ తదర్శనేన ప్రధానమేవతస్యేదం శరీరంతదిచ్ఛా
నువర్తిత్వాత్। స్వస్యశరీర నిర్మాణ హేతుత్వాచ్చ సర్వలోకా
నాం శరీరంకింభౌతికేన వ్యాపారేణ కుద్దాలఖననాదినాససర్జనే
త్యతఆహ। కథంతర్హి అభిధ్యాయ అపఉత్పద్యన్తామేవమిచ్ఛా
మాత్రేణ......తాసువీర్యం శుక్ర మవాసృజత్ । ఇతిమేధా
తిథిః॥ ౮॥

౨ నందనవ్యాఖ్యానము. భగవాన్ స్వాత్ శరీరాత్ వివిధాః ప్ర
జాః సిసృక్షురితి అభిధ్యాయ అపఃసృష్ట్వా......ఆదౌసృష్టి
లేవీర్యమణ్డపరిమాణాను గుణంశక్తి విశేషమవాసృజత్। రే
తోరూపాంశేనాను ప్రావిశదిత్యర్థః॥ ౮॥ ఇతినన్దనః॥

3 కుల్లూకభట్టకృత వ్యాఖ్యానము. సోఽభిధ్యాయేతి। సపరమాత్మా
నానావిధాః ప్రజాః సిసృక్షురభిధ్యాయాపో జాయంతామిత్యభి
ధ్యానమాత్రేణాప ఏవససర్జ। అభిధ్యానపూర్వికాం సృష్టిం వ
దతో మనోః ప్రకృతిరేవాచేతనా స్వతంత్రా పరిణమత ఇత్య
యం పక్షోనసంమతః। కింతుబ్రహ్మైవావ్యాకృత శక్త్యాత్మనా
జగత్కారణమితిత్రిదండి వేదాంత సిద్ధాంతఏవాభిమతః ప్రతిభా

తి। తథాచఛాందోగ్యోపనిషత్। తదైక్షత బహుస్యాం ప్రజా యేయేతి। అతఏవశారీరక సూత్రకృతా వ్యాసేన సిద్ధాంతిత మీా క్షతేర్నాశబ్దమితి। ఈక్షతేరీక్షణ శ్రవణాత్ న ప్రధానంజగత్కా రణం। అశబ్దంనవిద్యతేశబ్దః। శ్రుతిర్యస్య తదశబ్దమితి సూత్రార్థః। స్వేచ్ఛాశరీరాత్ అవ్యాకృతిరూపాత్। అవ్యాకృతమేవ భగవద్భాష్యకారీయ వేదాంతదర్శనే ప్రకృతిస్త దేవతస్యచ శరీరం అవ్యాకృతశబ్దేన పంచభూతబుద్ధీంద్రియ కర్మేంద్రియప్రాణమనః కర్మావిద్యావాసనా ఏవ సూక్ష్మరూపతయా శక్త్యాత్మనాస్థితా అభిధీయంతే అవ్యాకృతస్యచ బ్రహ్మణాసహ భేదాభేద స్వీకారాత్। బ్రహ్మాద్వైతం శక్త్యాత్మనాచ బ్రహ్మ జగద్రూపతయా పరిణమత ఇత్యుభయమప్యుపపద్యతే। ఆద్యాస్వకార్యభూమి బ్రహ్మాండస్యసృష్టేః ప్రాక్ అపాంసృష్టిశ్చేయం మహదహంకారతన్మాత్రక్రమేణ బోద్ధవ్యా మహాభూతాదిర్వ్యంజయన్నితి పూర్వాభిధానాత్। అనంతరమపి మహదాదిసృష్టేర్వక్ష్యమాణత్వాత్। తాస్వప్సుబీజం శక్తిరూపం ఆరోపితవాన్॥ ౮॥

ఇతికుల్లూకభట్టః॥

౮ రాఘవానందవ్యాఖ్యానము. హేమ్న ఇదం హైమం। సువర్ణమయమిత్యర్థః। శుద్ధసామాన్యాత్......ఇయంచభూమి మృన్మయీనసర్వతః సువర్ణమయీత్యత ఉపచారఆశ్రితః। సహస్రాంశురాదిత్యఇత్యర్థః। అంశవోరశ్మయస్తత్తుల్యా ప్రభాదీప్తిస్తస్యాణ్డస్య తస్మిన్నణ్డేస్వయం బ్రహ్మజాతః జజ్ఞేసమ్భూతః। బ్రహ్మహిరణ్యగర్భఏవ। స్వయమితిఉక్తార్థం యోగశక్త్యాప్రగృహీతం శరీరం పరిత్యజ్యఅన్తరండం ప్రావిశత్......హిరణ్యగర్భస్యకార్యం విరాడితిహైమం బహులప్రకాశంనతు హేమమయం......తస్మిన్నణ్డే బ్రహ్మవిరాట్ జజ్ఞే అభిమానీజాతః। ఇతి రాఘవాః॥ ౯॥

౫ నన్దనవ్యాఖ్యానము. తజ్జాలానుప్రవిష్టం భగవద్వీర్యం హైమం హేమమయమణ్డమభవత్। అతఏవహి బ్రహ్మా హిరణ్యగర్భాఖ్యమసృజత్। తస్మిన్నణ్డే స్వయమేవ భగవాన్బ్రహ్మరూప ధారీజజ్ఞే॥ ౯॥ ఇతినన్దనః॥

౬ కుల్లూకభట్టకృత వ్యాఖ్యానము. తదండమభవదితి। తద్బీజం పరమేశ్వరేచ్ఛయా హైమమండమభవత్। హైమమివ హైమం శుద్ధిగుణయోగాత్। నతు హైమమేవ తదీయైకశకలేన భూమి నిర్మాణస్యవక్ష్యమాణత్వాత్। భూమేశ్చాహైమత్వస్య ప్రత్యక్షత్వాదుపచారాశ్రయణం। సహస్రాంశు రాదిత్యస్తత్తుల్యప్రభం తస్మిన్నణ్డే హిరణ్యగర్భోజాతవాన్। యేనపూర్వజన్మనిహిరణ్యగర్భోహమస్మీతి భేదాభేద భావనయా పరమేశ్వరోపాసనాకృతాతదీయంలింగ శరీరావచ్ఛిన్న జీవమను ప్రవిశ్యస్వయంపరమాత్మైవ హిరణ్యగర్భ రూపతయా ప్రాదుర్భూతః। సర్వలోకానాం పితామహోజనకః సర్వలోకపితామహ ఇతివాతస్యనామ। ఇతికుల్లూకభట్టః॥ ౯॥

౭ మేధాతిథివ్యాఖ్యానము. సభగవాన్బ్రహ్మా పరివత్సరం సంవత్సరముషిత్వాతదండ మకరోద్ద్విధా। తావతాకాలేనగర్భః పరిపచ్యతే। తస్మిన్నణ్డేస్థిత ఉత్పన్న సర్వసంజ్ఞః కథంనిర్గచ్ఛేయః మితియావత్। అణ్డమపి తావతా కాలేన భేదజాతం పరిపాకాదతః కాకతాలీయన్యాయేన తదణ్డమకరోద్ద్విధేత్యుచ్యతే ॥ ౧౨॥ ఇతిమేధాతిథిః॥

౮ రాఘవానందవ్యాఖ్యానము. తస్మిన్నణ్డే బ్రహ్మాణ్డేన ఉషిత్వాపరివత్సరం సంవత్సరంస్థిత్వా ఆత్మనోధ్యానాదహంచిదాత్మా దేహాది విలక్షణస్తదనుసన్ధానాత్। అణ్డంద్విధాభూమ్యన్తరిక్షేకరోదిత్యన్వయః॥ ౧౨॥ ఇతిరాఘవానందః॥

☞ కుల్లూకభట్టువ్యాఖ్యానము. తస్మిన్నండేస భగవానిత్యాది। తస్మిన్పూర్వోక్తేండేస బ్రహ్మావక్ష్యమాణ బ్రహ్మమానేన సంవత్సరముషిత్వాస్థి ఆత్మనైవాండంద్విధా భవత్వితి ఆత్మగతధ్యాన మాత్రేణ తదండంకృతవాన్॥ ౧౨॥

ఇతి కుల్లూకభట్టః॥

౧౦ నందనవ్యాఖ్యానము. పరివత్సరశబ్దో గర్భకాల పర్యాయయః। ఆత్మనోధ్యానా దిదంద్విధాకృత్వా శకలాభ్యాందివం భూమించతయోర్మధ్యేన్త రిక్షులోకంచ కరవాణీతివిగణయ్య స్వయ మాత్మేచ్ఛయా ప్రాకృతపురుష వదపరాధీనఇత్యర్థః ॥ ఇతినన్దనః॥ ౧౨॥

౧౧ మేధాతిథివ్యాఖ్యానము. శకలముణ్డ కపాలంతాభ్యాముణ్డకపాలాభ్యా ముత్తరేణదివం నిర్మమే నిర్మితవాన్। అధరేణపృధివీ మధ్యేవ్యోమ ఆకాశందిశోష్టౌచ ప్రాగాద్యా అవాన్తర దిగ్భిర్దక్షిణ పూర్వాదిభిః సహఅపాంస్థానమన్తరిక్షే సముద్రమాకాశంచపృధివీ పాతాలగతమ్। ఇతిమేధాతిథిః॥ ౧౩॥

౧౨ నందనవ్యాఖ్యానము. సబ్రహ్మతాభ్యాం శకలాభ్యాం దివంస్వర్గాది లోకాన్భూమించస పాతాలాం స్వర్గభూమ్యాత్మనో రూర్ధ్వాధః స్థితయోర్మధ్యేవ్యోమ అంతరిక్షలోక మష్టౌదిశశ్చ। తాసుశాశ్వతం యావత్ప్రలయావస్థాన మపాంస్థానంసముద్రాంశ్చ నిర్మమే......ఇదానీంతస్య సర్వభూతాని సిసృక్షత ఉపాదానం స్వశరీరాంశా ఇతిశ్లోకత్రయేణాహ। ఇతినన్దనః॥ ౧౩॥

౧౩ కుల్లూకభట్టువ్యాఖ్యానము. తాభ్యాంసశకలాభ్యాం చేత్యాది। శకలంఖండంతాభ్యాం అండశకలాభ్యాంఉత్తరేణదివంస్వర్లోకం అధరేణభూలోకం ఉభయోర్మధ్యే ఆకాశం దిశశ్చాంతరాళ దిగ్భిస్సహాష్టౌ సముద్రాఖ్యం అపాంస్థానంస్థిరం నిర్మితవాన్॥ ౧౩॥ ఇతికుల్లూకభట్టః॥

ఇంతవరకు జరిగిన విచారణ వలన రసమను శబ్దము కూర్మశబ్ద వాచ్యమునకు పర్యాయపదమై వీర్యశబ్దవాచకమై యున్నదని నిస్సందేహముగ దెలియబడినది. రసమను శబ్దము వీర్యమనుశబ్దమునకు పర్యాయపదమై యుండినట్లుల నీక్రింద వివరించిన కోశములను బట్టి దెలియుచున్నది.

శ్లో॥ రశోగంధోరసేస్వాదేతిక్తాదౌ విషరాగయోః। శృంగారాదౌ ద్రవేవీర్యే దేహధాత్వంబుపారదే। ఇతివిశ్వః॥

ఇదియునుంగాక వీర్యశబ్దము శుక్ర, తేజస్, బల, ప్రభావ, శక్తి సామర్థ్యములను నీశబ్దములకు పర్యాయపదమై సమానార్థబోధకమైయున్నదని యీక్రిందివచనములచే దెలియబడుచున్నది.

శ్లో॥ వీర్యం తేజః ప్రభావయోః। శుక్రేశక్తౌచేతిహైమః। వీర్యంప్రభావేశుక్రేచ తేజః సామర్థ్యయోరపి ఇతిమేదినీ। శుక్రంతేజోరేతసీచ బీజవీర్యేంద్రియాణిచ। వీర్యేబలేప్రభావేచ। ఇత్యమరః। తేజః ప్రభావేదీప్తౌచ బలేశుక్రేప్యతత్త్రిషు। ఇత్యమరః। ద్రవిణంతరః సహోబలశౌర్యాణి స్థామశుష్మంచ। శక్తిః పరాక్రమప్రాణౌ విక్రమస్త్వతిశక్తితా। ఇత్యమరః॥

ఈప్రకారముగనే తేజస్సు అను శబ్దము, బల, వీర్య, సామర్థ్యములను శబ్దములకు పర్యాయవాచకమైయున్నదని బూర్వోక్తమైన కోశములయందు జెప్పుచున్నవి. ఆయభిప్రాయమునే పైవివరించిన శ్లోకములయందు గనందగును. అందువలన కూర్మశబ్దవాచకముయొక్క-అర్థమునందు రస, వీర్య, తేజస్, యీమొదలగు శబ్దములు పరస్పరము సమానార్థకములైన పర్యాయపదములై యున్నవని దెలియుచున్నవి.

అనగా కూర్మ=రస। వీర్య। తేజస్। అతః। బల॥ రస=కూర్మ। వీర్య। తేజస్। అతః। బల॥ వీర్య=కూర్మ। రస। తేజస్। అతః। బల॥ తేజస్=కూర్మ। రస। వీర్య। అతః। బల॥ బల=కూర్మ। రస। వీర్య। అతః। తేజస్॥

3. ఇందులభావార్థమేమన్నను కూర్మశబ్దవాచకమువీర్యమను శబ్దార్థమునందు నిస్సందేహముగ నర్థముగలిగి తేజస్ బలమను శబ్దములకు తుల్యార్థమైయున్నదని యీకూర్మశబ్దవాచకమునుగూర్చి తర్కించుకొనినచో నీక్రింది విధముగ సిద్ధించుచున్నది.

రస=వీర్య। కూర్మ=రస। అతః। కూర్మ=వీర్య॥ రస=కూర్మ। వీర్య=రస। అతః। వీర్య=కూర్మ॥ వీర్య=తేజస్, కూర్మ=వీర్య। అతః। కూర్మ=తేజస్॥ వీర్య=కూర్మ। తేజస్=వీర్య। అతః। తేజస్=కూర్మ॥ వీర్య=బల। కూర్మ=వీర్య। అతః। కూర్మ=బల॥ వీర్య=కూర్మ: బల=వీర్య। అతః। బల=కూర్మ॥ కూర్మ=రస। వీర్య=కూర్మ। అతః। వీర్య=రస॥ కూర్మ=వీర్య। రస=కూర్మ। అతః। రస=వీర్య॥

శ్రు॥ యద్దేవ కూర్మము పదధాతి। ప్రాణోవై కూర్మః। ప్రాణోహీమాః సర్వాః ప్రజాః॥ కరోతిప్రాణమేవైతదు పదధాతి। పురస్తాత్ప్రత్యఞ్చముపదధాతి। ప్రత్యంచం ప్రాణందధాతి। తస్మాత్పురస్తాత్ప్రత్యంగ్ ప్రాణోధీయతే। పురు షమభ్యావృతం యజమానేతత్ప్రాణందధాతి ।౧౭। బత ।౭ కా ।౮ అ॥

ఇందులోను శ్రు॥ ప్రాణోవై కూర్మః అనునీమంత్రము ననుసరించి కూర్మశబ్దవాచకము ప్రాణశబ్దవాచకమనగా సామర్థ్యమున కన్వయమైయున్నది॥

అతః। కూర్మ=ప్రాణ। ప్రాణ=కూర్మ॥

శ్రు॥ క్షత్రమ్ ప్రాణోవై క్షత్రం। ప్రాణోహివై క్షత్రం త్రాయతేహైనం। క్షణిత్రోప్రక్షత్రమాప్నోతి। క్షత్రస్య సాయుజ్యగ్ం సలోకతాం జయతి।యఏవంవేద॥ ౮ శతపథబ్రాహ్మణము కాండ౧౪ ప్ర ౬ బ్రా ౧౭॥

ఈవిషయమున శ్రు॥ ప్రాణో వై క్షత్రమ్॥ అను నీమంత్రము ననుసరించి క్షత్రశబ్దమునకు ప్రాణశబ్దము పర్యాయపదమై యున్నది. అట్టి ప్రాణశబ్దము క్షత్రశబ్దవాచకమైయున్నది.

అతః। క్షత్ర=ప్రాణ। ప్రాణ=క్షత్ర॥

శ్రు॥ ప్రాణః ప్రాణో వై బలం తత్ప్రాణే ప్రతిష్ఠితమ్। తస్మాదాహుర్బలꣳ సత్యాదోజీయ ఇత్యేవం వేద। గాయత్ర్యాత్మాత్మా ప్రతిష్ఠితో ఽ శతపథ। బ్రా। కా ౭। అ ౮ బ్రాహ్మణము॥ ౧॥

ఈమంత్రమునందును శ్రు॥ ప్రాణో వై బలమ్॥ అను నీమంత్రము ననుసరించి ప్రాణశబ్దమనగ సామర్థ్యము ఇయ్యది బలమను శబ్దవాచకమైయున్నది. అబలమను శబ్దము ప్రాణశబ్దమగు సామర్థ్యమను శబ్ద వాచకమైయున్నది.

అతః। ప్రాణ=బల। బల=ప్రాణ ఇందు విషయమై నిరుక్తము నందు ను। క్షత్రశబ్దో బలనామ అను నీవాక్యము వైశృత్యర్థమును దెలియ జేయుచున్నది. ఇవ్విధముగనే ప్రొఫెసరు మానియరు విలియం గారు తమ సంస్కృతాంగ్లీషు డిక్షనరీయందు క్షత్రశబ్ద వాచకము బల శబ్దవాచకమని జెప్పియున్నారు. ఇటుపై జెప్పబోవు ఋగ్వేద మంత్రము గు నీక్రిందిమంత్రమున క్షత్రశబ్దము బలవాచకమై యున్నదని జెప్పబడి యున్నది.

శ్రు॥ కథా క్షత్రాశ్రియం నరమా వరుణం కరామహే । మృడీకాయోరుచక్షతమ్॥

ఋగ్వేదము ౧ మండలము ౧౩ సూక్తము.

ఇందులకు సాయణాచార్యభాష్యమందు నీక్రిందివిధము నక్షత్ర శబ్దము బలశబ్దమునకు పర్యాయపదమై యున్నదని వైమంత్రమునకు భాష్యము వ్రాసియున్నారు.

విద్యారణ్య భాష్యము. క్షత్రియం బలసేవనం నరంనతా రమ్। ఇతిసాయణాచార్యః॥

ఇదియునుగాక యీ యభిప్రాయమునే యీక్రింది ఋగ్వేద మంత్రము దెలియబఱచుచున్నది.

శ్రు॥ రయింసుక్షత్రంస్వపత్యమాయుః సువీర్యంనామ సత్యావహన్తా॥ ఋగ్వేదము మం ౧ సూ ౧.

ఇందులకు సాయణాచార్య భాష్యమందును నీక్రిందివిధమున క్షత్రశబ్దము బలవాచకమైయున్నదని యీ మంత్రమునకు భాష్యము వ్రాసి యున్నారు.

విద్యారణ్యభాష్యము. సుక్షత్రం శోభనంబలమ్॥ ఇతిసాయణాచార్యః॥

అతః। క్షత్ర=బల। బల=క్షత్ర॥ ఇపుడు క్షత్రియశబ్దము, బలమనుశబ్దము, ఈ రెండు శబ్దములు సామర్థ్యమను అర్థమునందు పరస్పరమొకటికొకటి తుల్యార్థములై పర్యాయ పదములై యున్నవను విషయము స్పష్టపడినది.

ఇటుపై కూర్మశబ్దము సామర్థ్యమను అర్థమునందు క్షత్రియపదమునకు సమానార్థకమైన పర్యాయపదమై యున్నదను విషయము నీక్రిందవివరించుకొనిన ప్రకారము తర్కించుకొనినచో సిద్ధించుచున్నది.

ప్రాణ=క్షత్ర। కూర్మ=ప్రాణ। అతః। కూర్మ=క్షత్ర॥ ప్రాణ=కూర్మ=క్షత్ర॥ ప్రాణ=కూర్మ। క్షత్ర=ప్రాణ। అతః। క్షత్ర=కూర్మ॥ ప్రాణ=బల। కూర్మ=ప్రాణ। అతః। కూర్మ=బల॥ ప్రాణ=కూర్మ। బల=ప్రాణ। అతః। బల=కూర్మ॥ ఏవమ్। కూర్మ=ప్రాణ। ప్రాణ=బల। బల=క్షత్ర। అతః। కూర్మ=క్షత్ర॥ కించ। క్షత్ర=బల। బల=ప్రాణ। ప్రాణ=కూర్మ। అతః। క్షత్ర=కూర్మ॥

ఇంతకుబూర్వము శతపథబ్రాహ్మణ కాండ ౭ అధ్యాయము ౫ బ్రాహ్మణము ౧ యిందులోను యుండినట్టి శ్రు॥ సఏవః (కూర్మః) ఇమఏవలోకాః అను నీచివర మంత్రభాగముననుసరించి పృథివీ మొదలగు లోకములయొక్క నామము కూర్మశబ్దవాచ్యమై యుండునట్టు తెలియుచున్నది. ఇంతియేగాక నీక్రిందిమంత్రము ననుసరించికూడా పృథివ్యాదిలోకములకు కూర్మశబ్దవాచ్యము యుండునట్టు గన్పట్టుచున్నది.

శ్రు. ద్యావాపృథివ్యోహికూర్మః॥ శతపథబ్రాహ్మణము. కాండ ౭ అ ౫ బ్రా ౧.

ఇందులోను కూర్మశబ్దవాచకము స్పష్టముగ దివ (స్వర్గ) మునకును మరియు పృథివికిని సాజ్ఞావాచకమైయుండునట్టు దెలియుచున్నది. మరియును ప్రొఫీసరు మానియరు విలయం సంస్కృత ఇంగ్లీషు డిక్షనరియందును కూర్మశబ్దవాచకము పృథివ్యాదిలోకముల కర్థమగుచున్నదని జెప్పబడియున్నది.

అతః। కూర్మ=పృథివీ। పృథివీ=కూర్మ। ఏవమ్। కూర్మ=స్వర్గ। స్వర్గ=కూర్మ॥

శ్రు॥ సయఃసకూర్మోఽసౌస ఆదిత్యః। అముమేవైతదుపదధాతి। తం పురస్తాత్ ప్రత్యఞ్చముపదధత్యముం దదాదిత్యం పురస్తాత్ప్రత్యఞ్చం దధాతి। తస్మాదసావాదిత్యః పురస్తాత్ప్రత్యఙ్ ధీయతే। దక్షిణతోఽషాఢాయై వృషావై కూర్మో యోషాషాఢా దక్షిణతో వై వృషా యోషా ముపశేతే। రత్నిమాత్రే రత్నిమాత్రాద్ధి వృషా యోషాముపశేతే। సైషా సార్వాసమిష్టకానాం మహిషీయదషాఢా తస్యై దక్షిణతః। స స్సర్వాసా మిష్టకానాం దక్షిణతో భవతి॥ ౭॥

శతపథబ్రాహ్మణ కాణ్డ ౭ అ ౫ బ్రా ౧.

ఇందులోనున్న విషయ మేమన్నను ఎదుట గన్పడుచుండు నాదిత్యునికి కూర్మశబ్దవాచకము పర్యాయపదమై వెలయుచున్నది. అనగా నాదిత్యుని నామము కూర్మశబ్దవాచకమై యున్నది. మిగత భాగము యొక్క మంత్రార్థము యజ్ఞవిధినిగూర్చి జెప్పుచుండుటచే ఇచటనను పయోగము గుటకలన నాయర్థమును వివరించక వదులటమైనది. ఈమంత్రమునకు యుండు విద్యారణ్య భాష్యము నీ క్రిందను జిత్రించు చున్నాము.

విద్యారణ్యభాష్యము. చ్యవనప్రదేశ పూర్వభాగే ప్రత్యంగ్ ముఖత్వేనోపధానమ్। ఉత్తరతోహిస్త్రీ పుమాంస ముపసేతే ఇతి శృతేః। పుమాన్దక్షిణభాగే యోషా ముపశేతే: ౭॥ ఇతిసాయణాచార్యః॥

ఇందువలన నాదిత్యునినామము కూర్మశబ్దవాచకమైయున్నదని ఋగ్వేదోక్త మంత్రార్థమువలన దెలియుటచే కూర్మశబ్దవాచకము ఆదిత్యుడై యున్నాడనుటలో స్పష్టపడినది.

అతః। ఆదిత్య=కూర్మ। కూర్మ=ఆదిత్య॥ (సూర్యః)

శృ॥ సయత్కూర్మోనామ ఎతద్వైరూపంకృత్వా ప్రజా అసృజత, యదసృజితాకరోత్తద వకరోత్తస్మాత్కూర్మః। కశ్యపోవైకూర్మస్తస్మాదాహుః సర్వాఃప్రజాః కాశ్యప్యఇతి॥ ౫॥

శతపథ బ్రా కాణ్డ ౭ అ ౫ బ్రా ౧.

విద్యారణ్యభాష్యం। కరోతె రౌణాదిక మప్రత్యయే బహుళం ఛందాం శీత్యుక్తే। పా॥ ౭, ౧, ౧౦, 3, హలచేతి। పా ౮-౧ ఒ ౭౭। దీర్ఘేచకృతే కూర్మఇతిరూపమ్। కూర్మశబ్దస్య కరణ ప్రవృత్తి నిమిత్తకత్వేకాశ్యపః। (త్వారకశ్యపః) కూర్మఖలు ఏవజనాః సర్వాప్రజాః కాశ్యప ఇత్యాహుః। (త్యాహ) అతశ్చ కూర్మస్య కశ్యపాత్మకత్వాత్ దదుపదానం ప్రశస్తమ్.

ఇచ్చట కూర్మశబ్దవాచ్యుడైన కశ్యపప్రజాపతిని గూర్చి జెప్పబడుచున్నది. ఈప్రజాపతి రూపమునుదాల్చిన (బ్రహ్మ) సర్వప్రజలనుసృష్టి జేసినవాడగుచున్నాడు. ఇందువలన సర్వప్రజలును (కాశ్యప్యః) కాశ్యపునివలన బుట్టినవారగుచున్నారు. దీనిచే కూర్మశబ్దవాచ్యము కాశ్యపయని దెలియబడినది. ఈకాశ్యప బ్రహ్మవలన సర్వజనులు బుట్టినట్లు నీక్రిందస్కాంద పురాణ సహ్యాద్రిఖండ 30 అధ్యాయము జెప్పుచున్నది.

శ్లో॥ జజ్ఞేహికాశ్యపోహ్యాదౌ తస్మాదత్రిరభూత్పురా॥ స్కాంద. పు. స. ఖండ. 30 అ. ౮.

ఇచట కొందరు కాశ్యపబ్రహ్మసంతతివారు సర్వజనులైయుండునప్పుడు నీకాశ్యపునికి కూర్మశబ్దవాచ్యత్వ కలిగియుండుటచేతను సర్వజనులకును కూర్మశబ్దవాచ్యత్వము జెల్లుచుండ ప్రత్యేకముగ కూర్మకులావంతసమునుగూర్చి జెప్పుట వవసరమని చెప్పినచో ఇచ్చట నట్టి శంకకవకాశము కలుగజాలదని మాత్రము వ్రాయుచున్నాము. ఏలయనినచో మేము ప్రత్యేకముగను శ్రు॥ సయఃసకూర్మోసౌస ఆదిత్యః అను నీ శ్రుతియందును తదితరశ్రుతులయందును మున్ముందు జెప్పబోవు ప్రమాణవచనములయందును జెప్పబడిన కూర్మకులావతంసులగు క్షత్రియ వర్గమునుగూర్చి మాత్రమే ఉపన్యసించుచున్నాము. కాబట్టి పై శంకకవకాశ మెంతమాత్రము గలుగజాలదు.

అతః। కూర్మ=కశ్యప। కశ్యప=కూర్మ॥ కించ। యతఃప్రజాపతి అర్థాత్ బ్రహ్మ=కూర్మ। అపిచ। కూర్మ=కశ్యప। అతః। బ్రహ్మ=కశ్యప। ఏవమ్। కశ్యప=బ్రహ్మ। బ్రహ్మ=కూర్మ।

౮. ఈబూరోక్తమైన శ్రుతులలో జెప్పబడిన కూర్మశబ్దము। నందు॥ తదస్యాస్తి......ఇతిమతుప్ అర్థమున। సూ ।సంజ్ఞాయాంమన్మనాభ్యాం। ౫. ౨. ౧౩౭. అనునీపాణినీసూత్రమునసనుసరించి (ఇట్) ప్రత్యయముజేర్చుటచే ప్రాతిపదికరూపమునందు (కూర్మిన్) అనునీశ

బ్దముసిద్ధమగుచున్నది. ఇందులోను సూ, పాచ, ౬, ౪, ౨౩. అను నీపాణినిసూత్రముచేతను మరియును. ఇడ్లభ్యోదీర్ఘాత్సుతిస్యపృక్తంహాలు ౬, ౨, ౨౮, అనునీ పాణినీసూత్రముచేతను. ఇదియునుంగాక సూ. నలోపాప్రాతి పదికాంతస్య 3, ౨, ౮, అనునీపాణినీసూత్రము చేతను (కూర్మిన్) అని జెప్పబడుట యేగాక నిందులో ప్రథమావిభక్తి ఏకవచన పుల్లింగమున (కూర్మీ) అని దీర్ఘఈకారాంతశబ్దము సిద్ధమగుచున్నది.

అదియెట్లనినచో కూర్మ + ఇని= (కూర్మ—అ) + (ఇని—ఇ)= కూర్మ + ఇన్=కూర్మిన్। పునః। కూర్మిన్ + సు=కూర్మిన్ + సు। కూర్మిన్ + ౦=కూర్మీన్ (కూర్మీన్=న్) కూర్మీ॥

౧ అతఏవ। కూర్మః (ద్యౌః స్వర్గో వా) అస్త్యస్యేతి కూర్మీ= దివస్పతిః। స్వర్గపతిః (ఇన్ద్రః) యథా ఋభుక్షః స్వర్గోస్యస్యేతి (ఋభుక్ష + ఇతి=ఋభుక్షిన్=ఋభుక్షః=ఇన్ద్రః) తద్వత్॥

౨ కూర్మః (పృథివీ। భూ। వా) అస్తస్యేతికూర్మీ। పృథివీపతిః। భూపతిః।

3 కూర్మః (రసో। వీర్యం। తేజో। వా) అస్త్యస్యేతికూర్మీ। రసవాన్। వీర్యవాన్। తేజస్వీ॥

౪ కూర్మః (ప్రాణో। బలం। క్షత్రం। వా) అస్త్యస్యేతి కూర్మీ= ప్రాణవాన్। బలవాన్। క్షత్రీ॥

ఇట్లు కూర్మ (ప్రాగుక్తకూర్మీ) శబ్దవాచకము అతిప్రాచీన శబ్దమై యున్నదని తెలియబడినది. మరియును వేదచతుష్టయములందు క్షత్రియ। రాజా ఇంద్రశబ్దములు కూర్మశబ్దమునకు పర్యాయపదములై యుండుటల నింతకుబూర్వము జెప్పిన శతపథ బ్రాహ్మణాది గ్రంథముల యందేగాక ఋగ్వేదాదిసంహితా భాగములయందునుగూడ నీక్రిందవివరించిన ప్రకారము గలవని దెలియబఱచుచున్నాము.

౧ శ్లో॥ పూర్వీశ్చిద్ధి త్వేతువి కూర్మిన్నాశసోహవ న్త ఇంద్రోతయః।
తిరశ్చిదర్యః సవనావసోగహి శవిష్ఠశ్రుధి మేహవమ్॥
ఋగ్వేదము ౮ మండలము ౫౫ సూ ౬ అష్ట ద అధ్యా

పదపాఠః॥ పూర్వీ। చిత్। హి। త్వేఇతి। తువి। కూర్మిన్। ఆశసః। హవన్తే। ఇన్ద్ర। ఊతయః। తిరః। చిత్। అర్యః। సవనా। ఆ। వసోఇతి। గహి। శవిష్ఠ। శ్రుధి। మే। హవమ్॥

౨ శ్లో॥ వరిష్ఠే అస్య దక్షిణామియర్తీన్ద్రో మఘోనాంతువి కూర్మితమః। యయావజ్రివః పరియాస్యం హో మఘాచధృష్ణో దయ సే విసూరీన్ ॥ ర॥ ఋగ్వేదము ౬ మం। 3౭ సూ। 3। అష్టకం। (౭ అధ్యా ౯ వర్గః॥)

పదపాఠః। వరిష్ఠః। అస్య। దక్షిణామ్। ఇయర్తి। ఇన్ద్రః। మఘోనాం। తువి। కూర్మి। తమః। యయా। వజ్రివః। పరియాసి। అంహః। మఘా। చ। ధృష్ణో ఇతి। దయసే। వి। సూరీన్॥ ర॥

ఇపుడు ఋగ్వేదమునందును కూర్మశబ్దవాచకముండినటుల పై మంత్రములయందు దెల్లమైనది. ఋూరోక్తమైన రెండుశ్రుతుల యందును (తువికూర్మి) అని గన్పట్టుచున్నది. ఈ రెండుశ్రుతులయందుండు (తువి) అను సశబ్దమునకు ఋగ్వేదమందే యుండునట్టి యీ క్రిందిమంత్రమునకు నిరుక్తగ్రంధకర్తయగు యాస్కాచార్యులు వ్రాసిన విషయమునే మేమిచ్చట నామంత్రమును నిరుక్తమును కూడా వ్రాయుచున్నాము.

శ్లో॥ తువిక్షంతే సుకృతం సుమయంధనుః। సాధుర్బుంధో హిరణ్యయః। ఋగ్వే। ౫, ౬, 30, ౧, నిరుక్తమ్. తువిక్షంబహువిక్షేపం। మహావిక్షేపం। వా। తేసుకృతం। సుమయం। సుసుకృతం। ధనుః। సాధయితా। నిరుక్తము. నిగమకాండము. అ ౬ ఖం 3ర పత్రము ౫3౨.

ఇందులకు దుర్గాచార్యభాష్యముకూడా నీక్రింది విధమున ప్రతి పాదింపబడుచున్నది.

దుర్గాచార్యభాష్యము. తువిక్షం। బహువిక్షేపమ్। బహూనాం విక్షేపాణాం। సుకృతం। శోభనాని। హి। యేనకర్మాణి। క్రియంతే తం। తదేవ। వా। అథవా। శోభనం। కృతం। సమయం। చ। సు ఖతరం। సుహృదామ్। కింపునస్తత్। ధనుః। కించ। సాధుర్బం ధోహిరణ్యయః। సాధయితా। సోమానం। శత్రుసంఘాతానాం వా। ఐందః। ఇషుః। హిరణ్యయః। హిరణ్యకృతఇత్యర్థః। ౫3-౨౨॥

ఇందుచే (తువికూర్మి=మహాకూర్మి) మహాకూర్మి=తువికూర్మి। అని సిద్ధించుచున్నది. అందువలన మహచ్ఛబ్దప్రయోగము గన్పట్టుట చే ఉత్కృష్టమైనటువంటి కూర్మకులావతంస మని స్తనందులకు సహిత ము బోధపడక మానదని కైముతికన్యాయముచే వ్రాయుచున్నాము. ఇదియునుంగాక ప్రొఫెసరు మానియరు విలియంగారి సంస్కృతఇంగ్లీ షు డిక్షనరియందు తువియనగ (Great) గ్రేట్ అని వ్రాయబడియు న్నది. ఇందువలన (తువికూర్మి=మహాకూర్మి) (ఇంద్రః ఈశాన) అను నప్పుడు యీరెండుశబ్దములకు మహచ్ఛబ్దము పూర్వముగా గలిగినప్పు డు మహేంద్రయనియు, మహేశానఅనియు, జెప్పునట్లుగనే యిచ్చటను మహాకూర్మి అని జెప్పనొప్పును.

ఇపుడు భూపతిః। వీర్యవాన్। తేజస్వీ। అను నీశబ్దములు కూర్మ శబ్దమునకు పర్యాయపదములై యున్నవని నిరూపించియున్నాము. మ రియును సర్వాధిరాజాఇన్ద్రః। అనునప్పుడు ఇంద్ర అను నీశబ్దము కూర్మశ బ్దమునకు పర్యాయపదమై యున్నదని నీక్రిందవివరించు వేదమంత్రము వలన గుర్తెఋగ తగియున్నది.

శ్లో॥ అథయదిరాజన్యోయజతే ఇంద్రవాజం। జయేంద్రాయవాచం।
వదతేంద్రవాచం। వదతేంద్రవాజం। జాయతోతిక్షత్రగంహీం

శ్లో॥ శుద్ధేద్విప్రోదశాహేన ద్వాదశాహేనభూమిపః॥ మ. ౫. అ. ౮౩ శ్లోకము.

ఇందువలనను భూపతిశబ్దము కూర్మశబ్దవాచ్యమునకు పర్యాయ పదమైయున్నదని దెలియునున్నది. ఇదియునుంగాక వీర్యవాౕ అను నిశబ్దమును కూర్మశబ్దవాచ్యమునకు పర్యాయ పదమై యున్నదని బూర్వోక్తవిధిని దెలియుటయేగాక మనుస్మృతి ౨ అధ్యాయము ౧౫౫ శ్లోకమగు నీక్రిందిశ్లోకముచే దెలియబడుచున్నది.

శ్లో॥ విప్రాణాంజ్ఞానతోజేషః క్షత్రియాణాంతు వీర్యతః॥ మ ౨, ౧౫౫.

మెండియు, తేజస్వీ అనునప్పుడు తేజోవంతుడనియే గ్రహించద గియున్నది. అట్టి తేజోవంతుని లక్షణము భగవద్గీతా ౧౮ అధ్యాయము ౪౩ శ్లోకమగు నీక్రిందిశ్లోకమున జెప్పుచున్నది.

శ్లో॥ శౌర్యంతేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్। దానమీశ్వరభావశ్చక్షాత్రం కర్మస్వభావజం॥ భగవద్గీతా. ౧౮ అధ్యాయము. ౪౩ శ్లో॥

అనగా శూరత్వమును, తేజోవంతమును, ధైర్యముగయుండుటయును, చాతుర్యము గలిగియుండుడియును, యుద్ధభూమియందు శత్రువులకు భయపడి పరుగిడకయుండుటయును, సామర్థ్యముగలిగి యుండుటయును, ఇవి క్షత్రియునకు స్వభావ జన్యములైన గుణములుగా యున్నవి.

ఇంగువలన బూర్వోక్తప్రమాణముల ననుసరించి తేజస్వీశబ్దము కూర్మశబ్దవాచ్యమునకు పర్యాయపదమైయున్నది.

ఇదియునుగాక క్షత్రిఅనుశబ్దము కూర్మశబ్దవాచ్యమునకుపర్యాయ పదమైయున్నది. అదియెట్లనినచో క్షత్రిఅనియు, క్షత్రియఅనియు నీ

రెండుశబ్దములు తుల్యార్థకములై యున్నవి. క్షత్రియశబ్దముయొక్క అర్థ
ము బలవాన్ అని బూర్వోక్తప్రమాణములయందు వ్రాసియున్నాము.
అదియునుంగాక ప్రస్తుతము నీక్రిందవ్రాయునట్టి ఋగ్వేద మంత్రము
నందును ఆమంత్రముయొక్క విద్యారణ్యభాష్యమునందును క్షత్రియు
డను సప్పుడు బలవంతుడని తెలియబడుచున్నది.

శ్లో॥ ఆరాజానామహఋతస్య గోపాసిన్ధుపతీ క్షత్రియాయాతమ
ర్వాక్। ఇడాంనోమిత్రా వరుణాతవృష్టి మవదివఇన్వతం జీరదా
నూ॥ ఋగ్వే। మ ౭ సూ ౧౧

విద్యారణ్యభాష్యమ్। హేరాజానా సర్వస్యస్వామినౌ। హేమ
హామతఋతినోదకస్యయజ్ఞస్యగూపాగోప యితారాగాసుభా
మంత్రితేపరాంగ్వత్సరే ఇతిపరాగవద్భావాత్। హేసిన్ధుంపతీన
ద్యాః పాలయితారౌ। హేక్షత్రియా బలవంతౌయువాం అరాగ
స్మదభిముఖం ఆయాతమాగచ్ఛతు! ఇతిసాయణాచార్యః॥

ఇందువలన హే క్షత్రియా బలవంతౌయువాం అనునీవాక్యము
వలన బలవంతః అను నీవచనము క్షత్రియశబ్దమునకు తుల్యార్థమై యు
న్నదనియు నీక్షత్రియశబ్దము కూర్మశబ్దవాచ్యమునకు పర్యాయపదమై
యున్నదని బూర్వోక్తవిధిని గుర్తెఱుగతగియున్నది. ఇదియునుంగాక
వర్మఅను నీశబ్దము క్షత్రియత్వమునకు సమానార్థకమై కూర్మశబ్దవాచ్య
మునకు పర్యాయపదమై యున్నదని నీక్రింద ఉదహరించు వేద ప్రమా
ణమువలన తెలియుచున్నది.

౭ శ్లో॥ శర్మచస్థోవర్మచస్థో.

శుక్లయజుర్వేదము, ౧౧ అధ్యాయము 30 మంత్రము.
మహీధరాచార్యభాష్యము, హేకృష్ణాజనపుష్కరపర్ణే ఉభే
యువాంశంచస్థః అగ్నేః సుఖకారిణీ అపిభవధః। వర్మచస్థఃకవ
చవద్రక్షకే అపిభవధః। ఇతిమహీధరాచార్యః॥

శ్రు॥ శర్మవర్మేదమహరాస్యైనార్యా ఉపస్థిరే।సినీవాలీ ప్రజాయతామియం భగస్యసుమతావసత్॥ కృష్ణయజుర్వేదే సమూత్రైకాగ్నికాండ మంత్రభాషే ప్రథమ ప్రపాఠకే అష్టమ ఖండే ౧ మంత్రః.

హారిదత్తాచార్యభాష్యము. సూ. లోహితంచర్మానడుహంప్రాచీనగ్రీవ ముత్తరలోమమధ్యే గారస్యోత్తరయాస్త్రీర్య। శర్మవర్మేతి। శర్మసుఖంవర్మతనుత్రాణం। ఇతిహారిదత్తాచార్యః ౨౯ పత్రమ్.

శ్రు॥ యఃసపత్నో యోఽసపత్నో యశ్చ ద్విషన్ఛపాతినః। దేవాస్తం సర్వేధూర్వంతు బ్రహ్మవర్మ మమాన్తరమ్॥

అధర్వణవేదము. ౧ కాండము. ౪ అనువాకము. ౨౦ సూక్తము, ౪ మంత్రము.

విద్యారణ్యభాష్యము. యఃసపత్నః జ్ఞాతిరూపః శత్రుః యఃఅసపత్నః జ్ఞాతివ్యతిరిక్తః శత్రుః అస్మాన్ బాధతే। తథాయశ్చశత్రుః ద్విషన్ ద్వేషంకుర్వన్। ద్విషఅప్రీతౌ। ద్విషోమిత్రే ఇతి శతృప్రత్యయః। నః అస్మాన్ అనాగసః శపాతిశపేత్। నిగ్రహరూపయా వాచానాశయేత్॥ శపఆక్రోశే అస్మాత్ లేటిఆడాగమః। యద్వృత్తానిత్యమ్ ఇతినిఘాతప్రతిషేధః। తంసర్వంప్రాగుక్తం శత్రుంసర్వే నిఖిలాదేవాః ఇంద్రాదయోధూర్వంతు హింసంతు। ధూర్విహింసాయాం। శతృకృతశాపస్య అసంస్పర్శనోపాయమ్ ఆహవ్యవధాయకం వర్మకవచం భవతు॥ యథాశతృకృతావాక్శస్త్రాదయః అస్మాన స్పృశన్తి తథాఅయంమన్త్రః అస్మాన్ ఛాదయతు ఇత్యర్థః। ఇతిసాయణాచార్యః అధ ౧ సంపుటమ్ ౧౧౧ పత్రమ్.

ఇట్టిప్రమాణము లనేకములు గన్పడుచున్నవి। ఈకారణమువలన వర్మశబ్దము। వృఞావరణేఅనుసీధాతువువలన వృణోతిశరీరం వర్మఅనిశబ్ద

నిష్పత్తిగలుగుచున్నది. వర్మ అనునీశబ్దము బూరో్వ్క్త ప్రమాణమువలన కవచాదులను ధరించువాడు వర్మ అని దెలియబడినది. అందువలన క్షత్రియుడు కవచాదులను ధరించి యుద్ధమునందు బ్రవర్తించుచున్నాడు. కాబట్టి నట్టి క్షత్రియునికి వర్మయని జెప్పుటచే క్షత్రియశబ్దమునకు వర్మశబ్దము పర్యాయపదమై యున్నది గనుక క్షత్రియవర్మ శబ్దములు రెండును బూరో్వ్క్తవిధుల ననుసరించి కూర్మశబ్దవాచ్యమునకు పర్యాయపదములై యున్నవని గ్రహింపవలయును. మరియును యీక్రిందవివరించి శంఖస్మృతి ౨ అధ్యాయము ౪ శ్లోకమగు నీక్రిందిశ్లోకమును బట్టియు వర్మశబ్దము క్షత్రియశబ్దమునకు పర్యాయపదమైయున్నదని దెలియుచున్నది.

శ్లో॥ శర్మాంతం బ్రాహ్మణస్యోక్తం వర్మాంతం క్షత్రియస్యతు। ధనాంతంచైవవైశస్య...... ౪॥ శంఖస్మృతిః ౨ అ. ౪ శ్లో.

ఇట్లుండుటచే బూరో్వ్క్తవిధులన్నియు సమీచీనములై యున్నవని గుర్తెఱుగతగినవి.

ఇటుపై రాట్ అను నీశబ్దముకూడ క్షత్రియ శబ్దమునకు పర్యాయపదమై యున్నదని గ్రహించుటకు నీక్రిందను వ్రాయునట్టి అమరకోశశ్లోకమే ప్రమాణమై యుండుటయేగాక వేదప్రమాణములు గూడ గన్పడుచున్నవి.

౯ శ్లో॥ రాజా (రాజ్ఞ) రాట్పార్థివక్ష్మాభృ నృపభూప మహీక్షితః। అమరకోశము క్షత్రియవర్గము. ౧ శ్లోకము.

ఈఅమరకోశవచమేగాక నీక్రింది అథర్వణవేదవచనమున్ను, నిరుక్తవచనమున్ను విశేషించి రాట్శబ్దమునుగూర్చి జెప్పుచున్నవి.

శృ॥ ఉతగ్నా వ్యన్తుదేవ పత్నీరిన్ద్రాణ్యగ్నాయ్యశ్వి నీరాట్। ఆరోదసీ వరుణాని శృణోతువ్యన్తుదేవీర్య ఋతుర్జనీనామ్॥ ౨ అథ

ర్వణవేదము. ౭ కాండము. ౪ అనువాకము. ౫౧ సూక్త
ము. ౧౦ మంత్రము.

విద్యారణ్య భాష్యము. ఉతఆపిచ దేవపత్నిః దేవాపతయో
యాసాంతాః దేవానాంపత్న్యః ఇతివా। గ్నాఃదేవ్యః వ్యన్తుకా
మయన్తామ్ అశ్నంతువా। హవీంషీతిశేషః। తాదేవపత్నీర్ద
ర్శయతి। ఇన్ద్రాణి ఇన్ద్రస్యపత్నీ। ఇన్ద్రవరుణ ఇతిజీపానుకౌ।
అగ్నాయీఅగ్నేఃపత్నీః।వృషాకప్యగ్నికుసితకుసీదానామ్ ఉదా
త్తః ఇతి ఏకారాదేశోజీప్చ। అశ్వినీ అశ్వినోర్జాయారాట్
రాజన్తి। రాజతేక్విప్। రోదసీరుద్రస్యజాయా వరుణానీవరుణ
స్యపత్నీ ఆశృణోతు అభిముఖం సర్వతోవాశృణోతు. అస్మదీ
యం హవ్యంవ్యన్తుఅశ్నంతు। కామయన్తా వాహవీంషీ దేవీర్దే
వ్యః। కస్మిన్ కాలేహవిః కామనంతమ్ఆహ। యఃజనీనాం జా
యానామ్ ఋతుఃకాలస్తస్మిన్। పత్నిసంయాజకాల ఇత్యర్థః।
అత్ర। అపిచగ్నావ్యన్తు దేవపత్న్యః। ఇంద్రాణీంద్రస్యపత్నీ।
అగ్నాయ్యగ్నేఃపత్నీ। అశ్విన్యశ్వినోః పత్నీ। రాట్రాజతేః।
రోదసీరుద్రస్యపత్నీ । వరుణానీ। (చ) వరుణస్యపత్నీ వ్యన్తుదే
వ్యః కామయన్తామ్। యఋతుః కాలేజాయానామ్ఇతినిరుక్తం
అనుసంధేయమ్। (ని। ౧౨, ౪౬)

అధర్వణవేదము, ౨ సంపుటము. 3-3 పత్రము.

ఇందునరాట్అనునీ శబ్దమునకు రాట్రాజతేఅను నీవాక్యము
ను విద్యారణ్యభాష్యమునందును. నిరుక్తమునందును. చెప్పబడియున్న
ది. ఇందులకు రాట్అనగా ప్రకాశించువాడనినచో నైశ్వర్యకర్మలచే
ప్రకాశించువాడవి యింతకుబూర్వము వ్రాయబడిన అధర్వణవేదము
౨ సంపుటము. ౨౦౧ పత్రమందుండు శ్రు॥ త్వమిన్ద్రాధిరాజః అను
నీమంత్రభాష్యావసరమున విద్యారణ్యులవారు రాజతిః। ఐశ్వర్యకర్మా.
అనునీవ్యాకరణధాతువును ప్రయోగించి భాష్యమొనర్చి యున్నారు.

అందువలన రాట్ఛబ్దము క్షత్రియపదమునకు పర్యాయ పదమై యున్నది. ఈక్షత్రియశబ్దము కూర్మశబ్దవాచ్యమునకు పర్యాయ పద మైయున్నదని ఇంతకుబూర్వమే వ్రాసియున్నాము.

౧౦ ఇదివరలో జెప్పిన ప్రమాణములన్నియు కూర్మశబ్ద వాచకము నుగూర్చి జెప్పినవయ్యెయున్నవి. అయినను మరల నాశబ్దమునుగూర్చి ప్రత్యేకముగ వ్యాకరణాది గ్రంథములవలన వివరించ దలచితిమి నాశ బ్దమును చర్చలోకి గొనినచ్చుచున్నాము.

ఈకూర్మశబ్దవాచకము స్వతః। లుమనుష్యే (౫, ౩, ౯౮) అ ను నీపాణినీయసూత్రము ననుసరించి సూర్యసదృశప్రతాపముగల తేజో వంతుడగు పురుషవిషయమై సంయుక్తపఱచుట యోగ్యమైయున్నదని దెలియుచున్నది. ఇందువలన నిదివరలో నెచ్చటెచ్చట వేదములయం దీ కూర్మశబ్దవాచకము ప్రయోగింపబడియున్నదో నచ్చటచ్చట క్షత్రి యశబ్దమునకు పర్యాయపదముక్రింద నుపయోగింపబడియున్నది. అం దువలన నీకూర్మశబ్దవాచకము క్షత్రియశబ్దవాచకమునకు సమానార్థకప దమైయున్నదని దెలియజేయుచున్నాము. ఇటుపైన యీకూర్మశబ్దవా చకమునకు వైదిక లౌకికములయందేమర్థము గన్పడుచున్నదో కొంచ మాలోచించి విమర్శించెదము. వైదికభాషయందీ కూర్మశబ్దవాచకము నకుగల యర్థమును ఇదివరలోనే జెప్పియున్నాము. ప్రస్తుతము లౌకి కార్థమును గుర్తుగ తగియున్నది. ఈకూర్మశబ్ద వాచకము కుః=ర మః। కూర్మః అను నీప్రకారము జెప్పబడును. కుః అనగా భూమి అని యు, రమః అనగా వల్లభుడనియు, ఇందువలన భూవల్లభుడనియు ఇట్లు నిర్ణయించడమైనది. ఇందులకు నీక్రింది ప్రమాణవచనములచే దృఢపఱ చుచున్నాము,

శ్లో॥ సర్వంసహావసుమతీ వసుధోర్వీవసుంధరా। గోత్రాకుః పృథి వీపృథ్వీక్ష్మావనిర్మేదినీమహీ॥ అమరకోశము.

అనియిట్లు జెప్పియుండుటచే కుః అనునప్పుడు భూమి అని దెలియబడినది. ఇటుపైరమయనినచో నీక్రిందిప్రమాణములచే గుర్తుగ తగియున్నది.

శ్లో॥ పునరేహివాచస్పతేదేవేన మనసాసహ। వాస్తోష్పతేనిరమయ మయ్యేవాస్తుమయిశ్రుతం॥ అధర్వణ వేదము. ౧ కాండము. ౧ సూ. ౨ మంత్రము.

ఈమంత్రమునకు విద్యారణ్యులవారు విశేషించి భాష్యమును వ్రాసియుండుటచే రమయఅను నీశబ్దమునకు వ్రాసిన భాష్య పంక్తులనుమాత్రము నీక్రింద వ్రాయుచున్నాము.

విద్యారణ్యభాష్యము. రమయ అభిమతగ్రామాది లక్షణ ఫలప్రదానేననితరామ్ అస్మాకంక్రీడయ। యతస్త్వం వసుపతి అతస్తవగ్రామాది వివిధ ఫలప్రదాన శక్తిరస్తి। తస్మాత్ అస్మదపేక్షితానాం వివిధఫలానాం సాకల్యేన ప్రదానాత్ నిరంతరం సుఖయేత్యర్థః। అస్మాదేవలిఙ్గాత్ గ్రామసంపదాదిషు కర్మసువినియోగ ఉపపన్నః రముక్రీడాయామ్। అస్మాత్ హేతుమతిణిచి ఉపధావృధౌజనీ జ్ఞప్యక్రిసురజ్ఞో మన్త్రాశ్చేతి మత్వాత్॥ మతాంహ్రస్వః ఇత్యుపధాహ్రస్వత్వం। ఇదానింగ్రామాది వివిధసంపత్యసర్వోత్కృష్టతాం ఆత్మనః ప్రార్థయతే। అధర్వణవేదము. ౧ సంపుటము. ౧౨ పత్రము.

ఈభాష్యములోనుండు అభిప్రాయ మేమనినచో అభిమతగ్రామాదిలక్షణ ఫలప్రదానసనక్రీడయ అను నీప్రకారము యుండుటచేఇందువలన యిష్టమైనగ్రామాదుల సంపాదనము మొదలుగాగల లక్షణములయొక్క ఫలప్రదానముచేత నాయందుక్రీడింపుము అనియుండుటచేతను, అస్మదపేక్షితానాం వివిధఫలానాంసాకల్యేన ప్రదానాత్ నిరంతరం సుఖయేత్యర్థః। అనగా మేమపేక్షించిన ఫలములు సంపూర్ణ

ముగానిచ్చుటచేతను మాయందు నిరంతరము సుఖించుము. అను నీ ప్రకారము యుండుట చేతను, ఇదియునుంగాక అస్మాదేవ లింగాత్ గ్రామసంపదాదిషు కర్మసు వినియోగః. అనగా నీధాతువు గ్రామముల సంపాదనము మొదలగు సంపదలయొక్క కర్మలయందే వినియోగించతగియున్నది. అని యిట్లు చెప్పియుండుటచే కుః=రమః=కూర్మః। అనునప్పుడు భూవల్లభుడనియే జెప్పవలయును. ఒకవేళ నిట్లు ప్రసంగించినచో కుః=రమః=కూర్మ అనునప్పుడు మత్స్యయుండు దీర్ఘమున కెట్లు గలిగెనని మనుష్యుల ప్రశ్నించెడదేని అంశములకు మీమాంసయనివర్తియగు నట్లుగ అధర్వణవేదమునుండియు నందుల కనుగుణ్యమగు విద్యారణ్య భాష్యములనుండియు కొన్నిప్రమాణముల నీక్రిందను వ్రాయుటచే మీకుగల సంశయనివారణ యగునని దలచుచున్నాము.

శ్లో॥ కణ్వఃకక్షీవాన్ పురుమీఢోఅగస్త్యః శ్యావాశ్వః సోభర్యర్చనానాః। విశ్వామిత్రోయం జమదగ్నిరత్రిరవన్తునః కశ్యపోవామదేవః॥ అధర్వణవేదము. ౧౮ కాండము. 3 అనువాకము. 3 సూక్తము. ౫ మంత్రము.

విద్యారణ్యభాష్యము. కణ్వాదయోద్వాదశ సంఖ్యాకా ఋషయోనః అస్మాన్ అవన్తురక్షన్తు। కణతిః శబ్దార్థః। అశుప్రుషిలటికణిఖటి విశభ్యః క్వన్ (ఉ ౧, ౧౮౯) ఇతిక్వన్ ప్రత్యయః (నిత్త్వాద్ ఆద్యుదాత్తః) కణ్వశబ్దః। కక్ష్యారజ్జురశ్వస్య కక్షం సేవతే (నిరుక్తం. ౬, ౬) ఇతియాస్కః। తద్వాన్ కక్షీవాన్। ఆసన్దీవద్ అష్ఠీవచ్చక్రీవత్ కక్షీవత్ ఇతిమతుపినిపాత్యతే। పురుమీఢః। మిహసేచనే ఇత్యస్మాత్ కర్మణినిష్ఠా। పురూణిమీఢాని సిక్తాని అపత్యానియస్యసతథోక్తః। యద్వామీఢమ్ ఇతిధననామ। పురూణిమీఢాని ధనానియస్య సతథోక్తః। బహుధనఇత్యర్థః। అగస్త్యః ప్రసిద్ధః। శ్యావాశ్వః శ్యావాః కృష్ణవర్ణాఅశ్వాయస్యసతథోక్తం। సోభరీప్రసిద్ధః। అర్చనానాః అర్చనమ్ అర్చనీయమ్ అనఃశకటంయస్యసః తథోక్తః॥ సంజ్ఞాశబ్దోయమ్। సచ

అత్రీణాం ప్రవరమధ్యేపఠ్యతే। అ త్రేర్భూర్చనాన సశ్యావశ్వేతి। శ్యావాశ్వవత్ అర్చనానసవత్। (అత్రివత్) ఇతి విశ్వామిత్రః। విశ్వం సర్వం జగత్ మిత్రం యస్యసతథా। మిత్రేచర్షౌ ఇతివి శ్వశబ్దస్యదీర్ఘః। అయమ్ ఇతిఇదంశబ్దేన పురోవర్తివస్తువాచినా సర్వజనసన్నిహి తత్వేన సర్వమిత్రత్వమ్ ఉపపాద్యతే। జమద గ్నిః। జమతిర్జ్వలతికర్మా। జమన్తోజ్వలన్తః అగ్నయోయస్య స తథోక్తః। అత్రిః। ఆధ్యాత్మికాధిదైవకాధిభౌతిక భేదభిన్నాస్త్రి విధా దుఃఖానుభవాయస్యన విద్యన్తేసతథా అతఏవయాస్కోపిర వోచత। తస్మాత్ అత్రిర్నత్రయఇతి (నిరుక్తం 3, ౧౭) కశ్యపః ఆద్యన్తవర్ణవిపర్యయః। సర్వంజగత్ సర్వదాసౌ క్ష్మేణ పశ్యతీతి కశ్యపః। శ్రూయతేహి, కశ్యపః పశ్యకోభవతి యత్ సర్వంప రిపశ్యతీతి సౌక్ష్మాత్ ఇతి (తై, ఆ, ౧, ౮, ౮) వామదేవః। వామోవననీయో దేవోద్యోతకోస్తి తత్త్వవిషయే బోధోయ స్యసతథా। సఖలుగర్భావస్థ ఏవసన్ ఉత్పన్న తత్త్వజ్ఞానః స్వ స్యసర్వాత్మ్యమ్ అను సందధౌ శ్రూయతేహి, అహంమను రభ వం సూర్యశ్చఇతి (ఋ. ౪, ౨౬, ౧) ఇతిసాయణాచార్యః. అథర్వణవేదము. ౪ సంపుటము. ౧౪౧ పత్రము.

ఈభాష్యమువలన మనము గుర్తింపగ తగిన దేమన్నను విశ్వా మిత్రః। విశ్వం సర్వం జగత్ మిత్రయస్యతథా। మిత్రేచర్షౌ విశ్వశబ్దస్య దీర్ఘః। అయమ్ ఇతిఇదంశబ్దేన పురోవర్తిష్తువాచినా సర్వజనసన్నిహిత త్వేన సర్వమిత్రం ఉపపాద్యతే। అను నీవాక్యములోనుండు విశ్వామి త్ర అనునప్పుడు విశ్వం=మిత్రం యస్య=సః=విశ్వామిత్రః। అనగా యు స్య। ఎవనికి। విశ్వం। ప్రపంచము। మిత్రం। స్నేహముగలదియో। సః। వాడు। విశ్వామిత్రః। విశ్వామిత్రుడని జెప్పబడును. ఈవాక్యమునం దుండు దీర్ఘముయెట్లు లోభించినదో కొంచము నాలోచించి జూచుకో నతగియున్నది. ఒకవేళ మిత్రేచర్షౌ అను నీసూత్రమువలన విశ్వామి త్రశబ్దము ఋషివాచకమగుటచే దీర్ఘము లోభించినను లోభించవచ్చు

ను గాని ఈకూర్మశబ్దవాచకము ఋషివాచకము గాకబోవుటచే దీర్ఘము లోభించుటకు వీలుగలుగజాలదని నొకసమయమున జెప్పినను చెప్పుదు రేమోయని దలచుచున్నాము. అట్లు మీరు జెప్పినచో నీకూర్మశబ్ద వాచకముకూడా ఋషివాచకమైయున్నదని యీక్రిందను మున్ముందు వివరించు వాక్యములవలన మీకు దెలియగలదని వ్రాయుచున్నాము. ఇదియునుంగాక నీకూర్మశబ్దవాచకము భూవాచకము గాకబోయినచో శ్రు॥ ద్యావాపృథివ్యోహి కూర్మః॥ అను నీశతపథబ్రాహ్మణము ౭ కాండము. ౫ అధ్యాయము. ౧ బ్రాహ్మణమునకు విరోధము తటస్థపడు ను. అందువలన నీశ్రుతికి విరోదార్థమైన వ్యతిరేకార్థమును జెప్పుటకు నెవరు నిచ్ఛగించరుగదా కాబట్టి మేముజెప్పిన అన్వయమే సమన్వయ మైయున్నదని వ్రాయుచున్నాము.

ఇటుపై కూర్మకులావతంసము సూర్యవంశమని దెలియుటకై స్కాందపురాణ సహ్యాద్రిఖండయందుండియు, ప్రాచీనులగు రాజాధి రాజులిచ్చినదాన పత్రములనుండియు, పాశ్చాత్యపండితులచే బ్రకటింప బడిన చరిత్రలనుండియు కొన్ని ప్రమాణములను మున్ముందు వ్రాయు చుమీడెందంబుల నానందంబు నొందజేయుచున్నాము.



ఇతిశ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతీ కృతిషు సుభాషా విభూషితాయాం జయార్థప్రకాశి కాయాం కూర్మశబ్దార్థనిరూపణపరే ప్రచ్ఛన్న రాజకులనిర్ణయాఖ్యే తృతీయభాగే ప్రథమః సముల్లాసః సంపూర్ణః.



ఓమ్.

# జయార్థ ప్రకాశిక.

## ద్వితీయసముల్లాసము.

అస్మద్దేశస్థితార్యవర్యులారా!

౧ ఈలోకమునందుగల సకలవిద్యలయందును ప్రథమవిద్యయేదో దేనిసహాయమువలన సృష్టిక్రమములన్నియు జరుగుచున్నవో అట్టి సర్వోత్కృష్టమైన ప్రథమవిద్యకు వేదమనిపేరు. వేదయితీతివేదః। తెలియజేయునది కావున వేదమనియును మరియు విందఃతీయతో ధర్మాధర్మావితివేదః। అనగా దీనిసహాయమువలన ధర్మాధర్మములు తెలియబడును. ఇవియేగాక శ్రూయతేయితి శ్రుతిః అనగా పరమేశ్వరునివలన వినబడుటజేసి శ్రుతి యనబడును. ఇట్లుగానిచో నిందున ధర్మాధర్మములు వినబడుటచే శృతియనియును, ఇట్లుగా జెప్పబడుచున్నది. వేదము మొదట పరమేశ్వరునివలన అగ్ని, వాయువు, ఆదిత్య, ఆంగీరసులను ఈనలుగురు ఋషులకును వారివలన తచ్చిశిష్యపరంపరకును సాంగముగా నుపదేశింపబడెనని పెద్దలు వచింతురు. మరియునట్టి పవిత్రమైన వేదవిద్యమహనీయులగు భారద్వాజ, ఆంగీరస, జమదగ్ని, పరాశర. గౌతమ, నారద, వశిష్ఠ, విశ్వామిత్ర ప్రభృతితాపసోత్తములచే లోకమున బ్రచురింపబడెననియు ఇందులో పరాశరపుత్రులగు పరమతబోధకులైన వ్యాసభగవానులు అధ్యయనసౌకర్యార్థమై వేదవిభజనముగావించిరనియు ధీమంతులు వచింతురు. ఇట్టివేదములలోను శుక్లయజుర్వేదాంతర్గతమగు శతపథ బ్రాహ్మణము. ౭ అధ్యాయము. ౫ బ్రాహ్మణములో నీక్రింద నుదహరించు మంత్రమును గమనించినచో నొకవిశేషమును గన్పట్టదగును.

శృ॥ సయఃసకూర్మోసైన ఆదిత్యః। అముమేవై తముపదధాతి। శతపథబ్రాహ్మణము. ౭ అధ్యాయము. ౫ బ్రాహ్మణము.

ఇందులోని కూర్మశబ్దవాచకము ఆదిత్యశబ్దవాచకమునకుపర్యాయ పదమగుటచే నీకూర్మకులావతంశము పురాణాదులయందు ప్రసిద్ధమగు సూర్యవంశమగు క్షత్రియకులమని యెన్నటకు నేయొక్క యాక్షేపణము గన్పట్టజాలదని మున్ముందుగ వక్కాణించుచున్నాము. అదియెటులననిన నీక్రిందవిధించిన విధుల ననుసరించి మనము గుర్తెరుగతగియున్నది.

ఆదిమస్వాయంభువమనువుకీర్తి దేహుడై నతదనంతరము బెక్కుతరములు గడచిన మీదట నాస్వాయంభువ మనువుచే స్థాపింపబడిన యాసింహాసనమునకు బ్రహ్మయొక్క మానసపుత్రుడగు కశ్యపుడును ఈతనిపుత్రుడైన సూర్యుడును, ఈసూర్యుని పుత్రుడగు వైవశ్వతమనువనునతడు ప్రభువయ్యెను. ఇందువలన నీకూర్మవంశమునకు పురాణాదులయందు సూర్యవంశమని నామాంతరముగలిగినది. ఈవిషయమంతయు స్కాందపురాణాంతర్గతమైన సహ్యాద్రిఖండ ౭౭ అధ్యాయమున చెప్పబడినది. ఆప్రమాణవచనములు నీక్రిందను వ్రాయుచున్నాము.

౨ మహాదేవఉవాచ. శ్లో॥ బ్రహ్మణోమానసాః పుత్రాః కశ్యపాదిమునీశ్వరాః। కస్యపస్యసుతఃశ్రీమాన్ సూర్యోభాస్వాన్జగత్ప్రభుః॥ ౧॥ జగచ్చక్షుర్జగద్ధామ విశ్వసాక్షీ సహస్రపాత్। వైవస్వతో మనుస్తస్మాత్సూర్యాత్సమ భవత్కిల॥ ౨॥ తస్మిన్కులేసముత్పన్నో దిలీపఇతివిశ్రుతః। నాన్యోవదాన్యః శూరశ్చసత్యవాదీజితేంద్రియః॥ ౩॥ దిలీపాత్తురఘుర్జజ్ఞే తస్మాదజ సముద్భవః। అజాద్దశరథో జాతస్తత్పుత్రోరామ ఇత్యభూత్॥ ౪॥ రామాత్కుశః కుశాజ్జజ్ఞేహ్యతిథిర్నామ భూపతిః। అతిథేర్నిషధో జాతోనాభశబ్దస్తతోహ్యభూత్॥ ౫॥ పుండరీకస్తతోజజ్ఞే క్షేమధన్వాతతః స్మృతః। దేవానీకస్తతోహ్యాసీద్వానీ నామచ తత్సుతః॥ ౬॥ దలోరాజాతతోజాతః శీలస్తత్సుత ఇత్యభూత్। ఉమాఖస్తత్సుతోజజ్ఞేవజ్రనాభస్తతఃపరమ్॥ ౭॥ ఖండనస్తత్సుతోహ్యాసిద్వ్యుషి తశ్చతతఃపరమ్। తస్మాద్విశ్వ సమశ్చాసీత్ బ్రా



హ్మణో౽ధార్మికః శుచిః॥ ౮॥ హిరణ్యనాభ ఇతివై తత్సుతః
సంప్రకీర్తితః। కౌశల్యాతస్సుతో౽జజ్ఞే తస్మాతో౽ప్యమసుతః ప్రభుః॥
౯॥ బ్రహ్మిష్ఠశ్చాత్మజస్తస్య పుష్యస్తత్సుర ఇత్యభూత్। తస్మా
త్సుదర్శనోనామహ్యగ్ని వర్ణస్తతస్స్మృతః॥ ౧౦॥ తస్యవత్సో౽న్య
పో౽జజ్ఞేహ్యశ్వపాతిరితీరితః। అపుత్రః సో౽భవద్రాజపుత్రార్థం య
త్నవానభూత్॥ ౧౧॥ ఋషీణాం సంమతింకృత్వా పుత్రేష్టిం
కృతవానితి। సర్వస్వం దక్షిణాం తత్ర బ్రాహ్మణేభ్యః ప్రదత్త
వాన్॥ ౧౨॥ నారాయణః। ప్రసన్నో భూద్వాక్యమే తదువాచ
హ। భృగుః ప్రసన్నః కర్తవ్యః సతేపుత్రం ప్రదాస్యతి॥ ౧౩॥
భృగుః ప్రసాదితస్తేన విచారంకృతవానితి। సమీక్ష్యాన్మునీస్సర్వా
న్ద్వాదశాదిత్య సన్నిభాన్॥ ౧౪॥ ఉల్లంఘ్యయుదిదస్యామి తేషాం
కో౽పోభవేదతః। తావద్భిర్మునిభిస్తా వద్దాపయామాసవై మనూన్
౧౫॥ సంఖ్యాకాన్ద్వాదశ మంత్రాన్ దాపయామాసవై మునీన్
తేమన్త్రాఋషి వర్గోధాః సర్వకామఫలప్రదాః॥ ౧౬॥ ఋష
యస్తపసాశ్రేష్ఠాస్తా న్ఋషీన్ ప్రబ్రవీమితే। భారద్వాజః పూ
తమాత్సో౽వశిష్ఠః కశ్యపస్తథా॥ ౧౭॥ హారితో౽వృద్ధవిష్ణుశ్చతథా
బ్రహ్మా జనార్దనః। (ధనంజయః) సౌబలః (శ్రీవత్సః) గౌతమ
శ్చైవ మాండవ్యః కౌశికస్తథా॥ ౧౮॥ విశ్వామిత్ర ఋషిః
శ్రేష్ఠో ద్వాదశైతే ప్రకీర్తితాః। మునిప్రణీతా మంత్రాస్తేతే
షాం వై దేవతాశ్శృణు॥ ౧౯॥ ప్రభావతీ కాళికాంచ చండికా
చతతస్స్మృతా। మహాలక్ష్మీ ఇతిప్రోక్తా తథాయోగీశ్వరీతిచ॥
౨౦॥ ఇంద్రాణీచైవ కామాక్షీ హ్యేకవీరాంబికాతథా। మ
హేశ్వరీతథా దుర్గాత్వరితాహ్యను పూర్వశః॥ ౨౧॥ అనుజో
దేవకశ్చైవ పృథుర్వై ఋతుపర్ణకః। జయఃసుశిభ్రిః సౌవా
మః సుమంతః కౌండినస్తథా॥ ౨౨॥ మండూకః కుశికశ్చైవ
మార్తాండశ్చ తతస్స్మృతః। భారద్వాజకులీనశ్చ యుక్తియుక్త
శ్చధీమతాత్॥ ౨౩॥ ప్రభాదేవ్యాశ్చ భక్తస్యధార్మికస్య దమ

యస్యచ। ఋషేరనుజవంశస్య విస్తారంచ బ్రవీమి తే॥ ౨౪॥ అను
జస్యత్రయః పుత్రాః కృపాయు స్తత్సుతో౽హ్యభూత్। వరుణార్ణ స్త
తః ప్రోక్తః సిద్ధిమాద్య స్తతఃపరమ్॥ ౨౫॥ తస్మాత్తుస్సుఘర్షి ఃసంజాతః
కంకణాశ్చతతఃపరమ్ మాంగల్యశ్చకుణాశ్చైవధృతబీజశ్చతత్సుతః॥
౨౬॥ భాషితశ్చతతో జ్ఞేయఇత్యేతేహ్యనుజాఃసుతాః। కాలికాయా
స్తుభక్తస్య పూతమాతృమునేఃకులే॥ ౨౭॥ జాతస్యదేవకస్యాపి
విస్తారంప్రబ్రవీమ్యహమ్। దేవకస్యసుతఃప్రోక్తో హిరణ్య ఇతినా
మతః॥ ౨౮॥ తస్మాత్తుసంతతు నామా చర్రె వతశ్చతతః పరమ్।
జయవంత స్తతః ప్రోక్త స్తస్మాద్దృష్ట జయోనృపః॥ ౨౯॥ సుర
ధశ్చ తతో జ్ఞేయః సుతంతుశ్చ తతఃపరమ్। సారంగ స్తత్సుతో
జ్ఞేయః సారంగాల్లాలలాలనః॥ 30॥ ధనద స్తత్సుతః ప్రోక్తోయు
ధాజిచ్చతతఃపరమ్। పూతమాతృకులేచైతేజాతాః పరమధార్మి
కాః॥ 3౨॥ చండికాయాశ్చ భక్తస్య వసిష్ఠస్యమహామునేః గో
త్రవంశస్యచ పృథోర్వంశంసమ్య గ్వదామ్యహమ్॥ 33॥ పృథో
ర్భూషణ భూపాలోరంతి జిచ్చతతఃపరమ్। రంతినాధ స్తతో జ్ఞే
యోరంతికాల స్తతః పరమ్॥ 3౪॥ కిర్మీరితత్సుతః ప్రోక్తోగూఢ
నాభిశ్చతత్సుతః। దృఢిశ్చతత్సుతః ప్రోక్తః కేతుమాలీ తతఃప
రమ్॥ 3౫॥ హ్యాసిష్టాః పార్థివా జ్ఞేయాశ్చండికాః కుల దేవతాః।
కశ్యపశ్చ మునేర్గోత్రే ఋతుపర్ణనృపస్యచ॥ 3౬॥ మహాలక్ష్మ్యాః
పాదపద్మసేవకస్య మహాత్మనః। బ్రవీమివంశవిస్తారం గుణగౌరవ
మాదరాత్॥ 3౭॥ ఋతుపర్ణో ద్వారుణకో వారుణిశ్చతతః ప
రమ్। తస్మాశ్చగోపతి ర్జ్ఞేయో ధృతధన్వాతతఃపరమ్॥ 3౮॥ శీలి
రంధ్రి స్తతో జ్ఞేయ స్తత్సుతః పుత్రవానితి। సిద్ధపూర్ణ స్తతో జ్ఞే
యోహ్యపాంగశ్చః తతఃపరం॥ 3౯॥ శంఖశేరం తతో జ్ఞేయశ్చి
త్తురశ్చతతఃపరం। రుచిరశ్చ తతో జ్ఞేయో భద్రపాణి స్తథా పరం॥
౪౦॥ మంధరశ్చతతఃప్రోక్తో బ్రహ్మవిశ్వ స్తతఃపరం। కాశ్యపా
ఋతుపర్ణాశ్చ మహాలక్ష్మీ ప్రసేవకాః॥ ౪౧॥ హారీతస్యఋషేః

ర్వం శోజయనాజ్ఞాతభూపతిః యోగీశ్వరీసేవకస్య వంశపూర్వ్యాహం
బ్రవీమి తే॥ ౪౨॥ జయాత్తుపాండ్రకో రాజా తస్మాద్దండ ఇతీ
రితః। దండాచ్ఛద మనోజ్ఞేయో దీర్ఘబుద్ధి స్తతః పరమ్॥ ౪౩॥
పాంచజన్య స్తతో జ్ఞేయో భాసుశ్చితతః పరమ్। లిపింజయ స్త
త్సుతో భూల్ల గలశ్చతతఃపరమ్॥ ౪౪॥ శార్దూలశ్చతతో జ్ఞేయో
గోపాలశ్చ తతఃస్మృతః। యోగేశ్వర్యాః ప్రసాదజ్ఞో హరితో జ
యనామకః॥ ౪౫॥ కథితాస్తే మయా తాత కామశాస్త్రవిశార
దాః। వృద్ధవిష్ణు మునిః ప్రోక్త ఇంద్రాణీ నామ దేవతా॥ ౪౬॥
స్పృషిర్భ్రార్నృపతి జ్ఞేయ స్తస్య వంశంవదామి తే। స్పృషిర్భ్రా
ర్యాత్తుధానశ్చ యుధామన్యు స్తతః పరమ్॥ ౪౭॥ డిండిరాజ స్త
తో జ్ఞేయో వైరాజశ్చ తతఃస్మృతః। దేవరాజ స్తతో జ్ఞేయః ప్రో
థపాద స్తతః పరమ్॥ ౪౮॥ దృఢబుద్ధి స్తతో జ్ఞేయో మితబుద్ధి
స్తతఃపరమ్। కటుకశ్చతతః ప్రోక్తః సారంగశ్చతతఃస్మృతః॥ ౪౯॥
వృద్ధివిష్ణుశ్చ త్వింద్రాణ్యాసు శిభృర్నామకాన్నృపాః। కథితస్తే మ
హాబుద్ధేహ్యాన్యం నిగదతః శృణు॥ ౫౦॥ కామాధిదేవతా యత్ర
మునిర్బ్రహ్మా జనార్దనః। సౌదామనామకో రాజా తస్యవంశం వ
దామి తే॥ ౫౧॥ సౌదామద్భద్రపీఠశ్చ హరిద త్త స్తతః పరమ్।
గుణవిష్ణు స్తతో జ్ఞేయః కామమాలీతతఃపరమ్॥ ౫౨॥ వనాయు
జ స్తతో జ్ఞేయో యోగమాలీతతః పరమ్। ఏవంగదితవంశాస్తై
భూపా బ్రహ్మజనార్దనాః॥ ౫౩॥ సాబల్య ఋషివర్యశ్చ త్వే కవీ
రశ్చదేవతాః। తస్మాజ్జాంగలికో రాజా తస్యవంశబ్రవీమి తే॥ ౫౪॥
సుమంతస్తు భయోరాజా మాతంగశ్చతతఃపరమ్। మాతంగా
స్మలయోషశ్చ మలయోషాద్ధనందమః॥ ౫౫॥ ధనందమాన్మా
ర్గణశ్చ మార్గణాన్నింబదేవతా। తస్మాజ్జాంగలికో రాజా కుంభ
యోగీతతఃపరమ్॥ ౫౬॥ భద్రహర్ష స్తతో జజ్ఞే వత్సనాభా స్తతః
పరమ్। వత్సనాభాద్విదర్ణశ్చ నైగమశ్చమహాబలః॥ ౫౭॥ మేన
కోనామభూపాలో రామాజీవశ్చతత్సుతః। సాబల్యాస్తే కవీరా

యాభక్తాః సామంతవఃస్మృతాః॥ ౫౮॥ కౌండిన్యసంబి కా
యాశ్చ కౌండినాః ప్రబ్రవీమితే। కౌండినాద్భద్రవాణిశ్చ సాగ
రశ్చతతఃస్మృతః॥ ౫౯॥ ఏవంపరంపరాప్రాప్తా రాజానః శుభ
లక్షణాః। మాండవ్యమునికర్షశ్చ మాహేశ్వర్యాశ్చసేవకాః॥
౬౦॥ మండూకవంశజా ఏవతానహం వక్ష్మిసాంప్రతమ్। మం
డూకాజ్జాటరీర్జజ్ఞే జాటరేర్విష జాంగలః॥ ౬౧॥ తత్పుత్ర పౌ
త్రావిజ్ఞేయాః శాంత్యాది గుణసంయుతాః। కౌశికశ్చమునిప్రో
క్తో దుర్గాదేవీ తథైవచ॥ ౬౨॥ కుశికోరాజవర్యశ్చ తస్యవంశం
వదామి తే। కుశికాన్నహుషోరాజా నహుషాజ్జాంగలి స్తథా॥
౬౩॥ జాంగలశ్చసుతః సోభూత్ కుండినశ్చతతఃపరమ్। కథితాః
కౌశికాపూర్వా బ్రాహ్మణ్యారాజసత్తమాః॥ ౬౪॥ విశ్వామిత్ర
స్యగోత్రత్వం త్వరితాదేవతాతథా। మార్తాండనాయకం భూపం
వర్ణయామి సమాసతః॥ ౬౫॥ మార్తాండచ్చండ పరశుతస్మాద్ధి
మరథ స్తథా। వర్ణితా స్తవ రాజానః సాన్వయాశ్చ సదేవతాః॥
౬౬॥ తేషాంచవంశ విస్తార స్త్వనంత త్వాన్నవర్ణ్యతే। తేషాం
చపుత్రాశ్చ పౌత్రాశ్చప్రసూతా వై మహీతలే॥ ౬౭॥ కథితం
తేమయాతాత మహాత్మ్యం వంశసంభవమ్। తస్యస్మరణ మా
త్రేణ సర్వపాపైః ప్రముచ్యతే॥ ౬౮॥

ఇతి శ్రీస్కాంద పురాణే సహ్యాద్రిఖండే సప్తవింశతితమోధ్యా
యః॥ ౨౭॥ అధ్యాయము.

3 ఈవిషయము విస్తరించి తెలుసుకొనగోరువారు శేషించిన
అధ్యాయములనుజూచి తెలుసుకొనెదరని కోరుచున్నాము. ఇందున
కూర్మకులావతంసుల యొక్క వంశపరంపరనుగూర్చి జెప్పియుండుట త
మకందరికి స్పష్టముగ దెలిసినవిషయమేయని ఇందులకు నర్థమునువ్రా
యనైతిని. ఈకూర్మకులావతంసమునందే నొకఋషి జన్మించి వారును
తన్నామమును ధరించియుండుటచేతనే తద్వంశీకులెల్లరు నేటివరకును ఆ
నామమును ఉపనామముగా గ్రహించి వ్యవహరించుదురని యిదివరలో

వ్రాసియున్నాము. ఆవిషయమును తమకు తెలియగలందులకై స్కాంద పురాణాంతెర్గతమైన సహ్యాద్రిఖండ 33 అధ్యాయము నీక్రింద జెప్పిం చినప్రకారము జెప్పియున్నది. ఆప్రమాణవచనములను యీక్రింద వ్రాయుచున్నాము.

శ్లో॥ మాలామాలినీభక్తస్య కూర్మనామ్నో ఋషేఃకులే। ౧౬౪ భూతః ప్రథమతో రాజా ప్రాణనాథ ఇతీరితః। తస్యవంశోన్నృపో జజ్ఞే బాహుశాలీ ఇతీరితః॥ ౧౬౫॥ తదన్వయన్నృపోజాతో దీర్ఘ బాహురితిశ్రుతః। తస్మాచ్చ వీరసేనాద్యా బభూవుః ప్రీతివర్ధనాః॥ ౧౬౬॥

ఇందులకర్థమేమన్నను మాలామాలినీ దేవతయొక్క భక్తుడైన కూర్మశబ్దవాచకుడైన ఋషియొక్క కులమునందు మొదట ప్రాణనాథు డనువాడు జన్మించెను. ఇతనినే గురునాథుడనికూడా జెప్పెదరు. ఈ గురునాథునిగూర్చి ఈకూర్మకులావతంసులు నేటివరకును అచ్చటచ్చట పూజించుచున్నారు. అటుపిమ్మట నావంశమునందే బాహుశాలియను రాజొకడు పుట్టెను. ఈబాహుశాలియను రాజువలన వీరసేనాదిగాగల ప్రీతివర్ధనులు జన్మించిరి. అను నీప్రకారము జెప్పియున్నది.

ఇందువలన నీకూర్మమహాఋషి క్షత్రకులసంజాతులైనట్లు దెలియుచున్నది. ఈకూర్మమహాఋషి పురాణ ప్రసిద్ధుడగుటయేగాక ఋగ్వేదకాల మప్పటికే ప్రసిద్ధిజెందియుండినట్లు నీక్రింది ప్రమాణముల వలన గ్రహించతగియున్నది. ప్రాచీనకాలమగు ఋగ్వేదకాలమునుండి యీకూర్మమహాఋషి యుండుటచేతనే ఇట్టివంశము ప్రసిద్ధమైనదని మనము గుర్తెఱుగతగియున్నది.

ఋగ్వేదము ౧ మండలములో ౨౭ సూక్తమగు నీక్రింది సూక్తమునకు కూర్మ మహాఋషి ఋషియైనట్టు ఋగ్వేదము జెప్పు చున్నది.

శ్లో॥ ఆదిత్యానాం ఇమాగిరః॥

ఋగ్వేదము ౧ మండలము ౨౭ సూక్తము.

ఇదియునుంగాకను నిరుక్తములో దేవతాకాండముయొక్క టీక యందును ఈక్రిందిప్రకారము వ్రాయబడియున్నది.

శ్లో॥ ఇమాగిరః ఆదిత్యేభ్యః॥

ఋగ్వేదము ౨ మం ౭, ౬, ౧, య. వా. సం. ౩, ౫౪.

నిరుక్తటీక. కూర్మస్య గార్త్సమదస్య। గృత్సమదస్య వేయ మార్షమ్।

నిరుక్తము. దైవతకాండము. అ. ౧౨. ఖం ౩౬. పత్రము. ౮౫౫.

ఇందుచేస్పష్టపడిన దేమన్నను ఈగృత్సమదఋషియొక్క పుత్రుడు కూర్మమహాఋషిఅని యిట్లు జెప్పదగును. ఎందువల్లననినచో వ్యాకరణము ననుసరించి గృత్సమదస్యాపత్యం పుమాన్ అను నీయర్థము నందు గృత్సమదఅణ్ + గార్త్సమదఃఅనియిట్లు సిద్ధించుచున్నది. ఇందుల కనుగుణ్యముగను ప్రొఫిసరు తారానాథ తర్కవాచస్పతిగారిచే రచియింపబడి ౧౮౯౬ సం॥ ముద్రితమైన తులాదానాదిపద్ధతిఅను పుస్తకముయొక్క ౧౪౦ పత్రమునందు యీక్రింద జెప్పబడిన మంత్రము యొక్క వినియోగమునందు నీక్రిందివిధమున వ్రాయబడియున్నది.

ఆదిత్యానాం ఇమాగిరఇత్యాదికస్య సప్తదశర్చస్యాదిత్య సూక్తస్య గృత్సమదపుత్రః కూర్మఋషిః। త్రిష్టుప్ఛందః। ఆదిత్యదేవతా స్తత్ప్రీతయే జయార్థేజపే వినియోగః॥

ఇదియునుంగాక ప్రొఫిసరు మానియరు విలియంగారిచే రచింపబడిన సంస్కృతఇంగ్లీషు డిక్షనరీయందును కూర్మఋషి అనునప్పుడును గృత్సమదఋషి పుత్రుడని జెప్పబడియున్నది. మరియును మహాభారతములను శాసనిక పర్వములో ౬౦ అధ్యాయమున గృత్సమదఋషి

వీతహవ్య మహారాజుయొక్క పుత్రుడనియును ఈచెప్పబడిన వీతహవ్య మహారాజు భృగుమహాఋషియొక్క బోధవలన బ్రహ్మ ఋషియైనట్లును చెప్పబడియున్నది. ఆప్రమాణవచనముల నీక్రిందవ్రాయుచున్నాము.

రాజా (ప్రతర్దన) ఉవాచ.

౮ శ్లో॥ అయంబ్రహ్మాన్నతో౽పీత హవ్యస్సజ్ఞతామ్। అస్యపుత్రైగ్నిమేకృతో౽న్య బ్రహ్మన్ వంశప్రణాశితః॥ ౫౧॥ అస్యేదానీం వధాదద్యభవిష్యామన్నృణః పితుః। తమువాచకృపావిష్టో భృగుర్ధర్మభృతాంపరః॥ ౫౨॥ నేహాస్తిక్షత్రియః కశ్చిత్సర్వేహీమే ద్విజాతయః। ఏతత్తువచనంశ్రుత్వాభృగోస్తథ్యంశః ప్రతర్దనః॥ ౫౩॥ పాదావుపస్పృశ్యశనైః ప్రహృష్టోవాక్య మబ్రవీత్। ఏవమప్యస్మిభగవాన్ కృతకృత్యో౽నసంశయః॥ ౫౪॥ యఏష రాజావీర్యేణ స్వజాతింత్యాజితో౽మయా। అనుజానీహిమాం బ్రహ్మన్ ధ్యాయస్వచశివేనమాం॥ ౫౫॥ త్యాజితో౽హమయాజాతిమేష రాజా భృగూద్వహ। తతస్తేనాభ్యనుజ్ఞాతో యయౌరాజా ప్రతర్దనః॥ ౫౬॥ యథాగతం మహారాజా ముక్త్వావిషమివోరగః। భృగోర్వచన మాత్రేణ సచబ్రహ్మర్షితాంగతః॥ ౫౭॥ వీతహవ్యోమహారాజా బ్రహ్మవాదిత్వ మేవచ। తస్యగృత్సమద పుత్రోరూపేణేంద్ర ఇవాపరః॥ ౫౮॥ శక్రస్త్వమితియోదైత్యైర్ని గృహీతః కిలాభవత్। ఋగ్వేదేవర్తతేచాగ్ర్యా శృతిర్యస్య మహాత్మనః॥ ౫౯॥ యత్రగృత్సమదో రాజన్ బ్రాహ్మణైః సమహీయతే। సబ్రహ్మచారీతి విప్రర్షిః శ్రీమాన్ గృత్సమదో౽భవత్॥ ౬౦॥ శ్రీమహాభారతము అను శాసనికపర్వము ౩౦ అధ్యాయము.

ఇందుల కనుగుణ్యముగ శ్రీమదాంధ్రమహాభారతము అను శాసనికపర్వమునయుండు విషయము నీక్రిందవ్రాయుచున్నాము.

వీతహవ్యుండను రాజునకు బ్రాహ్మణత్వంబుగలిగినప్రకారము.

వ॥ అనినవిని ధర్మజుండు వీతహవ్యుండను రాజు బ్రాహ్మణత్వంబు బడసెనని వింగున్నత్తెఱంగెఱింగింపు మనవుడు నతనికి శంతనునందనుండిట్లనియె. మనుసంభవుండైన శర్యాతి యన్వయంబున హైహయుండను నొక్క జనపతిజనియించి వత్సదేశాధీశుండయి పాలిచె నాతనికి వీతహవ్య నామంబునుం గలిగి యుండు దదీయభార్యలు పదుండ్రు వారలు వీరులు ప్రబలులగు పుత్రుల నూర్వురఁగాంచి రమహాత్మురథులు విక్రమకుతూహలంబున,

సీ. హర్యశ్వు గాశీశునాజికి బిలిపించి యొక్కయుమ్మడిలావు నుక్కుమెఱయ । బోదివిచంపిరివాని పుత్రుండు పట్టంబుగట్టి సుదేవుండు గ్రమ్మఱంగ । నురవడినరిగి యద్ధరణీశునని దెగఁజూచి రా హైహయ సుతులుగడిమి । నాతని నందనుండగు దివోదాసుండు రాజైన నమహోగ్రమణుమీఁద॥ ఆ. నడచివారు ఘనరణంబొనరించినై । న్యంబుద్రుంచి రోడియతడుపాఱి । ప్రకటసంయమిని భరద్వాజమునిగని । యధికభక్తినతనినాశ్రయించి॥ ౧_౨౦॥

క. తనకులముచవీతహవ్యుని । తనయులచే ద్రుంపబడుట దగనెఱిగింపఁగ । వినియతఁడాడకునికొఱకు । తనయుని గల్పింతు రిపువిదారణనిపుణుఁగ॥ ౧_౨౧॥

వ॥ అని పుత్రకామేష్టిచేసినం బ్రభవించిన పుత్రుండప్పుడ పదుమూడేండ్ల ప్రాయంబువాడయ్యె ప్రతర్దన నామధేయుండగు నక్కుమారుండ మహాత్మున యనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబయధిగమించె॥ ౧_౨౨॥

చ. మునికృవనావహింపగ సముజ్వలతేజము బొందిప్రీతిమై । జనకుడుయావరాజ్యపద సంగతుంజేసినచేర్చి యవ్విభుం । డనుమతిసేయనెత్తి చనియాజిముఖంబున వీతహవ్యనం । దనతతినెల్ల గీటడచె దర్పమెలర్పఁగ నస్త్రమంబునఁగ॥ ౧_౨౩॥

క. తనయులదెగటార్చి వడిం। దనమీదం గవిసినం బ్రతర్దను శౌర్యంబు
నకలికి వీతహవ్యుం। డనయము వెసబాఱె భృగువు నాశ్రమమున
కున్॥ ౧౨౪॥

ఆ. పాఱిభీతిదోప బల్కెనమ్మునిదన। కైనశిష్యసమితిలోననునిచె।
నతని గాశిరాజు సుతుడును వెనువెంట। దగిలియచట కఱిగి త
గువిధమున॥ ౧౨౫॥

క. మునిపతికి నివినయముసే। సిననిటరాశకుగతంబు సెప్పుమనియెన।
జ్జన వంద్యుడకుమారుం। డనఘా మదన్వేష్ఠ నృత్తివైవి నవల
యున్॥ ౧౨౬॥

వ॥ అనిపలికి తమకులంబు వీతహవ్యుని కొడుకులచేత నశించినవిధం
బును దాను వారలసందఱ మర్దించుటయును వీతహవ్యుండా
హవంబునందనకు నోడిపాఱుటయును జెప్పి మునీంద్రాయారా
జిటవచ్చె నాతనిం బొలియించుటకై వచ్చెననిన నత్తపోధనసత్త
ముండు॥ ౧౨౭॥

క. వినుమిచ్చటనృపకులసం। జనితుడు లేడింతయుం బ్రశస్తమహీందే।
వనికాయము కనుగొనుమని। తనశిష్యప్రతతి జూపెదయచిగు
రొత్తన్॥ ౧౨౮॥

వ॥ చూపినంజూచి॥ ౧౨౯॥

ఆ. అతడుసగుచు భృగునియమునుగులకెఱగిమ। హాత్మాదీననే గృతా
ర్థవృత్తి। నైతిబగతునిట్లు జాతికింబెడబాపి। గాశిగాగజేయగం
టిగాన॥ ౧౩౦॥

క. కలుగనేయమోఘమగునీ। పలుకున కనృతత్వమేను బనివినియె
దన। న్నలఘుకృపజూడుమునితగ। బలికినముని బ్రీతినా నృపతి
విద్యో.తెపెన్॥ ౧౩౧॥

ఆ. వీతహవ్యకుసు మహాతపస్సందీప్తు। డైన యమ్మునీంద్రుసత్ప్రత
ర్కబ్ర్గ। భంగిభాషణముల బ్రాహ్మణుడై గృత్సమధ పమాఖ్య
గాంచె మహితసుతుని॥ ౧౩౨॥

వ॥ తత్పుత్రపౌత్రక్రమంబున సుతేజసుండును, వర్చసుండును, విహ
వ్యుండును, వితత్యుండును, సత్యుండును సంతుండును శ్రవసుం
డును, ప్రకాశుండును, వాగింద్రుండును, ప్రమతియును, రురుం
డును, సముద్రుండును, శునకుండును, శౌనకుండును ననమహా
ద్విజులు జన్మించిరిట్లు విద్యామహా కీర్తిక శ్రేణి వంశంబగు ముని
వంశంబునకు మూలంబై యవ్వీతహవ్యుండు భవ్యమూర్తి వడ
సె. ౧౩౩, ౧ అశ్వాసము.

శ్రీమదాంధ్ర మహాభారతము అను శౌనకపర్వము ౧౨ పేజీ.

ఈపై నుదహరించిన సంస్కృతమహాభారత శ్లోకములకుకొం
చము తారతమ్యముగ నాంధ్రమహాభారతమున నీవిషయము దెలియ
బడుటచే బూర్వోక్తమైన యీభారతశ్లోకముల కర్థమును వ్రాయనైతి
మి. ఇదియునుంగాక నీస్కాంద పురాణాంతర్గత సహ్యాద్రిఖండయం
దును ఈకూర్మకులావతంశమున జన్మించిన అశ్వపతియను రాజుయొక్క
వంశానుక్రమణికయందును కూర్మకులావతంశమును గూర్చి విశేషము
గా వర్ణించియున్నది. మరియును ఈ కూర్మ కులావతంశమునుగురించి
అనేకపండితులు నీక్రిందివిధమున వర్ణించియున్నారు.

అట్టిపండితులలో నొకరగు జయపురాధీశ్వరునియొక్క ఆజ్ఞమీ
దను పద్మాకరకవియనువారు జగద్వినోదమను కావ్యగ్రంధమును వ్రా
యుచు అంత్యగద్యలయందు కూర్మకులావతంశమునుగూర్చి యీక్రిం
దివిధమున జెప్పియున్నారు.

ఇతి శ్రీకూర్మకులావతంస శ్రీమన్మహారాజాధిరాజ రాజ రాజేంద్ర
శ్రీసవాయి మహారాజజగత్ సింహాజ్ఞయా మధురాస్థానే మో
హనలాల భట్టాత్మజకవి పద్మాకరవిరచిత జగద్వినోద నామక
కావ్యే శృంగారరసావలంబన విభావప్రకరణమ్॥ ౧॥

మరియును శ్రీవిహారీలాల్ కవివలనకీర్తిస్తూశకము ౬-౨౩ సం॥ దోహా। అను చందస్సున హిందీభాషా గ్రంథమును రచించుటలో శ్రీరాజరాజేంద్రుడగు జయసింహుని వంశావళిని జెప్పునప్పుడు శ్రీకూర్మకులావతంసాయని సంబోధించి వ్రాసియున్నారు.

వెండియును ఈశ్వరభక్తులగు నాభదాసులు తమచే రచింపబడిన భక్తమాలఅను గ్రంథమున పృధ్వీరాజును గూర్చి జెప్పుటలో కూర్మకులావతంసాఅని సంబోధించి వ్రాసియున్నారు.

మరియును మిశ్రమణసూర్యమల్ల విరచితరాజ పుత్రస్థానముయొక్క వంశావళిని దెలియ జేయునట్టి వంశభాస్కరమను గ్రంధము లోను ద్వితీయభాగము. ౧౦౧౩ పత్రము మొదలు ౧౦౧౮ వరకు కూర్మకులావతంసము సూర్యవంశాతర్గతమై యున్నట్టు గద్యయందు క్రింది విధమున జెప్పియున్నారు.

> సుమిత్రవంశే రాట్టోరు కూర్మవంశోత్పత్తి తృతీయరాశి సప్తపంచాశస్మయూఖ॥

ఇదియునుంగాకను భూషణకవియను వారొకరు శివభావనీ అను నీనామమునుగల నొకగ్రంథమును రచించి అందున ఈకూర్మవంశము యొక్క శాసనమునుగూర్చి జెప్పుటలో నీకూర్మవంశము సూర్యవంశమైన క్షత్రియకులమని జెప్పియున్నారు.

వెండియును కర్నేలటాడ అనువారిచే రచియింప బడిన రాజపుత్రస్థానముయొక్క చరిత్రను వ్రాయుచు ఈకూర్మవంశము శ్రీరామచంద్రుని పుత్రుడగు కుశమహారాజువలన విశేషముగ ప్రచారణలోనికి గొనిరాబడినదని జెప్పియున్నారు.

౬ ఈవిషయము దృఢముగ బోధకాగలందులకై స్కాందపురాణాంతర్గత సహ్యాద్రిఖండమునుండి కొన్ని అధ్యాయముల నిచ్చట వ్రాయుచున్నాము. అందులోను కూర్మకులావతంసమును గూర్చి కొన్ని విషయములు జెప్పియుండుటచేతను అట్టి ధర్మములను తెలుసుకొనుటకు

ను, ఈకూర్మకులావతంశముయొక్క వంశపరంపరను గుర్తెఱుగుటకను, తదితరధర్మములను బోధజేసుకొనుటకును అనుకూలమైయుండుటచే ఆ ప్రమాణవచనములను యిచట శిఖరించుచున్నాము. ఇదియునుగాకను కూర్మకులావతంసాంతర్గతమగు చంద్రవంశమునుగూర్చి బ్రతిపాదించుట యేగాక నావంశపరంపరనుగూడ దెలియబఱచుచున్నది. ఈచంద్రవంశము కూర్మవంశాంతర్గతమైనదని జెప్పుటకు సంతసించుచున్నాము. అదియెట్లనిన నో నింతకుబూర్వము ఆదిమస్వాయంభువ మనువు తదనంతరము వైవస్వతమనువునుండి కూర్మవంశము ఉత్పన్నమైనదని జెప్పియుంటిమి. ఈవైవస్వతమనువు సూర్యునిపుత్రుండనియు, ఈసూర్యుడు కాశ్యపునివలన జనించినవాడనియుగూడా జెప్పియుంటిమి. ఇపుడీ చంద్రవంశమునకును మూలపురుషుడు కాశ్యపుడనియు, అతనివలన అత్రిమహర్షి జనించెననియు, ఆయత్రిమహర్షివలన చంద్రుడును, చంద్రుని వలన బుధుడును, బుధునివలన పురూరవుడును, ఈపురూరవుని వలన పరంపరాగతం బగుటచే నీవంశమునకు చంద్రవంశమని యన్నదగును. ఈకూర్మవంశమునకు సూర్యవంశమనియు, చంద్రవంశమనియు, రఘువంశమనియు, పురూరవవంశమనియు, అను నీప్రకారముభయవంశములుకొన్ని హేతువులచే భిన్నభిన్న నామములతో వ్యవహరింప బడుచున్నవి. అందువలన నుభయవంశములను కూర్మవంశమని జెప్పుట గలిగినది. మఱికొన్ని హేతువులచే నీకూర్మవంశమునకు ఇక్ష్వాకువంశమనియు, భరతవంశమనియు, కురువంశమనియు, పాండవవంశమనియు, ఇటులనేక ప్రకారములచే వ్యవహరించుటకూడా గలదు. ఈరెండువంశములు కూర్మవంశమని జెప్పుటకు నీక్రిందయుదహరించు శృతియే ప్రబల ప్రమాణమైయున్నది.

శృ॥ సయత్కూర్మోనామ' ఏతద్వైరూపంకృత్వా ప్రజాపతిః ప్రజా అసృజత । యదసృజతా కరోత్తద్యదకరోత్తస్మాత్కూర్మః. కశ్యపోవైకూర్మస్తస్మాదాహుః సర్వాః ప్రజాః కాశ్యప ఇతి॥ శతపధబ్రాహ్మణకాండము. ౭ అధ్యాయము. ౫ బ్రాహ్మణము, ౧.

ఈహేతువులనుబట్టి చంద్రవంశమునుగూడ గుర్తెఱుగట యోగ్యమై యుండుటచే నందుల కనుగుణ్యములగు ప్రమాణములు నిచట వ్రాయుచున్నాము.

## ౭ అథచంద్రవంశోత్పత్తి కథనమ్.

గణేశఉవాచ॥ శ్లో॥ దేవదేవ జగన్నాథ భక్తానుగ్రహకారక। సంశయంతు మహాదేవ ఛేత్తుమర్హస్యశేషతః॥ ౧॥ త్వయోక్తఃసూర్యవంశో మేహ్యాదితః సవిశేషితః। అతఃపరం మహాదేవ చంద్రవంశవినిర్ణయమ్॥ ౨॥ వక్తుమర్హస్యశేషేణ భక్తానుగ్రహకారక। త్వమేజగతాం నాథోహ్యజ్ఞానం ప్రతిబోధకః॥ ౩॥ యత్కర్తాహి ప్రజానాంచసంహర్తా రక్షకస్తథా। పురాణ పురుషోనిత్యం బద్ధానాం బంధమోచనః॥ ౪॥ కథయస్వప్రసాదేన మహేశ్వర మహాప్రభో॥ శంకరఉవాచ॥ శృణువత్స ప్రవక్ష్యామి చంద్రవంశప్రవిస్తరమ్॥ ౫॥ యంశ్రుత్వా వంశవర్యాంహి విస్మయోజాయతేనృణామ్। చంద్రవంశోమహావీరా హారినద్యాదయో నృపాః॥ ౬॥ తంవంశంచవదిష్యామి తవాగ్రేచగజానన। నకస్యాపి మయాప్రోక్తం కారణంవంశనిర్ణయమ్॥ ౭॥ యదితే శ్రవణేబుద్ధిర్వక్తుమిచ్ఛామిహ్యాదితః। జజ్ఞేహికశ్యపోహ్యాదౌ తస్మాదత్రిరభూత్పురా॥ ౮॥ విద్యుత్తేజః సమోలోకే జాతోత్రిస్తపసాపురా। అత్రిచక్షుః సముత్పన్నస్తేజసాం పతిరీశ్వరః॥ ౯॥ ఆహ్లాదకోహిలోకానా మోషధీనాంచ పోషకః। ధాత్వర్థస్యబలాత్సోపి చంద్రనామేతివిశ్రుతః॥ ౧౦॥ తత్పత్నీరూప సౌభాగ్య నామ్నారూపాంగనాశుభా। తస్యాంచనిర్మితః పుత్రోరూప లావణ్య సంయుతః॥ ౧౧॥ వదాన్యోవీర జిద్వీరోవర కర్మావరాననః। నామ్నాబుధ ఇతిఖ్యాతో బుధానాం బోధకారకః॥ ౧౨॥ పురాణేషు చసర్వేషు విశ్రుతో వరదోవిభుః। తత్పుత్ర శ్రీమతాం శ్రేష్ఠః పురూరవమహామతిః॥ ౧౩॥ పురూరవాత్రిపుః పుత్రోహ్యాను జోహ్యాయురిత్యభూత్। త్రపుత్రావమఇతిఖ్యాతో వామాత్కుశ సముద్భవః॥ ౧౪॥ కుశాద్భానుసముత్పన్నో భానోసోమశ్చవై నృపః। సోమాచ్చిరాస్తు నామాభూచ్చిరసస్తు ధనంజయః॥ ౧౫॥ ధనంజయాత్తు మాంగల్యఃకా

మ రాజా తతఃపరమ్। కామాత్తుపంగునామా భూత్తత్సుతోరవి మండ
లః॥ ౧౬॥ తద్వంశోన్నృపతిర్జాతో వీర్యవాంశ్చసనాతనః। ధర్మిష్ఠోసీత్తి
దక్షశ్చ సర్వజితః పరాక్రమః॥ ౧౭॥ సర్వజితాన్న ధుజ్జాత స్తత్పుత్రో
మాఘభూపతిః। మాఘాత్తుశ్చందు భూపాల స్తత్సుతో దుష్ట దుర్మనాః॥
౧౮॥ దుష్టదుర్మనసోధర్మో ధర్మాత్కామ ఇతిశ్రుతః। కామాత్తుకౌశి
కోరాజా తత్పుత్రోరణమండనః॥ ౧౯॥ తద్వంశోసిమి భూపాల స్తత్పు
త్రోనాగలాలసః। తద్వంశోవజ్రనామా భూత్తత్పుత్ర స్త్రిందుమండనః॥
౨౦॥ తత్సుతః కామసాలో భూత్తద్వంశోసలిలః పరమ్। సలిలాదామ
ఘోజజ్ఞే తత్పుత్రః కాశీఈశ్వరః॥ ౨౧॥ తస్యభూషణభూపాలః కాంతి
రాజాతుతత్సుతః। కాంతిరాజు కులేనైవ జాతశ్చపృథుభూపతిః॥ ౨౨॥
తస్యవంశోన్నృపోజజ్ఞే కామపతిరితీరితః। అపుత్రః సోభవద్రాజా పుత్రా
ర్థంయత్నవానభూత్॥ ౨౩॥ ఋషీణాం సంమతింకృత్వా హ్యశ్వమేధం
చకారసః। పుత్రేష్టించతతఃకృత్వా సవస్త్ర దక్షిణాందదౌ॥ ౨౪॥ నా
రాయణః ప్రసన్నోభూద్వాక్యమే తదువాచహ। నారాయణః స్వము
ఖేన మంత్రాష్టాక్షరద్వైశికః॥ ౨౫॥ తేమంత్రా ఋషి సంయుక్తా మం
త్రబీజస్య దేవతాః। మహాఋషి సమస్తస్య మంత్రశ్చేతి సమాయుతమ్॥
౨౬॥ తేమంత్రాఋషివక్త్రేభ్యస్తాస్తా నృషీన్ప్రబ్రవీమి తేః పద్మాక్షశ్చసవ
త్సశ్చైవగౌతమః కౌండిన స్తథా। ౨౭॥ సౌనల్పశ్చంపకశ్చైవ వశిష్ఠఃకశ్య
ప స్తథా। విశ్వామిత్రో భృగుశ్చైవ భారద్వాజోత్రి రేవచ॥ ౨౮॥
హిరణ్యోహారితశ్చైవ దేవరాజ ఋషి స్తథా। మృకుండురంగిరాగర్గో
మాండవ్యః శౌనక స్తథా॥ ౨౯॥ భద్రఋషిః కృపాయుశ్చ శూలకః శీ
లచామరః। మార్తాండోహి ఋషి శ్రేష్టో విశ్వావసూ ఋషీశ్వరః। ౩౦॥
డాల్భశ్చపూతిమాషశ్చ జాంబేలగణకోఋషిః। వైరుక్షో వైతసశ్చైవ
జమదగ్నిశ్చ తాపసః। ౩౧॥ భావనః సౌమనశ్చైవ ఋషిర్నామాభి
దుందుభిః। దావిణోగోపకుమారౌ మైత్రేశ్చైవమండనః। ౩౨॥ బక
దాలబ్యరోమాణౌ కుమారోభావని స్తథా। మాలివంతఋషిశ్చైవహ్యా
గ్నిక్షో ఋషిసత్తమః। ౩౩॥ ముద్గలఃపారిజాతశ్చ ఋషిర్దామోదర స్త

థా। పాల్యనశ్చ ఋషిశ్రేష్ఠః పార్థవశ్చ మహాఋషిః। ౩౪॥ చారణాఖ్య
ఉగ్రఋషిర్వ్యాఖ్యం బష్టఋషిభావనః। సోమకాంతో భీమఋషిశ్చమకఃప్రా
తణిత్యపి। ౩౫॥ మునిప్రణీత మంత్రాస్తే తేషాం వై దేవతాః శృణు।
యోగీశ్వరీమహాలక్ష్మీ హ్యేకవీరాచకాళికా। ౩౬॥ కుమారీచైవ కా
మాక్షీహ్యంబికాచసరస్వతీ। ఉమావాగీశ్వరీచైవ లలితాహారిణాక్షికా।
౩౭॥ చండికారేణుకాచైవ మహాకాళీచతాళికా। ఇంద్రాణీవజ్రిణీచైవ
బ్రాహ్మీపద్మావతీతథా। ౩౮॥ నీలాంబాచైవ కోలాంబాహ్యంబానా
గేశ్వరీతథా। రక్తాక్షీబీజయాదేవీ మహాదేవీచతామసీ। ౩౯॥ సునం
దాపూతమాక్షీచ నీలాదేవీజలేశ్వరీ। మాతృకామాతృనందాచ మాలి
నీచైవహ్యూర్మిళా। ౪౦॥ అరుణాచారుణాక్షీచ కురులాపానమాలినీ చం
పావతీతథా దుర్గాత్రీశ్వరీ వీరహేశ్వరీ। ౪౧॥ శార్ఙ్గ్యాచపాటలాదేవీత్వ
రితామాలమాలినీ। ముంజామహేశ్వరీ చిత్రాకాత్యాకాపి చహ్యప్స
రా। ౪౨॥ దాడిమాభద్రికాదేవీ వైష్ణవీచ తథోగ్రిణీ। మోహినీచ
సువర్ణాక్షీ భైరవీభామినీతథా। ౪౩॥ జాతికాసౌమనీదేవీ దలినీదైత్య
నాశినీ। ప్రభావతీచ శిలాంజా బగిళాభామినీతథా। ౪౪॥ అపరాపార్వ
తీచైవశక్తితః సోమేశ్వరీతథా। మహామారీ తులాదేవీ బాలణాపన్నగే
శ్వరీ। ౪౫॥ త్రిపురాచైవ కామాక్షీ చిత్రజ్వాలావిశేశ్వరీ। సర్పాచ
బిజులీనామ్నా బాలాంధాహ్యను పూర్వశః। ౪౬॥

ఇతిశ్రీస్కాందపురాణే ఆదిరహస్యే సహ్యాద్రిఖండేవ్యాస సనత్కు
మారసంవాదే క్షుద్రిరోత్పత్తికథనం నామత్రింశత్తమోధ్యాయః॥ ౩౦

ఈప్రకారము చంద్రవంశమును గూర్చి విస్తారముగ నీస్కాంద
పురాణాంతర్గత సహ్యాద్రిఖండయందు ౩౦ అధ్యాయము మొదలుకొని
౩౪ అధ్యాయమువరకు గల గ్రంథసందర్భమున జెప్పబడియున్నది. ఇ
చ్చట నాయధ్యాయములన్నియు నెత్తివ్రాయుటకు గ్రంథవిస్తరభయ
మగునని దలచి జిత్రించుట విరమించుకొంటిమి, అయినను శేషించిన
అధ్యాయములను అవశిష్ట భాగమని కొంత మున్ముందు వ్రాయదలచి
యుండుట తటస్థపడవచ్చును గనుక నచ్చట జిత్రించుచున్నాము.

ఇటుపైన కూర్మవంశమునకు సూర్యవంశమని నామాంతరము గలదని కొన్ని దానశాసనములు గన్పట్టుచున్నవి. ఆదానశాసనముల నీ క్రింద వ్రాయుచున్నాము.

## ౪ నేపాలక్షితిపాల వంశావళిః.

శ్లో॥ నత్వాగిరీన్ద్రతనయాం ప్రలయానలాభాం। భాలోల్లసల్లలితచన్ద్రకళాభిరామామ్। మల్లప్రతాపన్నృపతిః స్వకులప్రకాశాం। వంశావలీం సుతనుతే విమలాంకపీన్ద్రః। ౧। శ్రీవిష్ణోర్న్నయ నామ్నజాత్రిజగతీ పాపాస్తకర్త్తారవిః। ప్రోద్భూత స్తిమిరౌఘ వారణఘటావిద్రావిణః కేసరీ। కాలాకాశదిశాం ప్రకాశనిపుణః కందర్పదర్పాపహః। సానన్దం సరసీరుహేషుతనుతేమైత్రీం విచిత్రాకృతిః। ౨। గాంభీర్యాది గుణేన సాగర సమోధైర్యేణ విన్ధ్యాచలః। సౌన్దర్యప్రకరేణ దైత్యదలనో రూపేణ కామోపమః। జాతోభూమితలేతతోత విమలే వైవస్వతాఖ్యోమను। ర్మర్యాదారచితా సతాంసముచితాకీర్త్తి ప్రదాయేనవై। ౩। తద్వంశో విమలేబభూవ ధరణీచంద్రో దిలీపోహ్యయో। దేవేనప్రమథాధిపేన తులనాం ప్రాప్తప్రచణ్డేరణే। యస్యప్రౌఢతర ప్రతాపదహనేనిత్యం ద్విషః శేరతే। దృష్ట్వాతస్యకలేవరంసు విమలం కామేన దగ్ధంవపుః। ౪। జాతఃసన్నృపసత్తమో రఘురితిఖ్యాత స్తతోవీర్యవా। న్బాణాగ్రైః పరిమధ్యశక్రహృదయంకీర్త్తిః స్థిరాస్థాపితా। యస్యప్రౌఢ తరప్రతాప తపనత్రాసేన సద్యఃకృతా। వృష్టిస్తేన ధనేశ్వరేణలలితా కాన్త్యస్వరీభూతలే। ౫। జాతోభూపవర స్తతః కలిహరః శ్రీమానజోవీర్యవా। న్దుష్టానాంకిల దర్పహారణవిధా ప్రోద్భూతకణ్ఠీరవః। శిష్టానాం ప్రతిపాలకః ప్రతిఫలందాస్యై ......మ్మనః। పశ్చాదిన్దుమతీ వియోగజనితక్లేశాబ్ధి మధ్యేపతత్। ౬। జాతో దేవతనుస్తతో దశరథః కందర్ప దర్పాపహః। సేనాపత్యముపేత్యపఙ్క్తి పతితః శత్రుః (క్రః) కృతోనిర్భరః। కూరఃకోపరతః ప్రసారితభయోభేత్తుంగతః కృత్తికాం। పాపీసంసక్తచిత్తః శనిరపిసహసాస్తమ్భితోయేనమార్గే। ౭। జాతస్తనయో మహానయముతో రామోభిరామా

In Brahmananda Purana Kalidarma Prakaranam, Chapters 3 to 20, we find the following:—The Kammavars were born to the decendants of the Solar King Dwilipa and as they had alliances with the lunar race they were known as Upayadis. The original man is said to be one Dharmapala, and their Guru, Dharmasilan. A member of the lunar race tried to carry away a daughter of Dharmapala, named Kannikamani, when the parents of the girl with a view to disgracing him had a black dog disguised as a girl, left it in the house, and migrated to Southern parts. At that stage, a river barred their way. They begged of the Rishi Jamadagni who was busy in a penance on the bank of the river. There were with him his wife Renukadevi, and also Parasurama. Renukadevi gave them her ear ornament (known as Kamma), directed them to attach veneration to it and further added that if they did so, the river would give way. This came to pass. Since then, they have been known as *Kammavaru*. From that time forward, they attach much veneration to the names of Jamadagni, Renukadevi, and Parasu Rama. On marriage occasions they first offer prayers to these, and then to their family Guru, Palabhaddira, These Kammavars are divided into two classes known as Godasatu (gosha) and Gempasatu (not gosha). It is said that in the reign of Krishna Deva Royalu there were 1,60,000 volunteer guards, most of whom were Kammavars, to protect the fortresses within his jurisdiction.

From the said Godasatu class, the Zamindars of Ilaiyarasanandal claim their descent, and their family name is Ravillavaru, which formed one of the houses, namely, Arvitivaru, Navukavaru, Nandiyalavaru, Pemmasanivaru, Velama or Velugotivaru, Poottaharivaru, Durugantivaru, Thulava Doralu and Ravillavaru, that helped Krishna Deva Royalu (who ruled from 1509 to 1538 A.D.), in maintaining the dignity and prestige of his State. Velugoti is the family name of the Rajah of Venkatagiri, and Pemmasani of that of the Kuruvikulam Zamindar.

Vol II Pages 170 The Aristocracy of Southern India.

ఈయభిప్రాయమునుగూర్చి మున్ముందు మార్కండేయోత్తర పురాణము ననుసరించి జెప్పబోవుచున్నాము. గనుక నచ్చటనీవిషయ మును విపులముగ విచారించి పాఠకులకు మీకెల్లరకు విశద పఱచు చున్నాము

ఆ ఈప్రకారము కమ్మవారిట్లు కూర్మకులావతంసకులైరో కాపులనువారును కూర్మకులావతంసకులై యున్నారు. వీరు తొలుత నుత్తర పంజాబుదేశమునకు రాజధానియగు కాంపిల్యనగర ప్రాంతదేశ మున నివసించి అందుండిచటికివచ్చిన వారగుటచే ఈకూర్మకులావతం సులకు కాంపులని మొదట నీదేశవాస్తవ్యులు జేరిడిరి తుదకాశబ్దమే కాలాంతరములయందు కాపులనిమారి ప్రస్తుతమట్లుగనే వ్యవహరింప బడుచున్నది. ఈయభిప్రాయమునే శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు గారును వచించియున్నారు.

వీరు తొలుత కంపిలానగర (కాంపిల్య) ప్రాంతములనుండి వ చ్చినవారగుటచేత మొదట వీరికి కాంపులని వ్యవహార నామ ము గలిగినది. ఆంధ్రులచరిత్ర 3 భాగము. ౧౧౫ పత్రము.

కాపువారనినచో రక్షించువారనియు, పంటబెట్టువారనియు, అర్థము. క్షత్రియునికి ప్రజారక్షణము ముఖ్యధర్మమగుటచే వీరునుకా ర్మకులావతంసులైన క్షత్రియులై యున్నారు.

ఇట్లు కూర్మశబ్దవాచకము కమ్మవారికి జెల్లునుగాని కాపులకె ట్లుజెల్లుననినచో బూర్వోక్తమైన పద్మనాయకచరిత్రలో నుదహరించి నపద్యమునుబట్టి కాపులకును కూర్మకులావతంసము అను నీశబ్దమును చెల్లుబడియగుచున్నది.

గీ. కాపులెల్ల వెలమకమ్మలైరి.

పద్మనాయకచరిత్ర మరియు ఆంధ్రులచరిత్ర.

ఇందులకనుకూల్యముగనే ఆంధ్రులచరిత్ర మధ్యమయుగమునం దు ౧౪౭ పత్రమున నీక్రిందవిధమున జెప్పబడియున్నది.

> ఆకాలమున నిప్పటి కృష్ణామండలములోని వేలూరు, కొల్లేరు కోటలేక అకువీడు, గణపవరం, ముఖ్యపట్టణములుగనుండి తె లుగు నాయకులచే (తెలగాలను కాపులచే) బరిపాలించుచు న్నటుల గనుపట్టుచున్నది. వేలూరునకు కోలని పురమనియు, సారసపురమనియు, కమలాకరపురమనియు, పేరులున్నట్టుగా తెలుగునాయకుల శాసనములంగనుపట్టుచున్నది. వీరు చాళు క్యులకాలమునను కాకతీయులకాలమున సామంత మండలేశ్వ రులుగనుండి కమ్మసేనానాయకులవలనే ప్రసిద్ధిగాంచి యుండిరి. గణపవరమునకు పద్మినీపురమను నామమున్నట్టు గణపవరము లోని సువర్ణేశ్వరస్వామివారి దేవాలయములోని యొక శాసన మువలన దెలియుచున్నది. ఇక్కడ నొక గొప్పకోటయుండెను. ఇయ్యది కొంతకాలము కోనసీమరాజులైన హైహయవారివశమునను మఱికొంతకాలము కొలనురాజులైన తెలగాలవశమునను ఉం డెను. ఈప్రాంతదేశమంతయు గొలను పురాధిపతులైన తెలు గునాయకులచేతనే పరిపాలింపబడుచుండెననుటకు లేశమాత్ర

మును సందియము లేదు. పైనిజెప్పిన కోటలన్నియు తెలుగు నాయకులచేతనే కట్టబడినవి. వీరికిని వేంగీరాజప్రతినిధులైన వెలనాటికమ్మవారికిని యుద్ధములనేకములు జరిగినవి. తుదకు తెలుగునాయకులు వెలనాటి ప్రభువులకులోబడిన సామంతమండలాధిపతులుగ యుండుచు వచ్చిరి. భీమనాయకుడు, కోటయ నాయకుడు, అను పేరులుగల తెలుగునాయకులనేకులు పండ్రెండవ శతాబ్దమునందు కృష్ణాగోదావరీనదులకు నడుమనుండు దేశమును బరిపాలించిరి. కాకతి గణపతిదేవుని రాజ్యారంభ కాలమున శ్రీమన్మహామాండలీక కేశవ దేవరాజు వాని పుత్రుడు సాగినాయకుడును, ఏలూరు (కొలనుపురము) రాజధానిగ నీ మండలమును బరిపాలనము సేయుచుండిరి. కేశవనాయకుడును వానికుమారుడును వెలనాటి ప్రభువుల యధికారము క్షీణించు కాలమున స్వతంత్రులగ బరిపాలనము జేసిరి. కేశవనాయకునిదానశాసనము లనేకములు కొలను (ఏలూరు) పురమున గానంబడుచున్నవి. క్రీ. శ. ౧౨౨౮ దవ సంవత్సరము నాటికి నీ మండలమంతయును కాకతీయ గణపతిదేవ చక్రవర్తిచే జయింపబడెను. తెలుగునాటి రెడ్లకు తెలగాలని పేరుగలిగినది. చాళుక్యులు తెలుగుదేశముపై దండెత్తివచ్చి జయించినపుడు వారితో వచ్చిన సేనలు సేనాధిపతులు మొదట కమ్మనాటిలో వసించుచుండి తరువాత నితరస్థలములకుబోవ బ్రజలు కొత్తవారికిని పాతవారికిని భేదము దెలియుటకై కమ్మనాటినాయకులను కమ్మవారనియు, అదివఱకే తెలుగు దేశముననున్న తెలుగు నాయకులను తెలగాలనియు వ్యవహరింప సాగిరి. నాటినుండియు కమ్మవారును తెలగాలును వేర్వేఱు తెగవారుగా నుండుటతటస్థమైనది. కాని క్రీస్తుశతాబ్దారంభమున నాంధ్ర సామ్రాజ్య విజృంభకాలమున వీరును వారు నొక్కరుగనేయుండిరి.

ఈకాపులను గూర్చి యీ యర్థములయందు తెలగాలనియు బలిజలనియు వ్యవహరించెదరు. ఇట్లని ఆంధ్రులచరిత్ర యీక్రింది విధమున జెప్పుచున్నది.

> ఉత్తమబలిజ శాఖలవారికే తెలగాలను నామము వ్యవహరింపబడు చుండుట చేతను (కాపులనే తెలగాలని జెప్పవలయును.)
> ఆంధ్రులచరిత్ర ౩ భాగము, ౧౦౩ పత్రము.

ఇందువలన పూర్వోక్తములైన బలవాన్ అను శబ్దమునుండి బలిజశబ్దము పుట్టినది బలవాన్ అను నీమొదలగు శబ్దములు క్షత్రియ వాచకములై యున్నవని పూర్వము జెప్పియున్నాము. కాపులు అను శబ్దముకూడ సంరక్షకత్వమును సూచించుటచే క్షత్రియ వాచకమై యున్నదని యింతకుపూర్వము దెలియపఱచియున్నాము. కాబట్టి కాపువారిని కూర్మకులావతంసకులగు క్షత్రియులనిజెప్పుటకు ఏయభ్యంతర ముండజాలదు.

ఇదియునుంగాక కాపులు నాయుడను శబ్దమును ఉపనామముగ ధరించుచున్నారు. ఈనాయుడను శబ్దమునే కొందరు కమ్మవారును కొందరు వెలమవారునుగూడ ఉపనామముగ ధరించుచున్నారు. ఇట్టి నాయుడనుశబ్దము సంస్కృతమునయుండు నాయకః అను నీశబ్దమునుండి బుట్టినది. నాయకఅనునప్పుడు అగ్రణీ, అగ్రేసరః, ప్రధానపురుషః, సరదారు, సైనికాధ్యక్షః, ఈమొదలగు శబ్దములయొక్క అర్థమును సూచించుచున్నది. ఈప్రపంచములోని వారెవ్వరైనను వారుధరించియుండు నామమునుబట్టి వారి జాతినిర్ణయమును వేఱుగజేయకనే దెలుసుకొనుట సహజసంభవమైయున్నది. ఇట్లుండినను నాయక అను నీయుపనామమును ధరించిన యీకాపులు కూర్మి అనవాంశిక బిజాతియందు బుట్టినవారగుటచేతను పూర్వోక్తహేతువులచేతను కూర్మకులావతంసకులగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారని జెప్పుచున్నాము.

ఈ ఇటుపై బూర్వోక్తమైన శ్రుతిప్రమాణములలోనుండు వర్మశబ్దవాచకులగు కూర్మకులావతంసకులలోని వెలమవారుగూడ క్షత్రియులై యున్నారని జెప్పుచున్నారము. ఇట్టి యభిప్రాయమునే మామిత్రులగు చిలుకూరి వీరభద్రరావుగారు జెప్పిన విషయ మిదివరలోనే వచించియున్నాము. ప్రస్తుతములో వెలమఅనుపదము వర్మశబ్దముయొక్క తద్భవమని ఎం. శేషగిరిశాస్త్రులవారు వ్రాసినట్లు మామిత్రులు గూడా జెప్పియున్నారు.

> వర్మశబ్దభవము వెలమయని చెన్నపురి రాజకీయ కలాశాలయందు సంస్కృతోపన్యాసకులుగానుండి కీర్తిశేషులగు ఎమ్. శేషగిరిశాస్త్రులవారు శబ్దశాస్త్రమను గ్రంథమందు వ్రాసియున్నారు. ఆంధ్రులచరిత్ర మధ్యయుగము ౧౭౨ పత్రము.

ఇందువలన వెలమవారును క్షత్రియులని జెప్పుట కేయభ్యంతరము లేదని వచించుటకు బూర్వోక్తప్రమాణములన్నియు జాలియున్నవి. అయినను విశేషించి దెలుసుకొనుట కిచ్ఛబొడమినచో పద్మనాయకుల చరిత్రయు, బొబ్బిలిరావువారిచరిత్రయు, కీర్తిశేషులగు మండాపార్వతీశకవులచే రచింపబడిన రాధాకృష్ణసంవాదము, మరియును వెల్గోటివారిచరిత్రయు ఈమొదలగు గ్రంథములను జూచి గ్రహించుకొనతగియున్నది. ఇంతియే గాకను యీవెలమవారు కూర్మకులావతంసులగు కుణబీతెగలో జేరినవారై యున్నారని బూర్వోక్తములైన యీక్రింది పద్యములు జెప్పుచున్నవి.

> గీ. కొంకణాదికసేతువు కుంభినులను
> నాంధ్రద్రవిడాదిదేశంబులందు వెలమ
> పేరు ప్రఖ్యాతినొంది విస్తారముగుచు
> గరము బహుముఖవర్ణసంగతులదనరి.

> గీ. కాపులెల్ల వెలమకమ్మలైరి.

ఇట్లు బహుభంగుల గన్పడుటచే యీవెలమవారును మహారాష్ట్రదేశమునజేరిన కొంకణప్రాంతమునుండి రాబడిన కుణభీతెగవారని

శైపద్యములవలన దెలియుటచేవీరును కూర్మకులావతంసకులైన సూర్య వంశజులగు క్షత్రియులై యున్నారనుటలో నేయొక్క సంశయము లేదని చెప్పుచున్నాము.

౧౦ ఇటుపై రెడ్డివారియొక్క విషయమునుగూడా గమనించి నచో కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులని దెలియ బడుచున్నది. అదియెట్లనినచో రాట్ శబ్దమునుండి రెడ్డియనుశబ్దము బుట్టినదనియు అందువలన క్షత్రియులై యున్నారని పూర్వోక్తప్రమాణ ములననుసరించి చెప్పుచున్నాము. ఈప్రకారమే ఆంధ్రచరిత్ర కారకులుగూడ జెప్పియున్నారు.

> రెడ్డిశబ్దము రాట్ శబ్దమునుండి యేర్పడినది గావున రెడ్డియన గా రాజని యర్థమగుచున్నది......ప్రాచీనకాలమున రాట్టుల ను నొకజాతిప్రజలు భరతఖండమున నివసించుచుండిరని వేదము లవలనను శాసనములవలనను మనకు స్పష్టముగా దెలియుచు న్నది. వీరిలో రట్టులు లేక రాటులు, అరట్టులు, లాటులు, వి రాటులు, మరాటులు, వరాటులు, కిరాటులు, బల్లాటులు, అం ధ్రరాటులు, ఖగరాటులు మొదలగు శాఖాభేదములుగలవు. వీ రిలో కొందఱకు భోజులనియు నామాంతరముగలదు. ఈభోజు లలో ననేకులిప్పుడు కమ్మశాఖవారిలోనున్నారు ఈరాట్ట శా ఖలవారు తొలుత సింధునదీప్రాంతభూములందును పిమ్మటగం గానదీతీరప్రాంత భూములందును, అటుపిమ్మట నర్మదాగాత మీతీరప్రాంత భూములందును నివసించుచు క్రమముగా దక్షి ణహిందూదేశమునకు వ్యాపించిరి. వీరెల్లరు వేర్వేఱు దేశము లకుబోయి దేశభేదముచేతను, భాషాభేదముచేతను, వేర్వేఱు నామములతో నేటికాలమున వ్యవహరింపబడుచున్నారు...... పూర్వకాలమున బౌద్ధమతమునజేరిన బలిజశాఖలవారిలో నశే కులకు శ్రేష్ఠియనుపదము ఘట్టపుపేరుగ నుండెను. పూర్వకాల మున నీయుదు తెగలలోని యుత్తమనాయకులకు ననోన్యసంబం

ధ బాంధవ్యములు భోజన ప్రతిభోజనములు గలవు. పశ్చిమ హిందూస్థానమునందు రాట్టులు నివసించు దేశమునకు రాటవాడియని వ్యవహారనామముగలదు. రాట్టవాడి రాజవంశమునకే రాఠోడ్ లేక రాఠోర్ రాజవంశమని ప్రఖ్యాతిగలిగినది. అటుపిమ్మట ఈరాట్టవాడి రాజకుటుంబమే యొకటి రాష్ట్రకూట రాజవంశముగా బరిగణింపబడినది. ఈరాట్టవాడి లేక రాఠోడ్ సీమనుండి యాంధ్రదేశమున కేతెంచి నివసించియున్న రెడ్లనే పూర్వపుదెలుగు శాసనములో రడ్డోడికాంపులని యప్పటి శాసనవిలేఖకులు వ్రాసియుండిరి. ఏదియెట్లున్నను రెడ్లని వ్యవహరింపబడెడి తెగలవారు రాట్టజాతులకు సంబంధించినవారనుట కెంతమాత్రమును సందియములేదు. వీరెల్ల రాంధ్రజాతులతోడి సంబంధబాంధవ్యములచేతను ఆంధ్రభాషను మాతృభాషగా గైకొన్నవారగుటచేతను, ఆంధ్రజాతీయులనుటకు సందియము లేదు. వడ్లలోనెన్నివిధములైన భేదములుగలవో రెడ్లలో నన్నివిధములైన భేదములుగలవు. గావున వానింగూర్చి చెప్పుట సాధ్యముగాదని చెప్పుదురు. కాబట్టి యట్టిభేదములను గూర్చిన చరిత్రము ప్రత్యేకముగ వ్రాయవలయునే గాని యిందువ్రాయుట సాధ్యముగాదు. పంట పదునాలుగు కులాలని సామాన్యముగా పదునాలుగు శాఖలుగలవని చెప్పుదురు. అయిన నెయ్యాలి పదునాలుగు ప్రధానశాఖలో వివరించుట కష్టసాధ్యము. ౧ అయోధ్యరెడ్లు, ౨ మోటాటిరెడ్లు, 3 పంటరెడ్లు, ౪ దేశూరురెడ్లు, ౫ పాకనాటిరెడ్లు, ౬ పెదకంటిరెడ్లు, ౭ భూమంచిరెడ్లు, ౮ ఒరుగంటిరెడ్లు, ౯ బలిజరెడ్లు, ౧౦ గండికోటరెడ్లు, ౧౧ గోటేటిరెడ్లు, ౧౨ కుంచేటిరెడ్లు, ౧3 మొరసరెడ్లు, ౧౪ పల్లేరెడ్లు, ౧౫ గాజులరెడ్లు, ౧౬ పాకనాటిరెడ్లు, ౧౭ పాంగనాటిరెడ్లు, ౧౮ కమ్మపురిరెడ్లు, ౧౯ వెలనాటిరెడ్లు, (౨౦ ఆకుతోటరెడ్లు) మొదలగు వ్యవహారనామములనేకములు గన్పట్టుచున్నవి. వీరెల్లరకు మాత్రమే

భాష యాంధ్రమైనను దేశకాలపాత్రభేదముల చేత గొన్నియా చారభేదములు గన్పట్టుచున్నవి. అయ్యవి క్రమముగా నశించు సూచనలు గానంబడుచున్నవి.

ఆంధ్రులచరిత్ర మూడవభాగము ౧౧౩ పు. ౧౧౬ వ.

ఇదియును గాకను రాష్ట్రకూటమను శబ్దమునుండి రాఠోడు శబ్దము పుట్టినట్లు వంశభాస్కరమను గ్రంథము జెప్పుచున్నది. ఈయభిప్రాయమునే హిందూదేశచరిత్రముయందు గన్పడుచున్నది. మరియును బూర్వోక్తమైన వంశభాస్కరమను గ్రంథమునందు అయోధ్యాధిపతియగు సుమిత్రుడను రాజునకు విశ్వరాజు కూర్మఅని యిరువురు పుత్రులు గలిగియుండిరనియు అందులోని కూర్మునివలన కూర్మవంశమనగా కుణబీ వంశము ప్రసిద్ధమగుటకు కారణమయ్యెననియు సుమిత్రుని పుత్రులలో మొదటివాడగు విశ్వరాజునకు సంతానము లేక బోవుటచే రాష్ట్రేశ్వరపర్వతమున నాఈశ్వరునిగూర్చి తపంబొనర్చి నద్దేవుని వరంబున రాష్ట్రకూటుడను పుత్రునిబడసెననియు, ఇతనివలన రాఠోడువంశముజనించెననియు ఇందువలన రాఠోడువంశస్థులును కూర్మవంశస్థులును సహోదరబిడ్డలని జనవందతికూడా బలపరచుచున్నదని చెప్పియున్నది. అచ్చటయుండిన జనవదంతియు నీదేశమునయుందు రెడ్డివారు కమ్మవారివిషయమందును జెప్పుచున్నారు. ఇదియుగ్గాండనిందు నావంశభాస్కరమనుగ్రంథమునకు టీకవ్రాసిన కృష్ణసింహఅనువారు జోధుపూరు రాజ్యమున రాష్ట్రశ్యేనాకులదేవి అను సీదేవీనామముతో రాష్ట్రకూటవంశముఅనగా రాఠోడువంశము ప్రసిద్ధికి వచ్చినదని వంశభాస్కరగ్రంథములో నీవిషయమునుగూర్చి జెప్పియున్నారు. ఇందువలన మనము గుర్తించతగిన దేమన్నను యీరెడ్డివారును కమ్మవారును కూర్మకులావతంసకులనియే మనము గుర్తెరుగతగియున్నది. ఇదియునుంగాక రాష్ట్రకూటవంశోద్భవుడగు చతుర్థగోవిందుడను రాజుయొక్క ౮౫౨ సంవత్సర దానపత్రమొకటి గన్పట్టుచున్నది. అందులో రాష్ట్రకూటుల ప్రసిద్ధిని వర్ణించియున్నది. హిందూదేశచరిత్రయందును ౮ శతాబ్దకాలమునం

డీ రాష్ట్రికూటులు ప్రసిద్ధి చెందియున్నారని చెప్పబడియున్నది. మరియును దక్షిణభారతవర్షమునందును రాష్ట్రికూటుల రాజ్యములు స్థాపించి ౨౦౦ సంవత్సరములవరకు పరిపాలనము జేసిరని జెప్పబడియున్నది. దీనినే కొండవీడు మొదలగు సంస్థానములని చెప్పుచున్నాము. మరియును క్రీ. శ. ౭౫౨ సం॥ న॥ రాష్ట్రికూటవంశోద్భవుడగు కీర్తివర్మయును చాళుక్యులకును యుద్ధములు జరిగినట్లు దెలియబడుచున్నది. ఈరాష్ట్రికూటవంశోద్భవుడగు మూడవ గోవిందవర్మ గుజరాత్ దేశమున కొంత భాగమును జయించి అతనివలన నవీనరాష్ట్రికూట రాజ్యస్థాపన మొనర్చబడెను. క్రీస్తుశకము ౧౨ శతాబ్దమునందు రాష్ట్రికూటులు కనోజి పట్టణమునకు ప్రభువులైరి. మరియును రాష్ట్రికూట వంశోద్భవులగు రాజులు ప్రస్తుతపు హైదరాబాదు దేశమునయుండు మాలిఖేడు అను రాజ్యమును ౧౩ దు పురుషాంతములవరకు ప్రభుత్వమొనర్చినవారైరి. ఇందులోను కడపటిరాష్ట్రికూట ప్రభువు కొక్కలచాళుక్యవంశస్థుడగు తైలపదేవునివలన మరణమొందెను.

రాష్ట్రికూటులు అనగా రెడ్డివారు వీరు ప్రభుత్వమొనర్చినటుల చరిత్రలన్నియు ఘోషించి జెప్పుచున్నవి.

రాష్ట్రికూటశబ్దమునకు బూర్వము చెప్పిన హేతువులకన్నను విద్యారణ్యులవారు అధర్వణవేదభాష్యములో జెప్పినప్రకారము మనమాశబ్దమున కన్వయముజేసుకొనినచో బాగాయుండునని దలచి యీక్రిందనాభాష్యమును వ్రాయుచున్నాము.

శ్రు॥ అచ్ఛానఇన్ద్రం యశసం యశోభిర్యశస్వినంవిధేమ! సనోరాస్వ రాష్ట్రమిన్ద్రజాతం తస్యతేరాతౌ యశసఃస్యామ॥

అధర్వణవేదము ౬ కా. ౫ అను. ౮౦ సూ. ౨ మం.

ఇందులకు విద్యారణ్యభాష్యము.

విద్యా. నః॥ ఆస్మాకమ్...... హే ఇన్ద్రసత్వంత్వం నః అస్మభ్యమ్ ఇన్ద్రజాతమ్ ఇన్ద్రేణత్వయా ప్రేరితం రాష్ట్రమ్। రాజ్యం

రాస్వదేహిరాస్పృదానే। తస్యతేతవరాత్రౌ ధానేయశసః యశస్వీ నోవయంస్వామభవేమ॥

ఇందులోను రాష్ట్రమనునప్పుడు రాజ్యమని చెప్పియుండుటచే ఇట్టిరాజ్యముల ధరించినవారి సంతతివారు గనుక రాష్ట్రకూటులని చెప్పవచ్చును. రాజ్యములు ధరించువారు క్షత్రియులుగనుక నిట్టిరాష్ట్రకూటులందరు కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులని చెప్పుచున్నాము. ఇందులవిషయము చరిత్రభాగములనుండి విశేషముగ్రహించుటకు సావకాశము గలిగియుండుటచే గ్రంథవిస్తరభయమువలన నావిషయములన్నియు నిచట చర్చించక వదిలిపెట్టితిమి.

ఇచ్చటను గొందఱుచెప్పునదేమన్నను ఇక్ష్వాకువంశజులగు సుమిత్రునితో సూర్యవంశమంతము నొందినదని భాగవతము నవమస్కంధములోని యీక్రిందిశ్లోకమును ప్రమాణముగ జెప్పుచున్నారు.

శ్లో॥ ఇక్ష్వాకూణామయం వంశస్సు మిత్రాంతోభవిష్యతి॥
శ్రీమద్భాగవతము నవమస్కంధము.

అనగా నీసూర్యవంశము సుమిత్రుడే అంతముగ గలిగనశించును. అనియిట్లు జెప్పినవిషయమునకు యీక్రిందివిధమున ప్రత్యుత్తర మిచ్చుచున్నాము.

సుమిత్రవంశేరాష్ట్రోరు కూర్మవంశోత్పత్తి తృతీయరాశి సప్తపంచాశన్మయూఖ॥

అనునీప్రకారము వంశభాస్కరమను గ్రంథము యొక్క గద్యయందు సుమిత్రవంశమగు రాష్ట్రోరు(రెడ్ల) వంశమైన కూర్మకులావతంసముయొక్క యుత్పత్తియందు మూడవరాశి ౫౭ మయూఖముసమాప్తము అని యిట్లు గ్రంథాంతమందు గన్పట్టుటచే నీవంశభాస్కరమను గ్రంథము బూర్వోక్తమగు భాగవతశ్లోకమును ఖండించుకొని సుమిత్రునికి సంతానములేక యుండలేదనియు, నతనికి విశ్వతరుడను వానొక

ను, కూర్మ్మడనువాడొకడును, ఇట్లు యిద్దరు పుత్రులుండిరనియు, ఇం దులో మొదటివాడగు విశ్వవరుడనువానికి సంతానము లేకపోవుటచే రాష్ట్రికూటపర్వతమునందు రాష్ట్రేశ్వరునిగూర్చి తపంబొనర్చి నద్దేవు నికృపవలన రాష్ట్రికూటుడను బుత్రుని బడసెననియు, అతనివలన రా ఠోరువంశము జనించెననియు ఇట్లు వంశభాస్కరమను గ్రంథమున జె ప్పియుండుట చేతను, మరియు కూర్మ్మడనువానివలన కూర్మకులావతంశ ముజనించెనని నాగ్రంథమునందే జెప్పియుండుటచేతను ఇట్లుబూర్వో క్తమైన భాగవతశ్లోకమునకు బ్రత్యుత్తరము జెప్పుటకైయొనది. ఆవంశ భా స్కరగ్రంథము విస్తరించియుండుటచే నందుల పూర్వపక్ష సిద్ధాంతము ల నిందునవ్రాయనైతిమి.

మఱియు నిందులకు శూద్రకమలాకరముకూడా యిట్లుప్రత్యుత్త రము జెప్పుచున్నది.

శ్లో॥ దేవాపిర్యోగమాస్థాయ కలాపగ్రామ మాశ్రితః।
సోమవంశంకలౌనష్టం కృతాదౌస్థాపయిష్యతి॥

అనగా దేవాపియనువాడు శంతనునితమ్ముడు మాత్రము కలాప గ్రామమునందు గూఢమై తిరిగి కృతయుగమునందు క్షత్రియులలోనిచం ద్రవంశమును వృద్ధినొందించును.

శ్లో॥ దేవాపిశంతనోర్భ్రాతా మరుశ్చేక్ష్వాకు వంశజః। కలాపగ్రా మఆసాతే మహాయోగబలాన్వితౌ॥ తావిహైత్యకలేరంతే వా సుదేవాను శిక్షితౌ । వర్ణాశ్రమ యుతం ధర్మం పూర్వవత్ప్రధ యిష్యతః॥

శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధః.

అనగా మఱియును శంతనుని తమ్ముడు దేవాపియు, నిక్ష్వాకు వంశస్థుడు మరుడనువాడును యోగబలముచే జీవించి కలాపగ్రామమం దుండి కలియుగాంతమునందు భగవంతునిచే బోధితులై తిరుగ వర్ణా శ్రమధర్మములు నడిపింతురు.

శ్లో॥ దేవాపిః పౌరవోరాజా మరుశ్చేక్ష్వాకువంశజః కృతే ఇహాగత్యక్షత్ర ప్రావర్తకౌహితౌ। తథా। మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్రవినాశకృత్। అరభ్యభవతో జన్మయావన్నందాభిషేచనమ్। ఏతద్వర్ష సహస్రంతుజ్ఞేయం పంచదశోత్తరమ్॥

విష్ణుపురాణము.

అవగా పూరువంశోత్పన్నుడగు దేవాపియు నిక్ష్వాకువంశము నందుబుట్టిన మరుడను రాజును కృతయుగమునందు దిరుగవచ్చి క్షత్రియజాతిని బ్రవర్తింపజేయుదురు. మఱియును పద్మపతియగు నందుడనువాడు క్షత్రియవంశనాశకుడొకడు బుట్టును. ఇతడు పరిక్షితునకు వెనుకకలియుగాదియందుండెడు రాజు. (ఈయభిప్రాయము పరిక్షితునితో నీక్రిందివిధమున జెప్పుటచే దెలియుచున్నది.) ఓపరిక్షితుడా నీజన్మ మొదలుకొని నందుని పట్టాభిషేక పర్యంతమగు కాలము వేయునూటపదునైదు వత్సరములుండునని పరిక్షితునితో జెప్పుచున్నాడు.

ఇంతకుబూర్వము సుమిత్రునితో ఇక్ష్వాకు వంశమగు క్షత్రియవంశము బోయినను బాధకమైయుడంలేదు గాని ఈకలియుగమున క్షత్రియ వైశ్య వంశములు బొత్తుగ నశించుననియు, ఆద్యంతవర్ణములగు బ్రాహ్మణ శూద్రవర్ణములు మాత్రమేయుండుననియు, ఈక్రిందిపురాణవాక్యమునకు మీారేమి ప్రత్యుత్తరమిచ్చెదరు.

శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శూద్రవర్ణాస్త్రయో ద్విజాః॥ యుగేయుగేస్థితాస్సర్వే కలావాద్యంతయోస్థితాః॥

పురాణాంతరము.

ఇందులకు బ్రత్యుత్తరమీక్రింద వ్రాయుచున్నాము.

శ్లో॥ కతుకుబీజభూతాస్తు కేచి త్తిష్ఠంతిభూతలే। యథైవదేవాపి పురుసాం ప్రతంసమవస్థితౌ॥

విష్ణుపురాణము.

అనగా బూర్వముజెప్పిన దేవాపిపురువులిద్దరువలె కొందరు బీజభూతులై ప్రచ్ఛన్న రూపమును బొందిన క్షత్రియులు గొందరు గలరు. మఱియును,

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశః శూద్రా బీజార్థేయ ఇహస్థితాః । కృతేయుగే
హితైస్సార్థం విశేషాస్తదాభవన్॥

మత్స్యపురాణము.

అనగా బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులుముందు వీత్తనము కొఱకు గలియుగమునందుయుందురు తిరుగ కృతయుగమున వారితోసమానులగువారు బుట్టుదురు. అను నీప్రకారము జెప్పియుండుటచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను చాతుర్వర్ణములవారు యధాప్రకారమన్ని యుగములలోనుండినట్లు ఈయుగమునందునహాయుందురనియు, ఈ మత్స్యపురాణ వాక్యము జెప్పుచున్నది. ఒకవేళ ఈకలియుగమున నష్టముబొందినచో నాలుగువర్ణముల వారలలోను నష్టముగలిగి తుదకు బీజభూతులై కొందరుందరని దెలియుచున్నది. ఇందువలన మీపూర్వపక్షము సరియైనది గాకపోవుటచే స్వాతిశయమును వెల్లడించక యుందురని హెచ్చరిక జేయుచున్నాము.

౧౧ ఇందువలన బూర్వోక్తప్రమాణముల నన్నిటి ననుసరించి కమ్మవారును, కాపువారును, వెలమవారును, రెడ్డివారును, కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారని జెప్పుచున్నారము.

కూర్మకులావతంసులైన సూర్యవంశజులగు యీక్షత్రియులలో బూర్వకాలమున ప్రభుత్వముచేసినవారును, ఇపుడనేకమందిప్రభువులునుగన్పడుచున్నారు. ఇందులోనుబూర్వకాలప్రభువులనుయీకాలప్రభువులను గనుగొనుటకు శాస్త్రములయందును చరిత్రములయందును జెప్పబడియున్నది. ఆర్యులు నాలుగు వర్ణములుగనువిభజించుకొని భరతవర్షమున నివసించిరని బూర్వోక్త ప్రమాణములవలన మనముగుర్తెఱిగి

యున్నాము. ఇందులోనుండు ప్రజలలో బహుజన సంఖ్యాకులు క్షత్రి
యులైయున్నారు. ఈక్షత్రియులలోనే నూతన రాజ్యసంపాదనలు జేసి
నను వీరిలో వీరికి దటస్థపడినవి కాని ఎన్నడును అన్యదేశీయ సంపాదన
లు వీరు జేసియుండలేదు. అట్లు చేయుటకు వీరికి వీలు చిక్కియుండలే
దు. ఎట్లు క్రిందుమీదుబడినను యీకూర్మకులావతంసులగు సూర్యవం
శజులైన క్షత్రియులయందే కలిగినదిగాని అన్యత్ర కలిగి యుండలేదని
మాత్రము వాకొనుచున్నాము. ఇదియిట్లుండ కొంతకాలమునకు అన్య
దేశీయులు వీరిరాజ్యమునకు రాదొడగిరి. అప్పటిలో వారు ముఖ్యరా
జులగను వీరు సామంతరాజులగను యీభరతఖండమును పరిపాలించ
జొచ్చిరి. అపరరాజులు తత్పూర్వీకులైన రాజచరిత్రగ్రంథములనుసాం
ఘికగ్రంథములను, శాస్త్రగ్రంథములను, ఇట్లనేకవిధముల నుపయో
గించు గ్రంథములనన్నిటిని ధ్వంసములుజేసి బొత్తిగనశింపుజేసిరి. ఈ
సామంతరాజులగు కూర్మకులావతంసకులు అట్టి గ్రంథములను బూర్తి
జేయుటకును చేయించుటకును సమర్థులైయుండినను అట్టివిషయములో
గ్రంథసామగ్రి చక్కగ లేకబోవుటచే పూర్తిచేయలేక పోయిరి. పర
రాజులు పరిహాసాస్పదముపకై నిలిపిన పురాణగ్రంథములలోను పూర్వ
రాజుల నామానుక్రమణికయైనను, చరిత్రయైనను, ఒకదాని ననుసరిం
చి మఱియొకటియుండక భిన్న భిన్నములగ దెలియబడుచు చున్నవి.
ఇట్లుండినను ప్రధానులగు కూర్మకులావతంసకులైన సూర్యవంశజులగు
క్షత్రియులయొక్క చరిత్రములను నిర్ణయముచేయుటకు సంస్కృత గ్రం
థములనేకములున్నవి. ఇందులో వాయుపురాణము, విష్ణుపురాణము,
వాల్మీకరామాయణము, భారతము. భాగవతము, రఘువంశము, ఇవి
కొంతమార్గమును జూపించుచు స్కాంధపురాణ సహ్యాద్రి ఖండమును
కొద్దిగ అనుసరించుచున్నవి.

ఈస్వల్పసహాయముచే యీరాజుల యొక్క సంపూర్ణమైన నా
మాదిసంగ్రహణము చేయుటకుగాని ప్రకాశపఱచుటకు గాని సాహసిం
చి ప్రయత్నించుటకు వీలుకలుగజేసుకొనక ప్రస్తుతమనుసరామః పాయ
సంభక్షయామః అను నీయాహోక్తిననుసరించి సాధ్యమైనంతవరకసమ

ముసుబట్టి పూర్వ రాజులందఱును కూర్మకులావతంసులగు సూర్యవంశో ద్భులైన క్షత్రియులని వెల్లడిపఱచినారము.

౧౨ ఇంతియే గాకను ప్రస్తుతపు రాజులందఱును అనగా జయ పూరు, జోధుపూరు, ఉదయపూరు, రాజులందరును కూర్మకులావతం సులగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారని బూర్వోక్త ప్రమా ణములచే నిర్ణయముజేసియున్నాము. ఇదియునుంగాకను మహారాష్ట్ర సామ్రాజ్యాధిపతులగు కూర్మకులావతంసకులైన చత్రపతి శివాజీమహా రాజును కూర్మకులావతంసమైన సూర్యవంశజుడగు క్షత్రియుడై యున్నా డని ప్రసిద్ధమైన చరిత్రనువ్రాసినటువంటి మిస్టరు హంటరుస్టాటిస్టికల్ అకౌంటు ఆఫ్ బెంగాల్ ౧౧ వాల్యుమునందు వ్రాయబడిన విషయ మేమన్నను శివాజీమహారాజు కూర్మకులావతంసమగు (కుణబీ) సూ ర్యవంశమున జన్మించినవాడై యున్నాడు. మరియును గ్వాలియరు స తారారాజులును కూర్మకులావతంసమగు (కుణబీ) ఈసూర్యవంశమునం దుపుట్టియున్నారని యీయభిప్రాయమునకు సరియగునట్టి యీఇంగ్లీ షుభాషయందు వ్రాసియున్నారు.

> "Sivaji was a Kurmi and the Rajas of Gwalior and Satara are said to be of the same race."
> —*Hunter's Statistical Account of Bengal, Vol. XI.

ఇదియునుంగాకను మిస్టరు శార్నెజీ రైసెను ట్రిబెసు అండు కాస్టసు ఆఫ్ ఔదు అను నీపుస్తకమున వ్రాయబడిన విషయమేమన్న ను మహారాజా సింధియాగ్వాలియరును, భూతపూర్వరాజుయును, స తారారాజులును, భోసలావంశస్థులగు రాజులును, నాగపూరురాజులు ను, వీరందరు కూర్మకులావతంసమగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారు. మఱియుమిస్టరు కాంబేలు యింమునగూర్చి చెప్పినదేమ న్నను మహారాష్ట్రసంస్థానమును స్థాపించినది ముఖ్యముగ కూర్మకులా వతంసకులైన సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారు. మరియును శివాజియును అతని సరదారులును సాధారణముగ నందరును బూర్వో

క్షత్రవంశమునకు చెందియున్నారు. ఇదియునుంగాక అతరౌలియా నివాసులగు దర్శనసింహాగాలిబుజంగుగదరకు రాజైన ఇతనిపుత్రుడును వీరందఱును బూర్వక్షత్రమైన వంశమునకు జెందియున్నారని బైయభిప్రాయమును వచ్చునట్లు మిస్టరు కార్నెజీగారుజెప్పిన ఇంగ్లీషు వాక్యముల నీక్రిందను వ్రాయుచున్నాము.

> "Sindhia of Gwalior, the Ex-Raja of Satara and the Ex-Bhonsla of Nagpur were Kurmis or of the classas akin to them. Mr. Campbell has pointed out that the Kurmi element was the foundation of the Mahratta power, and that Sivaji and many of his chiefs were Kurmis. There are also Kurmi Rajas in Corakhpur and Gujrat. Darshan Singh of Atraulia of this caste earned the title of Ghalibjang for his brave services to the Kings of Oudh, and his son Jailal acquired the title of Raja during rebellion"
>
> —Carnegy's Races, Tribes and Castes of Oudh,

ఇట్టిప్రమాణములు పెక్కులు గన్పట్టుచున్నవి. వాటిని గ్రంథవిస్తరభీతిచే వ్రాయనైతిమి.

63 ఈవిషయములో బూర్వక్షత్రములగు గ్రంథములను బొంబై, బెలగాం, అయోధ్యాగజట్టులయందు జెప్పిన విషయములు గాకను ఈక్రిందనుదహరించు ప్రభువులందరు నీవంశజులైనట్లు వారివారి చరిత్రలనుబట్టి దెలియుచున్నది. శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా రావు శ్రీకంఠ బహదూరు బల్లా హైదరాబాదు, శ్రీమాన్ కూర్మకులావతంసరాజా సోమేశ్వరరావు మహాబల్వంత బహదూరు దోమకొండ సంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా ఉమాపతిరావు మహాబల్వంత బహదూరు నామపల్లి స్టేషన్ హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజరాజేశ్వరరావు మహాయశ్వం

త బహదూరు నామపల్లిస్టేషన్ హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) పవాయిరాజా రామేశ్వరరావు బహరీ బల్వంత మహాభూపాల్ బహదూరు వనపర్తిసంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా సీతారామసింహభూపాల బహదూరు అమరచింతా సంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజారామభూపాల్ బహదూరు గద్వాల్ సంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా రఘునాధరావు మహారణధీరబహదూరు...... సంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా బహదూరు భద్రాచల సంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా బహదూరు కుండారాడ్డి చించోడు సంస్థానం హైదరాబాదు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా సూర్యప్రతాపతేజోరావ రసింహదేశాహిపాటణీ, కాటియావాడ, శ్రీమాన్ (కూర్మకులావతంస) మహారాజా ఉదితనాథ సహాయ దేవసూన భూముచోటా నాగపూరు, బెంగాల్, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా నీలమణిసింహ దేవమానభూప బెంగాల్, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా తేజః ప్రతాపసింహ అజనుగడ, మరియును, కొల్లాపురము, అక్కలకోట, సతార, నాగపూరు, తంజాపూరు, ముధోల, ధార, దేవాస, బరోడ, సావంతవాడి, గ్వాలియరు, ఇందూరు, ఉదయపూరు, జయపూరు, జాట్పూగు, మేవారు, తోరగల, కాగల, కాశీ, కాపశీ, ధారవాడ, నేపాలక్షితిపాల, బొబ్బిలి, విజయనగరం, పిఠాపురము, నూజవీడు, కిల్లంపూడి, వెంకటగిరి, శ్రీకాళహస్తి, చిత్రాడ, మైలవరం, మునగాల, దేవరకోట, చింతలపాడు, అమరావతి, బోడినాయకనూరు, వల్లూరు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా అనుమూరి సుబ్బానాయుడు బహదూరు బంకిపల్లి జమీందారుగారు, శ్రీమాన్ (కూర్మకులావతంస) రాజా రావిళ్ళ వెంకటరంగయ్యప్పాస్వామి నాయుడు) బహదూరు ఎలాకసముద్రం తిరునల్వేలి, శ్రీమాన్ (కూర్మకులావతంస, రాజా పెమ్మసాని నందస్వామిదొర, కొండస్వామినాయుడుగారు కు

డువికులం తిరునల్వేలి జిల్లా, ఇట్టివారెందరో ప్రస్తుతమునను కూర్మకు లావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులు భూపాలన మొనర్చుచు పంచమజార్జి సార్వభౌమునికి సామంతరాజులై యున్నారను సంగతి దె లియబఱచుటకు సంతసించుచున్నాము.

౧౪ ఇదియునుంగాక మహారాష్ట్ర దేశమునందుండు కూర్మకు లావతంసకులనబడు కుణ్బీలనువారును, ఉత్తరహిందూస్థానమునందుం డు కూర్మకులావతంసకు లనబడు కుణ్బీలనువారును, ఈయుభయులు సూర్యవంశము, చంద్రవంశము, నాగవంశము, యదువంశము, అను నీనాలుగువంశములలో జేరి ౨౯౨ భేదములుగలవారైనను ఒకరికొకర సంబంధ బాంధవ్యములు జేసుకొనుచు వేదోక్తవిధులచే శుభాశుభకర్మల నుజరుపుకొనుచు యజ్ఞోపవీత ధారణములొనర్చుకొని మఱియు నెన్ని యో విధముల బ్రవర్తించుచున్నారని ౧౮౮౫ సంవత్సరములో ముద్రితమైన బొంబై ప్రసిడంసి పునాగజట్ ౧౮ వాల్యము ౧వ భా గమునందును మఱియు కిట్సకం పెండియంఆఫ్ హిందూకాస్ట్స్, ఆట్రయి బస్ అను నీమొదలుగాగల గ్రంథములయందును మఱియు బొంబైగ జటయందు ప్రొఫిసరు రామకృష్ణగోపాలభండారకరు అభిప్రాయము న నుసరించి వ్రాసినదానియందును, బొంబై ప్రసిడంసి కొల్హాపూరుగజటు ౨౪ వాల్యమునందును, మఱియు నిదియేగజటుయందును ఇదియునుం గాక హ్యూ ఆరుమరాబాంస్ అను గ్రంథమునందును జెప్పబడిన బైవిష యములకు సరియగు ఇంగ్లీషును పైగ్రంధములనుండి యీక్రిందవ్రా యు చున్నాము.

> "Kunbis...They have two hundred and ninety-two surnames. Of the whole number one hundred and two trace their origin to the moon; seventy-eight trace their origin to the sun; and eighty-one to the god Brahma. The ninety-nine remaining surnames are said to belong to miscellaneous rtibes." "The Poona Kunbis, not content with calling them selves

Marathas, go so far as to call themselves Kshatriyas and wear the sacred thread. They include a traditional total of ninety-six clans which are said to be sprung from tha rulers of fifty-six countries who are the descendants of Vikram of Ujain whose traditional date is B. C. 56, Shalivahan of Paithan whose traditional date is A. D. 78, and Bhojraja of Malva whose traditional date is about the end of the tenth century. According to the traditional accounts, the Bhosles to whom Shivaji belonged are the descendants of Bhojraja; tne descendants of Vikram are called Sukarrajas; and those of Shalivahan Rajakumars. All claim to belong to one of the branches or *vanshas* of the Kshatriyas, Som-vansha or the moon branch. Surya-vansha or the Sun branch, Sesh-vansha or the Snake branch and Yadu-vansha."

———Bombay Gazetteer, Vols. XXI & XVIII.

"One derivation which has the approval of Prof. Bhandarkar, remains that Maharashtra is the Sanskritised form of Maharatha, that is, the country of the Maharattis or Maharatthas, that is, the Great Katthis, atribe which under the name Ratta or Ratthis and its Sanskrit form Rashtrakas or Rashtrikas, from very early times have at intervals ruled in the Bombay Deccan, and Bombay Karnatak."

The Bombav Gazetteer by Sir J. Campbell,
K. C. I. E.

"As a class Marathas are simple, frank, independent and liberal, courteous, and, when kindly treated trusting. They are a manly and intelligent

race, proud of their former greatness, fond of show and careful to hide poverty. They say that was is their calling and few Marathas of good family, however well educated, willingly take service as clerks. They never keep shops. As a rule a well-to-do Maratha has in his service a Brahman clerk called divanji or minister, who often takes advantage of his master's want of education to defraud him, sometimes ending in making his master his debtor. Marathas are husbandmen, grantholders, landowners and state servants. Besides the Maharaja of Kolhapur several Marathas are chiefs or sansthaniks."

Bombay Gazetteer, Kolhapur, Vol. XXIV.

"Hiwen Thsang describes the people, apparently the warlike Maratha tribe, as tall, boastful and proud. Whoever does them a service, he says, may count on their gratitude, but no one who offends them will escape from their vengeance. If any one insults them they will risk their lives to wipe out the affront. If any one in trouble applies to them, forgetful of themselves they will hasten to help him. When they have an injury to avenge they never fail to warn their enemy; after the warning each puts on his cuirass and grasps his spear. In battle they pursue fugitives but do not slay those who give themselves up. When a general has lost a battle, instead of punishing him corporally they make him wear women's clothes, and so force him to sacrifice his life. The state maintains several hundred dauntless champions who every time they prepare for combat

get themselves drunk with wine; and then one of them, spear in hand, will defy ten thousand enemise. If they kill a man whom they meet on the road, the law does not punish them. Whenever the army goes on a campaign these braves march in front to the sound of the drum. They also intoxicate many hundreds of natnrally fierce elephants. They run in a body, trampling everything under their feet. No enemy can stand before them; and the king proud of possessing these men and elephants despises and slights the neighbouring kingdoms.' B. G. XXIV.

"The Marathas, especially the descendants of Shivaji the founder of the Maratha empire claim to belong to the Kshatriya or the scond of Manu's classes and say that their ceremonies are the same as those of Brahmans. Brahmans admit this claim in the case of the ruling family and perform their ceremonies with the Vedio texts...Well-to-do Marathas especially the families of chiefs and sardars or nobles gird their boys with the sacred thread between ten and twelve with the same ritual as at a Brahman thread-girding."

Bombay Gazetteer, Kolhapur, Vol. XX.V.

"As has been observed by sir W. Hunter, the Marathas know only two occupations, ruling the country and tilling the soil. When they cease to rule they sink into the position of peasants, History abounds with the Maratha ruling families such as the Chalukyas, the Silahars, the Kadambs, the Yadrvas the Chouhans, &c." Who are the Marathas.

౧౫. ఈకూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియుల కు గౌరవార్థముగ నుంచుకొనిన ఉపనామము లెవ్వియనినచో చౌదరీ నాయుడు, రావు, ద్వార, నీడు. నేని, సర్కార్, దేశముఖ్, సర్ దేశముఖ్, దేశాయి, సర్ దేశాయి, బల్వంత, ఛత్రపతి, మహీపతి, గజపతి, రాజా ఇవి మొదలుగాగలనామము లుపనామములై యున్నవి.

౧౬. ఈకూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియుల యొక్క గోత్రప్రవరలు యీక్రిందివిధమున తెలియబడుచున్నది.

సూ॥ క్షత్రియ వైశ్యయోరుపదిష్టా తిదిష్టగోత్రమ్॥ ఇతిఉద్వాహ తత్వే॥

అపిచ॥ పురోహితప్రవరో రాజ్ఞామ్ । ఇత్యాశ్వలాయన శ్రౌత సూత్రమ్, ౧.౨, ౧౫ కించ॥ పురోహితస్య ప్రవరేణరాజా ప్రవృణీత ఇతివిజ్ఞాయతే॥

ఇత్యాపస్తమ్బప్రవరకాణ్డమ్॥ ౧౧॥

ఇట్లు ప్రాచీనగ్రంథములగు సంస్కృతగ్రంథములయందు చెప్పబడిన విషయమేమన్నను, పూర్వకాలమున మహాఋషులనువారు ఈ క్షత్రియులకు ఆచార్యులగను, పురోహితులుగను, ఉండువారు. అందువలన నామహాఋషుల సద్బోధనలవలన యీక్షత్రియసమూహ మంతయు స్వధర్మపాలనమునందు తత్పరులై యుండుకొనుచు దుర్మార్గముల నుండి దూరులై సంచరించు చుండిరి. ఈకారణముచే నాక్షత్రియులు యీమహాఋషులనే వారిగోత్రప్రవరులయందు జేర్చుకొని ఆఋషులనామములనే గోత్రప్రవరులుగా జెప్పుకొనుచున్నారు. ఇందువలనే బైయ్యాశ్వలాయనాది సూత్రములయందు రాజులకు పౌరోహితుల గోత్రమునే చెప్పవలయునని నిబంధన యేర్పడినట్లు జెప్పుచున్నది. ఒకానొక సమయమున బ్రాహ్మణుడుగూడా రాజుయయ్యెనేని అతనియొక్క పౌరోహితుని గోత్రమునే తానుంచుకొనవలయునుగాని తనకు పూర్వముండిన గోత్రముతో దావ్యవహరించ కూడదని బూర్వోక్తమైన ఆపస్తమ్బ

ప్రవరసూత్రముయొక్క వ్యాఖ్యానమున జెప్పబడియున్నది. ఆవ్యాఖ్యానపంక్తులను గూడ నీక్రింద వ్రాయుచున్నాము.

వ్యా॥ పురఃఏనందధాతీతి పురోహితః। క్షత్రియో గార్హ్యపత్యమికః॥ అఞ్జనవిద్యావృత్త సహితః తస్యప్రవరేణరాజా అభిషిక్తః। ప్రవృణీతే బ్రాహ్మణోపి రాజ్యం ప్రాప్తః పురోహిత ప్రవరేణ ప్రవృణీతే॥ ౧౧॥

ఇందువలన నీక్షత్రియులు ఆమహాఋషులనే వారిగోత్ర ప్రవరులలో జేర్చుకొని యుండుటవలన ఈక్షత్రియులకు అనగా సూర్యవంశక్షత్రియులకు పదునిద్దరు మహాఋషులతో గూడిన గోత్రములున్ను, చంద్రవంశజ క్షత్రియులకు ఇరువదియైదు మహాఋషులతో గూడిన గోత్రములున్న ఉండినటుల నీస్కాంధ పురాణాంతర్గత సహ్యాద్రిఖండయందలి యీక్రిందిప్రమాణవచనమున జెప్పబడియున్నది.

శ్లో॥ సూర్యవంశోద్భవానాంహి గోత్రాణి ద్వాదశైవహి।
పఞ్చవింశతిసోమానాం గోత్రాణి మునిరబ్రవీత్॥

స్కాందపురాణము సహ్యాద్రిఖండ

ఈసూర్యకులావతంసులగు సూర్యవంశజులయొక్క ౧౨ గోత్రములలోనుండు ఋషుల నామములను స్కాంధపురాణాంతర్గత సహ్యాద్రిఖండయందు జెప్పియుండుటచే నాప్రమాణవచనముల నీక్రిందను లిఖించుచున్నాము.

శ్లో॥ భారద్వాజః పూతమాక్షో వశిష్ఠః కశ్యపస్తథా॥ ౧౮॥ హారీతో (శ్రీవత్సో) వృద్ధవిష్ణుశ్చ తథా బ్రహ్మా జనార్ధనః (ధనంజయః) 1 సాబలః కౌటిమశ్చైవమాణ్డవ్యః కౌశికస్తథా॥ ౧౯॥ విశ్వామిత్రఋషిః శ్రేష్ఠోద్వాదశైతే ప్రకీర్తితాః॥

అనగా ౧ భారద్వాజః, ౨ పూతమాక్షః, 3 వసిష్ఠః, ౪ కశ్యపః, ౫ హారీతః, అథవా, శ్రీవత్సః, ౬ వృద్ధవిష్ణుః, ౭ జనార్దన అథవా ధనంజ

య బ్రహ్మ, ౮ సౌబలః అథవా సౌతల్యః, ౯ కౌటిమః అథవా కౌండి
న్యః, ౧౦ మాండవ్యః, ౧౧ కౌశికః, ౧౨ విశ్వామిత్రః, అను నీపకు
నిద్దరు మహాఋషులు సూర్యవంశజుల గోత్రఋషులై యున్నారు.

ఇటుపై కూర్మకులావతంసజులకు చంద్రవంశజుల ౨౫ గోత్ర
ములయొక్క మహాఋషుల నామమును స్కాందపురాణాంతర్గతసహ్యా
ద్రిఖండయందు జెప్పియుండుటచే నాప్రమాణ వచనములను యీక్రింద
వ్రాయుచున్నాము.

౧ ప్రహ్లాదః, ౨ అత్రిః, 3 వశిష్టః, ౪ శుకః, ౫ కణ్వః, ౬
పరాశరః, ౭ విశ్వామిత్రః, ౮ భారద్వాజః, ౯ కపిలః, ౧౦ శౌనకః,
౧౧ యాజ్ఞవల్క్యః, ౧౨ జమదగ్నిః, ౧3 గౌతమః, ౧౪ ముద్గలః,
౧౫ వ్యాసః, ౧౬ లోమశః, ౧౭ అగస్త్యః, ౧౮ కౌశికః, ౧౯
వత్సః, ౨౦ పులస్త్యః, ౨౧ మకనం, అథవామార్కండేయః, ౨౨
దూర్వాసః, ౨3 నారదః, ౨౪ కశ్యపః, ౨౫ బకదాలభ్యః, అను
నీ ౨౫ కు మహాఋషులై యున్నారు.

ఇంతియే గాక నీచంద్రవంశజులలో రాజగు కామపతిఅను వాడు
తనకు సంతానము కలుగకబోయినప్పుడు అనేక మహాఋషుల సహాయ
మున పుత్రకామేష్టిఅను యజ్ఞమొనర్చి ఇష్టప్రాప్తినొందుటచే ఆమహా
ఋషులందరును ఈచంద్రవంశజులకు గోత్రఋషులై యున్నారని స్కాం
ధపురాణాంతర్గత సహ్యాద్రిఖండయందు 3 అధ్యాయమున నామహా
ఋషుల నామములను జెప్పబడి యున్నది. అవాక్యముల నీక్రింద వ్రా
యుచున్నారము.

శ్లో॥ పద్మాక్షుశ్చనన్దశ్చైవ గౌతమః కౌణ్డిన స్తథా। ౨౭॥ సౌమ
ల్యశ్చమ్పకశ్చైవ వశిష్ఠః కశ్యప స్తథా। విశ్వామిత్రో భృగుశ్చైచ
వ భారద్వాజోత్రి రేవచ॥ ౨౮॥ హిరణ్యోహారీతశ్చైవ దేవరా
జఋషి స్తథా। మృకణ్డుర్జైగీగర్గో మాణ్డవ్యః శౌనక స్తథా॥
౨౯॥ భద్రఋషికృపాయుశ్చ శూలకః శీలచామరః। మార్తాం

ణోపి ఋషిశ్రేష్ఠో విశ్వావసు ఋషీశ్వరః॥ ౩౦॥ దాల్భ్యశ్చ పూ
తిమాషశ్చ జామ్బ్యలగణకో ఋషిః। వైరుక్షో వైతసశ్చైవ జమ
దగ్నిశ్చ తాపసః॥ ౩౧॥ భావనః సౌమనశ్చైవ ఋషిర్నామా
భిదున్దుభిః। దాక్షిణో గోప కుమరౌ మైత్రేయశ్చైవ మద్గనః॥
౩౨॥ బకదాలభ్యరోమాణౌ కుమారో భావిన స్తథా। మాలివ
న్తఋషిశ్చైవ హ్యగ్నిక్షో ఋషిసత్తమః॥ ౩౩॥ ముద్గలః పారిజా
తశ్చ ఋషిర్దామోదర స్తథా। సాల్యసశ్చ ఋషిః శ్రేష్ఠః పార్థపశ్చ
మహాఋషిః॥ ౩౪॥ చారణాక్షః ఉగ్రఋషీ ర్హ్యమ్బష్ఠ ఋషిభావ
నః। సోమకాన్తోపీమ ఋషిశ్చమకః పాత్రిఇత్యపి॥

స్కాందపురాణం సహ్యాద్రిఖండ ౩౦ అధ్యాయము.

౧ పద్మాక్షః, ౨ నవః, ౩ గౌతమః, ౪ కౌణ్డిన్యః, ౫ సౌ
సల్పః, ౬ చమ్పకః, ౭ వసిష్ఠః, ౮ కశ్యపః, ౯ విశ్వామిత్రః, ౧౦
భృగుః, ౧౧ భారద్వాజః, ౧౨ అత్రిః, ౧౩ హిరణ్యః, ౧౪ హారీతః,
౧౫ దేవరాజః, ౧౬ మృకణ్డుః, ౧౭ అఙ్గిరః, ౧౮ గర్గః, ౧౯ మా
ణ్డవ్యః, ౨౦ శౌనకః, ౨౧ భద్రః, ౨౨ కృపాయుః, ౨౩ శూలకః,
౨౪ శీలచామరః, ౨౫ మూర్త్యాణ్డః, ౨౬ విశ్వావసుః, ౨౭ దా
ల్భ్యః, ౨౮ పూతమాషః, ౨౯ జామ్బ్యాలః, ౩౦ గణకః, ౩౧ వై
రుక్షః, ౩౨ వైతసః, ౩౩ జమదగ్నిః, ౩౪ భావనః, ౩౫ సౌమనః,
౩౬ అభిదున్దుభిః, ౩౭ దాక్షిణః, ౩౮ గోపః, ౩౯ కుమారః, ౪౦
మైత్రేయః, ౪౧ మద్దనః, ౪౨ బకదాలభ్యః, ౪౩ రోమాణః, ౪౪
మాలివన్తః, ౪౫ అగ్నిక్షః, ౪౬ ముద్గలః, ౪౭ పారిజాతః, ౪౮
దామోదరః, ౪౯ సాల్యసః, ౫౦ పార్థపః, ౫౧ చారణాక్షః, ౫౨
ఉగ్రః, ౫౩ అమ్బష్టః, ౫౪ సోమకాన్తః, ౫౫ చమకః, ౫౬ పాత్రితః.

ఈ చెప్పబడిన మహాఋషులలో చంద్రవంశజుల గోత్రములగు ౨౫ గోత్రములకు చెందిన మహాఋషులు కొందఱును, సూర్యవంశజుల గోత్రములకు జెందిన ౧౨ గోత్రములలో చేరినవారు కొందరును కలసి ఇందున జెప్పబడినవారై యున్నారు.

౧౭ ఈకూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులగు కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు యీమొదలైనవారు బాహాటములగు బూర్వోక్తములైన ఋషి గోత్రములను విడనాడి వేదశాస్త్రముల యందెచ్చటను ప్రస్థాపించనట్టి రేచర్ల, చందనూళ్ళ, పోగునూళ్ళ, గండ్రోళ్ళ ఇత్యాదిగోత్రములను ధరించుకొని ప్రచ్ఛన్న రూపులై సంచరించుచున్నారు. ఇట్లు వీరు ప్రచ్ఛన్నరూపమును బొంది సంచరించుచున్నారని ఎట్లు జెప్పవోపుననినచో వేదశాస్త్రములందెచ్చటను చెప్పని అపభ్రంశగోత్రములను వైశ్యులవలె ధరించుకొనిచరించుటయే ముఖ్యకారణముగ కన్పట్టుచున్నది. ఇట్టి ప్రచ్ఛన్నత్వమునకు గారణమేమైయుండునననిన ఈక్రింద వివరించునదియే ప్రబల కారణమై యున్నదని నొక్కి వక్కాణించుచున్నాము.

శ్రు॥ బ్రాహ్మణోస్య ముఖమాసీత్। బాహూ రాజన్యకృతః ఊరు తదస్య యద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥
పురుషసూక్తము ౧౩ మంత్రము.

స్మృతి॥ మాతురగ్రేధిజననం ద్వితీయం మౌంజిబంధనం। తృతీయం యజ్ఞదీక్షాయాం॥ మనుస్మృతిః॥ ౨ అధ్యా॥ ౧౬౯ శ్లోకము.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియో వైశ్యస్త్రయోవర్ణాద్విజాతయ। చతుర్థఏకజాతిస్తు శూద్రోనాస్తితు పంచమః॥

మనుస్మృతిః ౧౦ అధ్యాయము ౪ శ్లోకము.

అను నీశ్రుతిస్మృతి ప్రమాణములచే ద్విజాతులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ముప్పురును జన్మకాలమున శూద్రులేయనియు, మరియును శ్లో॥ జన్మనాజాయతేశూద్రః కర్మణాజాయతే ద్విజః। వేదపాఠంతువిప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥ అనునిట్టి శాస్త్రమును ఇట్టి బూర్వోక్తులగు ఆబ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనువారికి గర్మచేతను ద్విజత్వము గలుగుననియును జెప్పవలసియున్నది. ఈబ్రాహ్మణాదులేవరకు గర్మలను జేసిన నావరకును ద్విజులనియును, అట్టికర్మలనొ

క్క అభావమునందు అనగా కర్మలు జేయకబోయినప్పుడు శూద్రులు నగుదురు. ఇందులకు దృష్టాంతముగా ద్విజులు గొన్ని తప్పుకార్యము లుసేయునప్పుడు పతిత సావిత్రులై బోవుదురని యు అట్టిపట్ల దిరుగనుప నయన సంస్కారములు జేసుకొనవలయునని యు ఇట్లు శాస్త్రములు జె ప్పుచున్నవి. ఏకారణముచేతనైనను అట్టి ఉపనయనసంస్కారములు ది రుగా జేసుకొనకబోయనచో శూద్రుడై అటనుండి తమవంశమును అ నగా తమసంతానమును శూద్రులుగా నొనరించెదరు. అట్లగునెడల ని ట్లు శూద్రత్వముబొందిన ద్విజాతులకంటెను దక్కువగ వ్యవహరింప బడుదురు ఇందువలననే కొందరు యిట్టి వారింగూర్చి ప్రస్తుతములో వ్రాయునప్పుడును జెప్పునప్పుడును సచ్ఛూద్రులని అనుసాధించి జెప్పు చున్నారు. ఇట్టిస్థితిలో ప్రస్తుతమున వాడుకయందుండు కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారినికూడా బూ ర్వోక్తులవలె సచ్ఛూద్రులని జెప్పుటకు ప్రారంభించిరి. ఇట్లు జెప్పుటకు తగియుండలేదని దృఢముగా జెప్పగలము. ఏలయనినచో పరాశరస్మృ త్యాదిగ్రంథములయందు దాసనాపిత గోపాలకులమిత్ర అర్ధశీలి ఆత్మ నివేదకులను ఈయాఱుగురును సచ్ఛూద్రులని జెప్పుచుండ తదితరులగు బూర్వోక్తులవిషయములో సచ్ఛూద్రశబ్దమును గూర్చి యుపయోగించు టతగియుండలేదని మాత్రము బూర్వమువలె దృఢముగ జెప్పగలము. ఎందులకన్నను బూర్వోదాహృతులైన పెక్కు సంఘశాస్త్ర (ధర్మశా స్త్ర) గ్రంథములయందు ౧ దాస, ౨ నాపిత, 3 గోపాల, ౪ కులమిత్ర, ౫ అర్ధశీల, ౬ ఆత్మనివేదక, అను నీయాఱుగురిని సచ్ఛూద్రులని బై గ్రంథములలోని యీక్రిందిప్రమాణములు జెప్పుచున్నవి.

౧ శ్లో॥ ఆర్ధికః కులమిత్రశ్చ గోపాలోదాసనాపితౌ। ఏతేశూద్రేషు భోజ్యాన్నాయశ్చాత్మానం నివేదయత్॥

మనుస్మృతిః ౪ అధ్యాయము ౨౫3 శ్లోకము.

౨ శ్లో॥ శూద్రేషుదాసగోపాల కులమిత్రార్ధ శీలినః। భోజ్యాన్నా నాపితశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్॥

యాజ్ఞవల్క్యస్మృతిః ఆచారకాండ ౧౬౫ శ్లోకము.

3 శ్లో॥ దాసనాపితగోపాల కులమిత్రార్ధశీరిణః। ఏతేశూద్రేషు భోజ్యాన్నా యశ్చాత్మానం నివేదయేత్॥

పరాశరస్మృతిః ౧౧ అధ్యాయం ౨౧ శ్లోకము.

ఇందులో నుదహరించిన ౬ గురిలోను ౧ దాసుడను నప్పుడు శూద్రస్త్రీయందు బ్రాహ్మణునివలనబుట్టి షోడశకర్మలచే సంస్కరింపబడినవాడు దాసుడని జెప్పబడుచున్నది. ఇందులకు ప్రమాణమిట్లు గన్పడుచున్నది.

౧ శ్లో॥ శూద్రకన్యాసముత్పన్నో బ్రాహ్మణేనతు సంస్కృతః। సంస్కారాత్తుభవేద్దాస అసంస్కారాత్తునాపితః॥

పరాశరస్మృతిః ౧౧ అధ్యాయం ౨౨ శ్లోకము.

ఈశ్లోకమునకు విద్యారణ్యులవారు నీక్రింది విధమున వ్యాఖ్యానము జేసియున్నారు.

వ్యాఖ్యానము॥ దాసాదీనాం లక్షణమాహ। శూద్రేత్యాదినా। బ్రాహ్మణ శూద్రకన్యామూఢ్వా తస్యాంయం పుత్రముత్పాదయతి సయద్యమంత్రకైర్నిషేకాది భిస్సంస్కారైః సంస్కృతో భవతి। సదాసఇత్యుచ్యతే॥ ఇతివిద్యారణ్యః॥

ఈదాసుని యొక్క విషయములోను నాగరలిపిన ముద్రితమైన పరాశరస్మృతి భిన్నాభిప్రాయముతో జెప్పుచున్నది.

శ్లో॥ శూద్రకన్యాసముత్పన్నో బ్రాహ్మణేనతు సంస్కృతః। అసంస్కారాద్భవేద్దాసః సంస్కారాదేవనాపితః॥

పరాశరస్మృతిః ౧౧ అ. ౨౩ శ్లోకము.

అనగా బ్రాహ్మణునివలన శూద్రస్త్రీయందుబుట్టి షోడశకర్మలచే సంస్కరింపబడనివాడుదాసుడని జెప్పబడుచున్నది. ఈరెండుగ్రంథ

ములలోనుండు విషయములలో నెయ్యది ప్రమాణ మనినచో విద్యార ణ్యవ్యాఖ్యానముతోఁగూడిన పైశ్లోకమే ప్రమాణముగా వచ్చును. ఈ క్రిందిశ్లోకము అప్రమాణమైన కల్పితశ్లోకమని గుర్తెరుగుటకువీలున్నది.

ఈపైనవివరించిన శ్లోకములకు సరియగు ఆంధ్రపారాశర వా క్యముల నీక్రింద వ్రాయుచున్నాము.

క. నాపితదాసాన్నంబులు। గోపాలాన్నంబు మఱియు గులమి
త్రాన్నం। బాపయినర్థికునన్నము । సాపడగావచ్చు శాస్త్ర
సమ్మత మగుటన్ ॥

గీ. కాపుస్త్రీయందు ద్విజునివలన
గలిగిసంస్కృతుడైన వాడిలనుదాసు
డనియు సంస్కారములులేని యతడునాపి
తుండనియు జెప్పఁబడుదురుమఱియును.

ఆంధ్రపరాశరస్మృతిః తృతీయబింబము ౧౮౮, ౧౮౯.

ఇటుపై నాపితుని విషయమునందును జెప్పినదేమన్నను శూద్ర స్త్రీయందు బ్రాహ్మణునికిబుట్టి షోడశకర్మలచే సంస్కరింపబడకయుం డువాడు నాపితుడని దెలియజెప్పుచున్నారము.

ఇచ్చట నాపితుడన మరియొకఅర్థమున్నదని కొందఱు వాదిం చుచున్నారు. అందుచే నాశబ్దమునకేమి అర్థమున్నదో స్మృతులలో కనుగొనెదము.

౨ శ్లో॥ నరాణాంనాపితోధూర్త శ్చాదేభ్యోహ్యధికస్స్మృతః। వృద్ధ మనుః। శూద్రకన్యాసముత్పన్నో బ్రాహ్మణేనతు సంస్కృతః। అపరోనాపితప్రోక్త శూద్రకర్మాధికోపినః। యాజ్ఞవల్క్యనతు॥ శూద్రవేవనాపితఉక్తః। శూద్రేష్షుదాస గోపాల కులమిత్రార్ధసీ రిణః భోజ్యాన్నానాపితాశ్చైవేతి॥ శంఖేనతుప్రతిలోమజోయ ముక్తః। యత్తుసూతసగ్ం హితాయామూర్ధ్వనా పితోధోనా

పితశ్చేతి। ద్వైవిధ్యము క్తమత ఏవాశనాః॥ నాభేరూర్ధ్వంతువ
పనం తస్మాన్నాపిత ఉచ్యతఇతి జాతివివేకే॥ మార్గనాపితయో
ర్జాతో యో సౌ సాంఖల్య సంజ్ఞకః। హీనస్సుగుహ్య కేశానాంకు
ర్యాద్వపన మంజసేతి॥

ఇందుల భావమేమన్నను, మనుష్యులలో నాపితుడు ధూర్తుడు (అనగా మోసముచేయువాడు) వీడు శూద్రులకన్న నధికుడు. శూద్రుకన్యకయందు బ్రాహ్మణునివలన బుట్టి సంస్కృతుడగు వాడు మరి యొక నాపితుడని జెప్పబడును. వీడు శూద్రులకన్నను కర్మాధికుడని వృద్ధమనువు జెప్పెను. ఈయభిప్రాయమును యింతకుబూర్వమును జెప్పియుండినను ఆయభిప్రాయము విద్యారణ్య వ్యాఖ్యానమున, శ్లో॥ అసంస్కారాత్తునాపితః। బరాశరస్మృతికి వ్యాఖ్యాన మొనర్చుటలోను వ్యా॥ సంస్కారాభావేతునాపిత ఇత్యుచ్యతే॥ అను నీప్రకారమువిద్యారణ్యులవారు వ్యాఖ్యానము ననుసరించియు పరాశరస్మృతి మూలగ్రంథము ననుసరించియు ఖండింప బడినదని వ్రాయుచున్నాము. యాజ్ఞవల్క్యస్మృతే శూద్రుడే నాపితుడని జెప్పెను. శూద్రులయందు దాసగోపాలకుల మిత్రులును తమ కృషిజేయువాడును, నాపితుడును భోజ్యాన్నులని జెప్పిరి. సూతసంహితయందు ఊర్ధ్వనాపితుడని, అధోనాపితుడని ద్వైవిధ్యముగ నున్నది. అదిగావుననే నాభికంటె నూర్ధ్వమందు వపనము జేయువాడు నాపితుడని శుక్రుడు చెప్పెను. మార్గనాపితులకు బుట్టినవాడు సాంఖలుడు వీడు హీనుడు గుహ్యకేశవపనమును జేయునని జాతి వివేకమనుగ్రంథము చెప్పుచున్నది.

ఇందువలన నాపితుడన బ్రాహ్మణునివలన శూద్ర స్త్రీయందు బుట్టినవాడు నాపితుడనియు, ఇట్టి నాపితుడు శూద్రులకన్న శ్రేష్ఠుడై క్షౌరకర్మలు చేసుకొని జీవించుచున్నాడని తెలియుచున్నది.

ఇటుపై గోపాలకుడన నెవ్వడో విచారించవలసిన యగత్యముండుటచే నావిషయమునుగూర్చి వ్రాయుచున్నాము.

3 శ్లో॥ క్షత్రియాచ్ఛూద్రకన్యాయాం సుతోజాయేత నామతః। స
గోపాల ఇతిజ్ఞేయో భోజ్యోవిప్రైర్నసంశయః॥
పరాశరస్మృతిః ౧౧ అ. ౨౩ శ్లోకము.

గీ. అవనిభర్తకు గాపుటిల్లాలునందు
జననమొందినవాడు పేరునకుగొల్ల
వాడయినవాని గృహమున బ్రాహ్మణుండు
సాపమెటలెన్నయొప్పు నిస్సంశయముగ.

ఆంధ్రపరాశరస్మృతి తృతీయబింబము ౧౯౦.

ఇందువలన మనకు దెలియబడినదేమన్నను క్షత్రియునివలనశూద్రస్త్రీయందు బుట్టినవాడు గొల్లయనియు, అతనివలన బ్రాహ్మణాదులగు ద్విజులుకూడ భుజించవచ్చునని దెలియుచున్నది. ఈగోపాలకుని వలన బ్రాహ్మణాదులు భుజించ వచ్చునని జెప్పినట్లుగనే దాసనాపితాదులయందును భుజించ వచ్చునని బూర్వ శ్లోకములు గూడ చెప్పు చున్నవి.

ఇటుపైన కులమిత్రుడనిన ఎవ్వడో నట్టివానిం గూర్చి విచారించ దగియున్నది.

4 వ్యా॥ వైశ్యశ్శూద్ర కన్యాముద్వా తస్యాంయం పుత్రముత్పాదయతిస కులమిత్ర ఇతి॥
పరాశరమాధవీయము. 3౧౧ పత్రము.

క. చిరకాలమిత్రుడును సూ। దరవనితకు బచ్చువలనధరబుట్టినవా।
డరయగకులమిత్రుండగు। మఱియుం బాఱునకు రాచమానినవల
నగా। ఆంధ్రపరాశరస్మృతి 3 బింబము ౧౯౧.

ఇందువలన శూద్రస్త్రీయందు వైశ్యునికి బుట్టినవాడు కులమిత్రుడని దెలియబడుచున్నది. ఈపరాశరస్మృతి లోకులమిత్రుని యొక్క లక్షణమునుగూర్చి ప్రమాణవచనము జెప్పబడక నుండినను శబ్దము

నుబట్టిగాని ప్రక్రమబలమును బట్టిగాని ఈకులమిత్రుని లక్షణమును గ్రహించవచ్చునని దలచి విద్యారణ్యులవారు బూర్వోక్తవిధి ననుసరించి వ్యాఖ్యానము జేసియున్నారు.

ఇటుపై అర్ధశీరిఅనునప్పుడు యీక్రిందివిధమున దెలియుచున్నది.

౫ శ్లో॥ వైశ్యకన్యాసముద్భూతో బ్రాహ్మణేనతుసంస్కృతః।
సహ్యార్ధికఇతిజ్ఞేయో భోజ్యోవిప్రైర్నసంశయః॥

పరాశరస్మృతిః ౧౧ అధ్యాయం ౨౮ శ్లోకము.

క. .........బచ్చుమగువలన బా। ఱునకుబొడమి సంస్కారము। లెనసినవాడర్ధికుడని యెఱుంగదగుఁ॥

ఆంధ్రపరాశరస్మృతి 3 బింబము ౧౬౨.

ఇందువలన దెలియబడినదేమన్నను వైశ్య(స్త్రీ)యందు బ్రాహ్మణునికి బుట్టినవాడు అర్ధశీలుడని దెలియబడినది. వీడిచేతను బూర్వోక్తులవలె బ్రాహ్మణాదులు భుజించ వచ్చును. ఇటుపై నాత్మని వేదకుడన నెవ్వడో విచారించెదము. ఇతని విషయములో పరాశరమూలస్మృతి నేమియు జెప్పియుండక పోయినను విద్యారణ్యులవారు కులమిత్రుని విషయములో జెప్పినట్టుగనే ఇచ్చటను శబ్దబలమునుబట్టియు ప్రక్రమ బలమునుబట్టియు జెప్పియున్నారు. ఆయభిప్రాయమునే క్రింద వ్రాయుచున్నాము.

౬ వ్యా॥ క్షత్రియాయాం బ్రాహ్మణోత్పాదిత స్సంస్కృతఆత్మనివేదకోఽస్తు॥ పరాశరమాధవీయము 3౧౧ పత్రము.

క. ......మఱియుంబాఱునకురాచ మానినివలనన్. ౧౬౧.

క. జననంబొందినవాడా। త్మనివేదకుడయ్యె.......

ఆంధ్రపరాశరస్మృతి 3 బింబము ౧౬౨.

ఇందువలన దెలియబడినదేమన్నను బ్రాహ్మణుని వలన రాచకన్యకయందు బుట్టినవాడు. ఆత్మనివేదకుడనియు, ఇట్టివానివలన బ్రాహ్మణాదులు భుజించవచ్చునని దెలియబడుచున్నది.

౧౫ ఈవిచారణవలన మనము గుర్తింపుగ తగిన విషయమేమ న్నను, ౧ శూద్రస్త్రీయందు బ్రాహ్మణునివలన బుట్టి షోడశకర్మలచే సంస్కరింపబడిన వాడు దాసుడనియు, ౨ ఈప్రకారముగనే శూద్ర స్త్రీయందు బ్రాహ్మణునికిబుట్టి సంస్కరింపబడనివాడు నాపితుడనియు, ౩ శూద్రస్త్రీయందు క్షత్రియునివలన బుట్టినవాడు గోపాలకుడనియు, ౪ శూద్రకన్యయందు వైశ్యుని వలన బుట్టినవాడు కులమిత్రుడనియు, ౫ వైశ్యస్త్రీయందు బ్రాహ్మణునివలన బుట్టినవాడు అర్ధశీలుకనియు, ౬ రాచస్త్రీయందు బ్రాహ్మణుని వలన గలిగినవాడు ఆత్మనివేదకుడని యు, ఈఆఱుగురి వలన బ్రాహ్మణాదులు భుజించ వచ్చుననియు త దితరులైన శూద్రుల వలన భుజించరాదనియు బూర్వోక్తములగు మ ను యాజ్ఞవల్క్య పరాశరాది స్మృతులలోనుండు ఈక్రిందిప్రమాణముల చే దెలియుచున్నది.

శ్లో॥ ఏతేశూద్రేషు భోజ్యాన్నా॥ శూద్రేషుదాస గోపాలకులమి
త్రార్ధశీలనః। భోజ్యాన్నా॥ ఏతేశూద్రేషుభోజ్యాన్నా॥ సగోపా
లఇతిజ్ఞేయో భోజ్యోవిప్రైర్న సంశయః॥ సహ్యార్ధిక ఇతిజ్ఞేయో
భోజ్యోవిప్రైర్నసంశయః॥ దాసాదివత్కుంభకారోపి భోజ్యా
న్నఏవ॥ తదాహదేవలః॥ సదాసోనాపితోగోపః కుంభకార కృ
షీవలః। బ్రాహ్మణైరపిభోక్తవ్యాః పంచైతేశూద్రయోనయః॥

ఇందులో జెప్పిన కుంభకార కృషీవలులుగూడ సచ్ఛూద్రులై యున్నారు. తదితరులైన వారందరును శూద్రులై యుండినట్లు బూ ర్వోక్తమైన వృద్ధమనుస్మృతి వాక్యమగు, శ్లో॥ నరాణాం నాపితోధూ ర్తః శూద్రేభ్యోప్యధికస్స్మృతః॥ అను నీవాక్యములో నుండు మంగలి శూద్రులకన్న శ్రేష్ఠుడని జెప్పియుండుటచేతను, శ్లో॥ అపరోనాపితప్రో క్త చ్ఛూద్రకర్మాధికోపిసః। అను నీవాక్యములో మంగలి శూద్రకర్మ లకన్న శ్రేష్ఠమైన అధికమగు కర్మలుగలవాడనియు, జెప్పియుండుచేత ను మరియు, శ్లో॥ శూద్రేషుదాసగోపాల॥ శ్లో॥ ఏతేశూద్రేషు॥ అను నీవాక్యములలోను శూద్రులయందు దాసనాపిత గోపాలురనువారు భో

జ్యాన్నులని జెప్పియుండుటచేతను, ఉపైవివరించిన హేతువులను బట్టి దాసనాపిత గోపాలాదులు శూద్రులనువారికంటె శ్రేష్ఠులైనట్టిసచ్ఛూద్రులై యున్నారని తెలియుచున్నది. ఈ బూర్వోక్తములైన వాక్యములలో నెచ్చటనైనను కమ్మవారు మొదలగువారు విషయమును గూర్చి సచ్ఛూద్రులని జెప్పకయుండిన సంగతి మీకందరికి దెలిసిన సంగతియై యున్నది.

అట్లగునెడల బూర్వోక్త ప్రమాణ వచనములయందు దాసనాపిత గోపాలాదులవలన బాహ్మణాదులు భుజించ వచ్చునని జెప్పబడి యున్నదనియును శూద్రులకన్నను శ్రేష్ఠులై అధికములైన కర్మలు గలవారనియును, ఇట్లని జెప్పబడియున్నదిగాని సచ్ఛూద్రులని యెచ్చటను జెప్పియుండలేదు. కాబట్టి బూర్వోక్తులగు కమ్మవారు మొదలగువారు సచ్ఛూద్రులై యున్నారని యిట్లు కొందఱువాదించెదరు.

ఇట్టివాదన యీక్రిందవాయునట్టి అభిప్రాయమునుబట్టి సరియై యుండలేదని మాయభిప్రాయము. ఏలయనినచో పరాశరస్మృతి ౧౧ అధ్యాయము ౨౧ శ్లోకముయొక్క శీర్షికయందు సచ్ఛూద్రవిచారః అని యుండుటచే నాశ్లోకమందు జెప్పబడిన వారెల్లరును సచ్ఛూద్రులై యున్నారు. అని జెప్పుటకేయభ్యంతరముండజాలదు. ఈశీర్షికసచ్ఛూద్రవిచారః అని యిట్లు వచించినంతమాత్రముననే దాసనాపిత గోపాలాదులు సచ్ఛూద్రులెట్లగుదురని పృచ్ఛచేసెదరేని యీక్రిందిప్రమాణవచనములచే ప్రత్యుత్తరమిచ్చుచున్నాము.

శ్లో॥ శుష్కాన్నంగోరసంస్నేహం శూద్రవేశ్మనఆగతమ్। పక్వం విప్రగృహేపక్వం భోజ్యం తన్మనురబ్రవీత్॥

పరాశరస్మృతిః ౧౧ అధ్యాయము ౧౮ శ్లోకము.

విద్యారణ్యకృత వ్యాఖ్యానము. ఆ॥ ఘృతంతైలం తథాక్షీరమిత్యత్ర శూద్రసంబంధినాం భోజన మభ్యనుజ్ఞాతం । ఇదానీ శూద్రతండులాదీనా మభ్యనుజానాతి। శుష్కాన్నంవ్రీహితం

దుఃలాదిగోరసః క్షీరాదిః స్నేహాస్తైలాదిః తత్సర్వం శూద్రగృహా దానీయ బ్రాహ్మణగృహేయదిపక్వం భవతి తదాతదన్నంభోజ్యం। పక్వాపక్వయోస్సాధారణ నిషేధపూర్వముదాహృతస్సోయమసచ్ఛూద్రవిషయః। అతఏవమధ్యమాంసరతా ఇత్యుక్తమ్॥

పరాశరమాధవీయము 300 పత్రము.

ఈవ్యాఖ్యానము ౧౯ వ శ్లోకముయొక్క వ్యాఖ్యానమై యున్నది. ఇందులో జెప్పిన యభిప్రాయమేమన్నను ఈశ్లోకమునకుబూర్వ శ్లోకమున జెప్పిన విషయములో శూద్రులవద్దనుండి ఘృతతైల క్షీరాదులను గ్రహించుట కభ్యనుజ్ఞ యివ్వబడినదని జెప్పబడియున్నది. ఈ శ్లోకమున అనగా యిపుడు శూద్రులవద్దనుండి బియ్యము మొదలైనవి గొనివచ్చి బ్రాహ్మణుడు తమయింట పక్వమొనర్చి భుజించ వచ్చునని అభ్యనుజ్ఞ యివ్వబడినదనియు, ఇంతకుబూర్వము పక్వాపక్వమైనపదార్థములలో నెద్దానినైనను గ్రహించుటకు వలనుపడదని జెప్పినది అసచ్ఛూద్రుల విషయమందు జెప్పబడినది. అనియిట్లు పక్వాపక్వయోస్సాధారణనిషేధపూర్వముదాహృతస్సోయమసచ్ఛూద్రవిషయః॥ అనునీవాక్యముచేజెప్పియున్నారు. ఇట్లు ప్రస్తుతమున వ్యాఖ్యానకర్త ౧౯ శ్లోక వ్యాఖ్యానావసరమున అసచ్ఛూద్రుల విషయము జెప్పియుండుటచేఇటుపై మున్ముందు యుండునట్టి ౨౦, ౨౧ వ శ్లోకముల యందు వ్యాఖ్యానకర్త సచ్ఛూద్రులవిచారము చేయవలసివచ్చినదను సంగతిస్తనందులకు సహితము బోధయగుచున్నది. ఈకారణము చేతనే వ్యాఖ్యానకర్త ౨౧ వ శ్లోక వ్యాఖ్యానావసరమున సచ్ఛూద్రవిచారః॥ అను నీశ్శీర్షికచే శ్లోకవ్యాఖ్యామును ప్రారంభించి యున్నవారు. ఇయ్యది వ్యాఖ్యానకర్తయగు విద్యారణ్య స్వాములవారియొక్క అభిప్రాయముగాని ౧౮౯౩ సంవత్సరము చెన్నపురమున చెదులవాడ సుందరరామశాస్త్రులవారియొక్క ముద్రాక్షరశాలయగు శారదాంబా విలాస ముద్రాక్షరశాలయందు కీర్తిశేషులగు వావిళ్ళ రామస్వామిశాస్త్రులగారి పుత్రులగు వెంకటేశ్వరశాస్త్రులవారిచే నైదవపర్యాయము ముద్రించి

ప్రకటింపబడిన పరాశరస్మృతియందు సదరింపబడినట్టి సచ్ఛూద్రవిచారః॥ అనునీశీర్షిక కమైయుండ లేదు. ఇంతియేగాక మనుస్మృతి ౪ అధ్యాయము ౨౫౩ శ్లోకమునకు వ్యాఖ్యానకర్తయగుకుల్లూకభట్టును యాజ్ఞవల్క్య స్మృతి ఆచారకాండము ౧౬౫ శ్లోకముయొక్క వ్యాఖ్యానకర్తయగు విజ్ఞానేశ్వరుడును, పరాశరస్మృతి ౧౧ అధ్యాయము ౨౧ శ్లోకముయొక్క వ్యాఖ్యానకర్తయగు విద్యారణ్యస్వాములవారును, వారివారి వ్యాఖ్యానములలో సచ్ఛూద్రులగు దాసనాపిత గోపాలాదులవలన భుజించ వచ్చునని జెప్పియుండుటచే వీరు సచ్ఛూద్రులని ఈక్రిందివ్యాఖ్యానములయందు జెప్పియున్నారు.

౧ వ్యా॥ అర్ధికః కార్షికః సంబంధిత్వేచ్ఛేతేయో యస్య కృషింకరోతి సతస్య భోజ్యాన్నః। ఏవంస్వకులస్యమిత్రం। యోయస్య గోపాలో। యోయస్యనాపిత కర్మకరోతి। యోయస్యనాత్మానం నివేదయతి దుర్గతోహం త్వదీయ్యసేవాంకుర్వన్ త్వత్సమీపేవసామీతిన శూద్రస్తస్య భోజ్యాన్నః। ఇతి కుల్లూకభట్టః॥ మనుస్మృతి ౪ అ. ౨౫౩ శ్లో. ౮౮ పత్రము.

౨ వ్యా॥ ఏతేదాసాదయః శూద్రాణామధ్యే భోజ్యాన్నాః చకారాత్కుంభకారశ్చ। గోపనాపిత కుంభకారకుల మిత్రార్ధిక నివేదితాత్మనో భోజ్యాన్నా ఇతివచనాత్। ఇతి విజ్ఞానేశ్వరః ॥ యాజ్ఞవల్క్యస్మృతిః ఆచారకాండము ౧౬౫ శ్లోకము.

3 వ్యా॥ అ॥ ద్విజశుశ్రూషణ రతానిత్యత్ర భోజ్యాన్నా। శూద్రాస్సామాన్యేన నిర్దిష్టాస్తానేతానిదానీం విశేషతోదర్శయతి. దాసేతి। దాసాదయ ఆత్మనివేద కాంతాష్షట్ శూద్రాభోజ్యాన్నాః ఇతిమాధవాచార్యః॥

పరాశరమాధవీయము. ౧౧ అ. ౨౧ శ్లో. ౮౮ పత్రము.

ఇందువలన నీసచ్ఛూద్రులచే భుజించవచ్చునని పై వ్యాఖ్యానములయందు జెప్పియుండినప్పుడు తదితరులగు శూద్రులవలన భుజించ

కూడదని జెప్పినట్టాయను అందువలన నీదాసనాపితగోపాలాదులు తదిత రులైన శూద్రులకన్నను శ్రేష్ఠులై యుండుటచేతనే భుజించవచ్చునని వ్యాఖ్యానకర్తలు జెప్పుట వలన ఈదాసనాపిత గోపాలాదులు సచ్ఛూద్రులైయున్నారని దృఢముగ జెప్పుటగలిగినది. మరియుసచ్ఛూద్రాగోపనాపితౌ అని యిట్లు చెప్పబడియున్నది.

ఈవిచారణవలన నిశ్చయింపబడిన దేమన్నను శూద్రులు మూడుతరగతులుగ నుండువారని నిశ్చయింపబడినది. ఇందులో జెప్పిన మూడుతరగతుల శూద్రులెవరన్నను, ౧ సచ్ఛూద్రులు, ౨ శూద్రులు, 3 అసచ్ఛూద్రులు, అని యిట్లు దెలియుచున్నది. ఈముగ్గిరిలో ౧ సచ్ఛూద్రులనగా దాసనాపిత గోపాలాదులు సచ్ఛూద్రులు ౨ శూద్రులనగా దాసనాపిత గోపాలాదుల కన్నను తక్కువగల స్థితియందుండు వారలు శూద్రులు, 3 అసచ్ఛూద్రులనగా నిరంతరము మద్యమాంస రతులగు శూద్రులు అసచ్ఛూద్రులు ఈశూద్రులకన్న వ్యతిరిక్తుడగు అయిదవవాడు లేడని మనుస్మృతి ౧౦ అధ్యాయము ౪ శ్లోకమగు నాస్తితుపంచమః అను నీశ్లోకము జెప్పుచున్నదని బూర్వమే దెలియజేసియున్నాము. ఇట్టివిషయములను యీవిచారణవలన గుర్తెరుగుటకలిగినది.

౧౫ ఇట్లగునెడల కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, యీమొదలగువారలు శూద్రులని గొన్ని గ్రంథములలోని యీక్రిందివాక్యములు గన్పడుచున్నవి.

౧ ......(కమ్మవారు లేక) కమ్మ. దే. వి. శూద్రవిశేషణము. వ. వెలమలనగమల్లన। భీమఖండము.

౨ ......(కాపువారు లేక) కాపు 3 పంటబెట్టువాడు.

గీ. కాపులావుకరవుగల్గి కర్శనముసేయంగవృష్టితగినయట్లు కలుగుఫలము. కల్లు ౩౧ ప భారతము. సౌప్తికపర్వము. ౧ అ.

౪ శూద్రుడు. క. ఓకాపుయిందురమ్మని। సాకతమున జేరబిలిచి శకునవిధిజ్ఞుం। డాకసవు కట్టడించియు । నాకులమతివిచ్చిచూడ నవుడు నడఁమగ్.

భోజరాజీయము. ౪ ఆ. శ్వాసము ౫౯ ప.

3 ......(వెలమవారు లేక) వెలమ. దే. వి. శూద్రజాతివి శేషణము. (వెలమవాడు, వెలమది)

౪ ......(రెడ్డివారు లేక) రెడ్డి. దే. వి. కాపువారిపట్టపు పేరు. (శూద్రవిశేషణము)

౫ ......తెలగ. వై. వి. త్రిలింగ దేశము నందలి యొక శూద్రజాతి.

౬ ......బలిజ. దే. వి. శూద్రజాతి విశేషము. శబ్దరత్నాకరము ౨౧౧, ౨౩౨, ౧౦౨౪, ౯౩౩, ౫౦౫, ౭౮౪.

ఇందులకు మీరేమి ప్రత్యుత్తరము జెప్పెదరనినచో నీక్రింది విధమున ప్రత్యుత్తరమిచ్చుచున్నాము. ఈశబ్దరత్నాకరము మొదలగు నిఘంటువులను ధర్మశాస్త్రవిషయములో ప్రధానగ్రంథములుగ నెన్నుకొని కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు శూద్రులని వచించుట తగదని వ్రాయుచున్నాము. ఏలయనినచో నీగ్రంథములో ౪ పత్రము ౪ పంక్తియందు జెప్పియున్న మనుస్మృతిలోని ప్రథమాధ్యాయస్థమగు ౨౧ శ్లోకమైన శ్లో॥ సర్వేషాంతు సనామాని కర్మాణిచ పృథక్పృథక్। వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చనిర్మమే॥ అను నీశ్లోకముచేతను మరియును గొన్నియితర ప్రమాణములచేతను మనము వర్ణాశ్రమధర్మములను నిర్ణయించ వలసి వచ్చినప్పుడు అన్నిటికిని మూలప్రమాణమగు వేదప్రమాణములను గ్రహించి వర్ణాశ్రమధర్మములను నిర్ణయించుకొన తగియున్నది. ఇట్లుగాక కుటుంబపోషణార్థమై నీవింద్రుడవు చంద్రుడవు అని స్తోత్రపాఠమును వర్ణించు స్వార్థపరులగు వారివచనములచే ప్రత్యేకముగను వర్ణాశ్రమ ధర్మములను నిర్ణయించుకొనుటగాని లేక అమరకోశము, శబ్దరత్నాకరము అనునీమొదలగు గ్రంథములచే వర్ణాశ్రమధర్మములను నిర్ణయించుకొనుట త

గదని ఇంతకుబూర్వ మీగ్రంథమున ౫౨ వ పత్రముయొక్క చివరభాగ
మునవ్రాసియున్నాము.

ఇట్టితఱి నీశబ్దరత్నాకరము బూర్వోక్తములైన బహుప్రమా
ణగ్రంథములకు వ్యతిరిక్తములై యుండుటచే మనమాగ్రంథము వలన
వర్ణాశ్రమధర్మములను నిర్ణయించుకొనుటకెట్లు పొసగునో యోచించు
కొనతగి యున్నది.

ఇట్లగునెడల మాపూర్వులనుండియు వీరి పూర్వులనుండియు నీ
కమ్మవారు మొదలగువారిని సచ్ఛూద్రులని వచించుట ఆచారమై యు
న్నదిగనుక మేమును అట్లుగనేవచించుచున్నామని ప్రశ్నించితిరేనిఅం
దులకీక్రిందివిధమున ప్రత్యుత్తరమిచ్చుచున్నాము. ఆచారమను నప్పు
డు నెద్దియో మొదట మనము విచారించ వలసి యున్నది. ఇందులకు
కొందఱు ఆచారమనునప్పుడు పూర్వు లవలంబించినదే శిష్టాచారమని
చెప్పుదురు. అట్టిపక్షములో శిష్టుడగు వశిష్టుడు కూడా గొన్ని నూతనా
చారములును జేసియున్నాడు. అవియద్దియనిదరేని విశ్వామిత్రుని పు
త్రులవల్ల తనపుత్రులు నూర్గురు నశించిరని తెలుసుకొని దుఃఖము
ను భరించజాలక హిమవత్పర్వత శిఖాగ్రమునుండి క్రిందదుమికి ప్రాణ
హత్య జేసుకొనుటకు ప్రయత్నించిన శిష్టాచారమేదికలదో దానినిమన
మందరము జేయతగినదియే అయియున్నది. ఇపుడట్లు నెవరును జేయు
టలేదు. అట్లుజేయుటకును శాస్త్రముప్పుటనులేదని, శ్రు॥ యాన్యనవ
ద్యాని కర్మాణితానిసేవితవ్యాని॥ నోఇతరాణి॥ అని యిట్లు శాస్త్రము
జెప్పుచుండుటచే వీలులేదు, ఇట్టితఱి శిష్టులగు వశిష్ఠులవారాచరించిన
కర్మ సర్వజనాదరణీయమై యుండలేదు. అని మీరును ఒప్పుకొనకత
ప్పనిసరియగుచున్నది. ఇదియునుంగాక నాచారమనునప్పుడు శ్రుతిస్మృ
తి యుక్తమైనదే ఆచారమని ఈక్రింది ప్రమాణవచనము తెలియజే
యు చున్నది.

శ్లో॥ ఆచారః పరమోధర్మశ్శ్రుత్యుక్తః స్మార్త ఏవచ । తస్మాదస్మిన్
సదాయుక్తో నిత్యంస్యాదాత్మవాన్ద్విజః॥
మనుస్మృతి ౧ అధ్యాయము ౧౦౮ శ్లోకము.

ఇందువలన శ్రుతిస్మృతి యుక్తమైనదే నాచారమనియును, ఒకవేళ శ్రుతిస్మృతులకు వ్యతిరిక్తముగ పూర్వు లవలంబించినది ఆచారముకాదనియు దెలియబడినది. శ్రుతిస్మృతులకు వ్యతిరిక్తమైన ఆచారమువిమని యనిపించుకొనుననిననో దేశకాలపాత్రతల ననుసరించిమార్చుకొని మార్పులని యనిపించుకొనునేగాని ఆచారమని యనిపించుకొన జాలదు.

ఇంతకు బూర్వము నుదహరించి యీసచ్ఛూద్రులగు దాసనాపిత గోపాలాదులైన వీరియెడల ధర్మశాస్త్రములయందు నిర్ణీతములై శూద్రధర్మములు కొంచముగనో గొప్పగనో నేటివరకు గాన్పించుచున్నది. ఇట్టి సచ్ఛూద్రులు అగ్రవర్ణముల వారికి వలె కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారికిని బరిచర్యాదులు చేయుటయే సవర్ణధర్మముగా గ్రహించి ఈసచ్ఛూద్రులు బ్రవర్తించుచున్నారు. అయితే సచ్ఛూద్రులగు వీరిలోవీరిట్లు ప్రవర్తించుట అసంగతము కాదాయని యూహించతగియున్నది. ఏదియో తగినంత యాధిక్యత కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, యీమొదలగువారియందు లేనిదే వర్ణాశ్రమధర్మములు ప్రధానముగ నుండు మన భరతఖండమున ఇట్టిగౌరవము కలుగనేరదు. అటుగావున యిపుడు మనమట్టి గౌరవకారణము లేవియైయుండునోయని ఆలోచించ తగియున్నది. ఇందులకు మొదట మేముజూపిన దే కారణమై యుండవచ్చును. అదియేదియనినచో ద్విజాతులలోనివారలు కాలాంతరముల నొక్కొక్కతఱియిక్కట్టులు వచ్చినప్పుడు స్వవర్ణాశ్రమధర్మములు చెడిగాని లేక మరికొన్ని ఇతర కారణములచేత ప్రచ్ఛన్నరూపములు ధరించిగాని శూద్రత్వమును బొందిన వారివలెనటించుచు వచ్చిరి. ఇందులకు పాండవులే దృష్టాంతకులై యున్నారు. ఆహేతువున వారు శూద్రులువలె నటించినను నీచతెనందక నొకవిధముగ గౌరవమును నిల్పుకొని కాలక్షేపనము జేయుచున్నారు. ఇట్టితఱి మనకమ్మవారు మొదలగువారికి నేమియిక్కట్లు సంభవించెననినచో యిందులకు మార్కండేయోత్తర పురాణమే

ప్రత్యుత్తర మొసగుచున్నది. అట్టి విషయము నీక్రింద జెత్రించుచున్నాము గమనించతగియున్నది.

మార్కండేయ పురాణోత్తర ఖండము. అధ్యాయము. మహాపద్మ చరిత్రము.

శ్లో॥ మహానందిర్మహారాజో రాజ్యం కుర్వన్మదోత్కటః। సరాజో రాజకన్యాంచ ఏకాం శూద్రకులోద్భవాం॥ ౧॥ కన్యాంగృహీ ష్యతి ముదాపత్నీ త్వేనామతచ్ఛ్రిణు। మహానందీ సుతోరాజః శూద్రగర్భోద్భవోబలీ॥ ౨॥ మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్రవినాశకృత్। సర్వదేశస్థితం క్షత్రంపాలయిష్యతి మూఢధీః॥ ౩॥ జ్యోతిః పుర్యాం మహానందీ నందస్థాప్య మహామనాః। సర్వరాజ్యాభిషేకంతు కరిష్యతినసంశయః॥ ౪॥ మహానందీమహారాజో మృతిమేష్యతికాముకః। సర్వరాజ్యాధిపత్యంతు ప్రాప్యనందో మహాబలః॥ ౫॥ సర్వదేశస్థితం క్షత్రం స్వవసంతు కరిష్యతి। నందోమహాబలోవీరో మహాపద్మపతిర్విభుః॥ ౬॥ సర్వరాజస్య కర్మాణి మదాంధస్తుకరిష్యతి। మహాపద్మంతు నగరం తస్యనామద్వయంభవేత్॥ ౭॥ ఉపప్లావ్యం జ్యోతిపుర మిత్యాహుర్వేదవాదినః। మహాపద్మాఖ్యనగరే స్థిత్వానందోమహాబలః॥ ౮॥ శాశిష్యతిన సందేహ స్సర్వదేశస్థితాన్నృపాన్। తేతుతస్య నమస్కారం నకరిష్యంతి భూమిపాః॥ ౯॥ శూద్రాగర్భోద్భవాత్వాచ్చ వేదోక్తవిధిహీనతః। క్షత్రవంశోద్భవా భావాన్న కరిష్యంతి తస్యతు॥ ౧౦॥ నమస్కారంహి రాజేంద్ర సర్వదేశస్థితాన్నృపాః। తస్మాత్కోపాత్పద్మపతిః నందోబలపరాక్రమః॥ ౧౧॥ సర్వదేశస్థితం క్షత్రంజేతుం వైసగమిష్యతి। అక్షౌహిణీ బలౌఘేన వృతోనందో మహాబలః॥ ౧౨॥ స్థితంజయాపురేవీరం విరాటకులసంభవం। గజపతింజయః। జేతుంగజపతిం యోగ్యంప్రథమంతు గమిష్యతి॥ ౧౩॥ రాజ్ఞో గజపతేర్దూతం సనందః ప్రేషయిష్యతి। గత్వాదూతో గజపతిందృష్ట్వా వాక్యం సకరిష్యతి॥

౧౪॥ నందరాజస్య దూతోఽహంతే నైవపేషితోఽస్మహం। నంద
వాక్యాని రాజేంద్ర శృణుధీరమనాప్రభో॥ ౧౫॥ మమకార్యో
నమస్కారస్త్వయా త్వత్కులజైరపి । నకరోషి తథారాజన్న
దైవత్కాష్ట బాంధవం॥ ౧౬॥ సజ్ఞాతింరాజ్యహీనంచ కరిష్యా
మినసంశయః॥ కరందత్వాతి శీఘ్రేణ పూర్వస్మాచ్చవిశేషతః॥
౧౭॥ సంఘునతిష్ఠరాజేంద్ర మిత్రబాంధవసయుతః। శ్రుత్వాగజ
పతిస్సమ్యగ్దూత వాక్యంసభూపతిః॥ ౧౮॥ మంత్రిభిస్సహసమం
త్రస్యదేశస్థాంశ్చ భూపతీన్। సమానీయచతైస్సాకం సమంత్రిచ
ప భూపతిః॥ ౧౯॥ ఏషనందోఽహబలవాన్ యుద్ధేజేతుం నశ
క్యతే। తస్యచక్రుర్నమస్కారంతే భూపానంద భూపతేః॥ ౨౦॥
తంహిత్వానంద భూపాలః సర్వసైన్యసమావృతః। ఆర్యావర్తా
తికాన్ దేశాన్ గమిష్యతిరాజకాన్॥ ౨౧॥

ఆర్యావర్తదేశగమనమ్.

శ్లో॥ ఏవంతాస్తాంచ భూపాలాన్నమిష్యతిన సంశయః। మమకార్యో
నమస్కారఇతివాచం సుదారుణాం ॥ ౨౨॥ సూర్యవంశోద్భ
వా భూపాశ్శ్రీత్వారోష సమన్వితాః। యుద్ధాయైహితే సర్వే
కరిష్యంతి హినిశ్చయం॥ ౨౩॥ తేషాంనామాని వక్ష్యామి శ్రు
ణుభూప సమాహితః। సాళంశ్చదాపలశ్చైవ నాగఫుర్యధిపోవ
రా॥ ౨౪॥ మండకః కటకాధీశః పత్తిపాతశ్చభూపతిః। గయా
ధీశాధిపోవీరో దండకారశ్చ భూపతిః॥ ౨౫॥ దండకారశ్చ కే
దార దేశరాజశ్చ వీర్యవాన్। చిత్రకూటాధిపోవీరో మంథనా
థశ్చ భూపతిః॥ ౨౬॥ అంధతీదేశనాథశ్చ కాకలోహీర భూ
పతిః। బ్రహ్మావర్తాధి పోవీరోరంతిలారశ్చ వీర్యవాన్॥ ౨౭॥ ఏ
తేచాన్యేచ బహువస్సభూయకః త్రియోత్తమాః। నందభూపేన
భూపాలాః యుద్ధంకృత్వాది నత్రయం॥ ౨౮॥ జితాస్తేన మ
హారాజన్ కారాగృహ ప్రతిష్ఠాశ్చకారయిష్యతి శాసనాత్। కా
రాగృహేవర్తమానా స్సాహారపరివర్జితాః॥ ౨౯॥ క్షత్రవేష

విహీనాశ్చ శస్త్రాస్త్రపరివర్జితాః। స్నానసంధ్యా విహీనశ్చహో మకర్మవివర్జితాః॥ 30॥ వేదోక్తాచారహీనాశ్చ శూద్రాచారైకతత్పరాః। శూద్రాన్నితోదకం సమ్యగ్గృహ్యమానాశ్చ భూమిపాః॥ 31॥ మత్స్యమాంస సాదనాశ్చైవ శూద్రా ఇవ శిఖావృతాః। కారయిష్యంతిరాజానః శాసనాన్నంద భూపతేః॥ 32॥ ఏకఛత్రాంస పృథివీం అనుల్లంఘితశాసనః। సంవత్సర శతంనందః పాలయిష్యతి మేదినీం॥ 33॥ కారాగృహే వర్తమానాః పంచాశద్వత్సరాత్పరం। సాంఖ్యప్రముఖరాజానో హైన్యవృత్త్యైకజీవినః॥ 34॥ నందస్యచ నమస్కారంకృత్వా ముక్తాశ్చతేనవై। నియోజితాశ్చతేనైవ నందేనైవ దురాత్మనా॥ 35॥ కృషికర్మపరాశ్చైవ భవిష్యంతిన సంశయః। కించిత్కాలం హితత్రైవ స్థిత్వా సాంఖ్యముఖానృపాః॥ 36॥ వింధ్యస్యదక్షిణేభాగేనము ద్రపాంతమండితాన్। కళింగాంధ్ర విదర్భాంశ్చ దేశానాగత్య భూమిపాః॥ 37॥ తదాదిభూమిపాలాశ్చ సూర్యసోమ సముద్భవాః। పూర్వోక్తేన ప్రకారేణ భవిష్యంతివ నంశయః॥ 38॥ దాక్షిణాత్యాశ్చోత్తరికాః। ప్రాచ్యాః పూర్వదిశిస్థితాః। సోమాన్వయ సముద్భూతాః తస్యనందస్య భూమిపాః॥ 39॥

తే॥ శూద్రియందు మహానందిసుతుని గాంచె. సర్వరాజాంతకుండు శౌర్యశాలియతడు, ఖ్యాతిగాంచె మహాపద్ముడనగ జగతి, నది మొదలు శూద్రయోనులై యఖిలనృపులు, 429 క. ఏకచ్ఛత్రంబుగ నతడేకద యీభూమి నెల్ల నేలంగలుగున్, భూకాంత మౌళికీర్తి రమాకలితుడు సర్వమాని మాన్యుడు సుండీ. 430

ఇదియునుంగాక శ్రీమద్భాగవతము ద్వాదశస్కంధము ప్రథమాధ్యాయమునగూడ యిట్లుచెప్పబడియున్నది.

శ్లో॥ మహానంది సుతోరాజన్ శూద్రాగర్భోద్భవోబలీ। మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్రవినాశకృత్॥ 8॥ తతోనృపాభవిష్యంతి శూద్రప్రాయా అధార్మికాః॥ 9॥ ఏకచ్ఛత్రాంసపృథివీమ

నుల్లంఘిత శాసనః । శాసిష్యతి మహాపద్మో ద్వితీయః భార్గవోరివ॥ ౯॥

ఈబూర్వోక్తమైన భవిష్యోత్తర గాధయగు బురాణగాధలో నందుడను నొకరాజుండెనట్లును. అతడు శూద్రస్త్రీపుత్రుడగుటంజేసి దేశమునందుగల క్షత్రియులనందరిని దనలో సంబంధ బాంధవ్యములను జేయుమనియును అట్లు జేయకున్నచో దనతో యుద్ధమునకురండనియును వర్తమానములను బంపుచుండెను. ఇట్లు బంపుటలో మొదటనుగజపతివద్దకు తనదూతనబంపెను. ఆదూత గజపతి సమీపమునకు వెళ్ళి నేను నందునిచే బంపబడినదూతను, ఆనందునిచే బుత్తెంచిన వాక్యము లేమన్నను నీవును నీబంధువులును నాకు నమస్కారముజేసి నాతో సంబంధబాంధవ్యములను జేయుదురేని నిన్నును నీబాంధవులను రాజ్యపాలనముజేసుకొనునట్లు అనుజ్ఞయిచ్చెదము. అట్లుగానిచో యిపుడే రాజ్యమునుండి పదచ్యుతుని జేసెదము. అనియిట్లు జెప్పగనరికి నాగజపతి తనకనుకూలురగు మఱికొందఱితో కలిసి నాలోచించగా నానూర్యవంశోద్భవులగు రాజులామాటలు వినినతోడనే రోషసమన్వితులై ఆనందునితో యుద్ధముచేయుటయే యుక్తమని నిశ్చయించి అందులకు తగు ప్రత్యుత్తరమునుజెప్పి నాదూతను బుత్తెంచిరి. అటుపిమ్మట గజపతియును సాంఖులుడు దాపలుడుఅను నాగపురిపట్టణమునకు బ్రభువులగు నీయుభయులును కటకమునకు ప్రభువుగనుండు మాదకుడును, పత్తిపాడుకు ప్రభువుగయుండు రాజును, గయాపట్టణమునకు బ్రభువుగనుండునట్టి వాడును, దండకారుడనురాజును, కేదారదేశమునకు ప్రభువగువాడును, చిత్రకూటమునకు ప్రభువగువాడును, మధనాధుడను భూపతియును, అంధతీ దేశమునకు బ్రభువగువాడును, కాశలోహారమునకు బ్రభువగువాడును, బ్రహ్మావర్తమునకును అంతిలారమునకు ప్రభువులగువారును మఱియు నేదరోనకేకమంది రాజులును ఒకటిగజేరుకుని ఆనందునితో నూరాజులు యుద్ధములుజేసి శత్రువు బలముగలవాడగుటచే నోడిపోయిరి, అటుపిమ్మట నానందుడు జయమును పొందినవెంటనే వీరల

ను కారాగృహమునయుంచునట్లు శాసించెను. అటుపై కారాగృహము నందుండు యీసూర్యవంశజులగు రాజులను తమయొక్క యాచారమును వదిలినవారుగను, క్షత్రియ వేషమును వదిలినవారుగను శస్త్రాస్త్రములను వదిలినవారుగను, స్నానసంధ్యాది హోమాదికర్మలను గూడ వదిలిన వారుగను, వేదోక్తాచారములను వదిలినవారుగను, శూద్రాచారైక తత్పరులుగను, శూద్రులచే ఆనీతమైన ఉదకమును త్రాగువారుగను, మత్స్యమాంసములను భక్షించువారుగను, చేయుటకై నందుడు ప్రయత్నించి ఆప్రకారము శాసించెను. ఈనందుడు యీపృథివిని అనుల్లంఘిత శాసనుండై నూరుసంవత్సరములు పరిపాలించెను. అటుపిమ్మట కారాగృహమునందుండు రాజులు ఏబదిసంవత్సరములు జయులులోగడపిన మీదట యీహైన్యవృత్తిచే జీవించుటకంటె ।సూ॥ బలీయాంసం ప్రణమేత్ అనిచ్ఛతిపలాయనమ్। అనగా శత్రువునకు భయపడి యుద్ధమునందు పరిగిడుటకు ఇష్టములేక పోయినను శత్రువుబలవంతుడై యుండినప్పుడు శరణుబొందినచో రక్షించునని దోచినపక్షమున నమస్కరించుటయోగ్యము, అనునీ రాజనీతిననుసరించినందునికినమస్కారముజేసిరి. ఆదురాత్ముడైన నందుడునమస్కరించినను వీరలనుకారాగృహమునుండి వదిలిబెట్టి మీరెల్లరును కృషికర్మయొనర్చి జీవించుచుండ వలయుననియు, వింధ్య పర్వతమునకు దక్షిణభాగమునయుందు సముద్రప్రాంతభూములగు కళింగాంధ్ర విదర్భ దేశములయందు నివసించియుండవలయుననియు, ఇట్లు శాసించి కారాగృహమునుండి విముక్తులనుజేసెను. ఇవ్విధమున బైట వచ్చిన ప్రచ్ఛన్న రూపధరులగు యీక్షత్రియులు తాముసూర్యవంశజులగు క్షత్రియులమని గుర్తెరుగుటకు కూర్మశబ్దవాచకమును తద్భవముగ మార్చుకొని కమ్మవారనియు, కాంపిల్య దేశమునుండి వచ్చినవారగుటచే కాపువారనియు, పద్మశబ్దములను తద్భవముగజేసుకొని, వెలమవారనియు, రాట్ శబ్దమును తద్భవముగ జేసుకొని, రెడ్డి వారనియు మొదలగు నామములచే వ్యవహరింపబడుచు బూర్వోక్తములైన దేశములయందు స్థిరవాసము లొనర్చుకొని ప్రచ్ఛన్న రూపధరులై యుండు

టచే కమ్మవారు కాపువారు వెలమవారు రెడ్డివారు యీ మొదలగు వారిని కూర్మకులావతంసులగు సూర్యవంశజులగు క్షత్రియులై యున్నా రని మీకునొక్క వక్కాణించుచున్నాము.

౨౦ ఈవిషయములో పాఠకమహాశయులకు కలుగు సందేహ ము లొకటి రెండు గన్పడుచున్నవి. అవి యెవ్వియనినచో బూర్వోక్త మైన గ్రంథమున సచ్ఛూద్రులవలన భుజింపవచ్చుననిజెప్పియుండి ఇప్పు డు శూద్రాన్నోదకమును గ్రహించుట దూష్యమని వ్రాయుట నొక విచిత్రముగ మీకుదోచవచ్చును. ఇందులకు సమాధానమేమనినచో కలియుగమునకు విధించిన పరాశరస్మృతిలో సచ్ఛూద్రులవలన బ్రా హ్మణాదులు భుజించవచ్చునని జెప్పియుండినను వృద్ధపరాశరమను గ్రం థమున కలివర్జితములలో సచ్ఛూద్రులవలన భుజించుటగాని నీరుత్రా గుటగాని కూడదనియీక్రింది శ్లోకముచే దెలియుచున్నది.

శ్లో॥ బ్రాహ్మణాదిషు శూద్రస్య పచనాది పరిక్రియా।
వృద్ధపరాశరస్మృతి॥ ౨౧ శ్లోకము.

అనగా బ్రాహ్మణులు మొదలైన మూడువర్ణములవారి గృహ ములయందు శూద్రులవంట మొదలగు క్రియారూపమైనసేవ కూడదు. అనియిట్లు వృద్ధపరాశరస్మృతియందు జెప్పబడియున్నది. ఈవృద్ధపరా శరస్మృతియందుజెప్పిన కలినిషేధ ధర్మములు నందునికన్న బూర్వము నెంతయోకాలము క్రిందట ఏర్పడినది. అందువలన నందునికాలమప్ప టికి ద్విజాతులకు శూద్రసంపర్కము నిషేధమని వ్రాసినవచనముయు క్తమైయున్నది. ఈకలివర్జితములు నందునికన్న బూర్వమందుండిన శ తానీకుని పరిపాలనకాలమప్పు డేర్పడినట్టును, ఇట్టిశతానీకుని పుత్రుడగు అశ్వమేధదత్తు పరిపాలన కాలమప్పుడు స్వార్థపరులగువారు కొందఱు గ్రంథములలో కల్పితములు జేసిరనియు ఇట్లుగ చిత్రాభ్యుదయాది గ్రం థకర్తయు, మనోరంజనీ సంపాదకులగు కాళ్లకూరి నారాయణరావు గారిచే డిల్లీసామ్రాజ్యమను గ్రంథమున నీక్రింది విధమున జెప్పబడి యున్నది.

శతానీకమహారాజు ఇతడు జనమేజయుని కుమారుడు తల్లిపేరు వపుష్ట ఇతడు యాజ్ఞవల్క్యుడను నొక యుపాధ్యాయుని కడ విద్యాభ్యాసముచేసి తనపూర్వుల కీర్తికి తగురీతిని వర్తించెను. భారతమునకు జాలప్రతులు వ్రాయించి దేశమున బంచిపెట్టించెను. ఒకప్పుడీత డొంటరిగ నడవికి వేటాడబోయి పడదగిలి యొకచెట్టుక్రింద బడిపోయెనట. శబరాంగనయొర్తుకయా చేరువ నరుగుచు నతనింజూచి జాలిపడి యుపచారముచే సెదదేర్చ్య నతడామె యోగ్యతకు సంతసించి తనపురమునకు దోడుకొని పోయి పెండ్లియాడెనట. ఈతడశ్వమేధమునుగూడ జేసెను. ఈతనియాధిపత్యముక్రింద నొక గొప్పపండిత పరిషత్తుజరిగి కలివర్జములు ఆసభయందు నిర్ణయింపబడెనని చెప్పుదురు.

అశ్వమేధ దత్తమహారాజు ఇతడు శతానీకుని కుమారుడు తల్లి పేరు వైదేహి తనయశ్వమేధ యాగానంతరమున బుట్టినవాడగుటచే శతానీకుడితని కశ్వమేధదత్తుడని నామకరణముజేసెను. ఇతడు ప్రమత్తుడు, స్త్రీలోలుడు, పూర్వుల సుగుణము లీతనియందులేవు. ఈతనికాలమునందే స్వార్థపరాయణులు కొందఱు బయలువెడలి పూర్వగ్రంథములయందు బ్రాహ్మణ ప్రభవాదులం గొన్నిటి నధికముగ జేర్చిరనియు, వారితరువాత గొందఱు బయలువెడలి పూర్వగ్రంథములరూపములనే మార్చిరనియు గొందఱు చెప్పుదురు.

డిల్లీ సామ్రాజ్యము 30 పత్రము.

ఈయభిప్రాయమున మేమును ఏకీభవించి వృద్ధపరాశరాదిగ్రంథములు అభూతకల్పనలతో యున్నవనిజెప్పుచున్నాము. అయిననుయీ కలివర్జములు శతానీకుని పరిపాలనదివసము మొదలుకొని నేటిదివసము వరకు వాడుకలోనుండుటచే ఈమధ్యయుగముననుండినట్టె నందునకాలమువరకును వాడుకలోనుండుటచేతనే యీకూర్మకులావతంసులను శూద్రానీతోదకమును త్రావించెనని వ్రాయుట అతిశయోక్తి కాజాలదు.

ఈసందుని జన్మనుగూర్చి విష్ణుపురాణము మార్కండేయోత్తర పురాణములు యీక్రిందివిధమున జెప్పుచున్నవి.

శ్లో॥ ఆరభ్యభవతోజన్మ యావన్నందాభిషేచనమ్। ఏతద్వర్ష సహస్రంతుశతంపంచదశోత్తరమ్॥ మార్కండేయోత్తరపురాణము.

శ్లో॥ యావత్పరిక్షితో జన్మయావన్నందాభిషేచనం। ఏతద్వర్ష సహస్రంతు శతంపంచదశోత్తరమ్॥ విష్ణుపురాణము.

అనగా ఓపరిక్షన్మహారాజా నీజన్మము మొదలుకొని నందునిపట్టాభిషేకపర్యంతమగు కాలము ౧౧౧౫ వేయి నూటపదునైను వత్సరముల కాలముబట్టును. అను నీప్రకారము విష్ణుపురాణము జెప్పుచున్నది. ఈవిష్ణుపురాణమునందు, శ్లో॥ ఏతద్వర్ష సహస్రంచజ్ఞేయం పంచదశోత్తరమ్॥ అని మరియొక పాఠము గన్పడుచున్నది. ఇట్లగు నెడల పరిక్షితునిజన్మ మొదలుకొని నందునిపట్టాభిషేక కాలమువరకు ౧౦౧౫ సంవత్సరము లగుచున్నవి. ఈవిషయము విచారణీయాంస మగుటచే గ్రంథవిస్తరభీతి యగునని విరమించితిమి. మరియును గొన్నిపురాణములలో సూర్యవంశక్షత్రియులు కలియుగమున అపద్ధర్మముచే కొన్ని గోత్రములవారు ప్రచ్ఛన్నరూపమును ధరించి యుందురని యీక్రింది వాక్యములు జెప్పుచున్నవి.

శ్లో॥ వశిష్ఠః కౌండిన్యధనంజయానాం। గోత్రోద్భవాకాశ్యపగోత్రజాతాః॥ శూద్రా ఇవాత్యంత గృహీతవేషాః భూపా భవిష్యంతి కలౌయుగేహి॥

శ్లో॥ కలౌయుగేస్నాన విహీనకాశ్చ। సంధ్యాదివేదోక్తసుకర్మహీనాః। సద్గాదికోపేణ వివర్జితాశ్చ। భూపా భవిష్యంతిహి చిత్రకేతో॥

అనగా వశిష్ఠ కౌండిన్య ధనంజయ కాశ్యపగోత్రజాతులగు క్షత్రియులు కొందరు శూద్రులవలె ప్రచ్ఛన్నరూపమును ధరించి భూపతు

లై యుందురనియు, మఱియును స్నానసంధ్యాది వేదోక్తసత్కర్మశూన్యులై భూపరిపాలన మొనర్చుచుందురనియు, యిట్లు జెప్పియుండుటచే బూర్వోక్తములైన ప్రమాణముల ననుసరించి ఆపద్ధర్మముల వలన ప్రచ్ఛన్నరూపమును ధరించి సంచరించుచుండు ఈకమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు యీమొదలైనవారు కూర్మకులావతంసకులగు క్షత్రియులై యున్నారని తెలియజెఱచుచున్నాము.

మరియు నింతకుబూర్వము ౭౭ పత్రమున బ్రహ్మాండ (బ్రహ్మానంద) పురాణములోని కలిధర్మ ప్రకరణమునందు జెప్పిన కథాభాగమునకున్, మరియును ౧౩౧వ పత్రమున మార్కండేయోత్తర పురాణమున జెప్పినకథాభాగమునకును, పాఠకమహాశయులురగు మీకు దారతమ్యములు దోచకమానదు. ఈరెండుగాధలయందు యిట్లు తారతమ్యములుండినప్పటికిని యీరెండుగాధలయందును వీరుసూర్యవంశజులైన క్షత్రియులై యుండిరనుటయందున, ఆపద్ధర్మమువలన ఉత్తర ప్రాంత భూముల నుండి దక్షిణ ప్రాంతభూములకు వీరు చనుదెంచిరనుటయందును, ఒక యభిప్రాయమును సూచించుచున్నది. మరియు మిగతవిషయములలో నీరెండుగాధలయందును గొన్ని తారతమ్యములు గన్పట్టుచున్నవి. ఇట్టి తారతమ్యము లష్టాదశపురాణములయందును బెక్కుస్థలములలో గన్పడుచున్నవి. అట్టివిషయములనుగూర్చి వ్రాయుటకు గ్రంథవిస్తర భీతిచే వ్రాయనైతిమి. ఇందున ఉదహరించిన గాధలు రెండిటిలో బూర్వగాధకన్నను, రెండవ గాధయందు ఈకమ్మవారు మొదలగువారు ప్రచ్ఛన్నరూపమును ధరియించుటకు సరియగు కారణమును వెలిబుచ్చియుండుటచే మనమీరెండవగాధను ముఖ్యముగ గమనించతగియున్నది. ఈరెండవగాధను ప్రమాణమైనదానిగ నెన్నుట యెప్పుడు గలిగినదో అప్పుడు ఈకమ్మవారు మొదలగువారు ప్రచ్ఛన్నరూపములను ధరించిన కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారని జెప్పుట కేయభ్యంతరముండజాలదని వ్రాయుచున్నాము.

ఈపూర్వోక్తాభిప్రాయములలో గొన్నిటిని మీరు గమనించ గలందులకై పాశ్చాత్యపండితుల యభిప్రాయములున్న ఈకూర్మకులావతంసకులగు కమ్మవారు మొదలగు వారి విషయములందు సామ్రాజ్యాధిపతులు ప్రకటించిన ప్రకటనలయొక్క అభిప్రాయములను ఈక్రింద నింగ్లీషుభాషయందు యథామాత్రుకగ వ్రాయుచున్నాము.

ఆయభిప్రాయములను మీరు కచ్చగ గ్రహించి మాయభిప్రాయమునసరించి ఈకమ్మవారు మొదలగువారు కూర్మకులావతంసకులగు సూర్యవంశజులైన క్షత్రియులై యున్నారని గ్రహించుటకై మిక్కిలి మక్కువతో బెక్కువిధంబులగోరి వ్రాయుచున్నాము.



## ADDITIONAL EXTRACTS FROM ENGLISH BOOKS WRITTEN BY EUROPEAN SCHOLARS.



### HUNTER'S STATISTICAL ACCOUNT OF BENGVL, VOL. XI. PAGES 46 AND 47.

"Kurmis though generally engaged in agriculture, make good soldiers, and were a good deal employed as such before the Mutiny."

"Mr. Magrath suspects that Kurmis are found in Madras, Chhuta Nagpur, Orissa, and among the Marathas."

"Sivaji was a kurmi and the Rajas of Gwalior and Satara are said to be of the same race."

"Kurmis make good soldiers and before the Mutiny many of them were so employed."

### II—DALTON'S ETHNOLOGY OF BENGAL.

"In the Province of Chutia Nagpur, the ancestors of the people now called Kurmis appear to have obtained a

footing among the aboriginal tribes at a very remote period and in more than one part of Mandhum have supplanted them.

"There are traditions of struggles between them and the Kolarian aborigines of these regions, and though the latter generally managed to hold their own, we find in some places Kurmi villages established on sites which we know from the groups of rude stone pillars or cenotaphs still conspicuous, to have been once occupied by bhumiji or Mundas, and in other places vestiges of ruined temples appertaining to Hindu and Jain settlements, both most likely belonging to successive generations of Kurmis, amidst villages that have for ages been occupied by Bhumij. The Kurmis settled in the Western part of Mandhum told me they had been there fifty-two generations. The PANCHET Raja claims just so many descents from the deserted child that is said to have founded his race. A babe was discovered in the woods by the Kurmis drawing its nourishment from a cow. This babe they took and brought up, and afterwards adopted as their Raja. As the family cannot trace back their origin rationally outside the limits of the District and as there is no particular reason for supposing them to be Bhumij or Munda, I think that they are more likely to be of Kurmi extraction than descended from the cow-nurtured foundling."

Carney's Races, Tribes and Castes of Oudh.

"Well-to-do members of these classes adopt the honorary distinction of Chowdhri. There were formerly many and still are some Kurmi landed proprietors in Oudh. A Tupa sub-division containing more than 50 villages was formerly owned by them in Fyzabad."

Elliot's History, Folklore and Distribution of Races, N, W, P., and Oudh.

"There are several Kurmis or Kunbis among the Marathas and the Gwalior as well as the Satara families are of that stock."

Reverend Sherring's Tribes and Castes, Vol. I. Pages 156—157.

(N. W. P. and Oudh and Bengal.)

Kumbhi.

"In some parts of the country members of this caste have large possessions in land. in the year 1848, out of 31 estates of which the parganna of Dhata in the Fatehpur District was composed, no fewer than twenty-seven were in the hands of the Kumbhis, there called Kurmis, which circumstance, it was rightly conjectured, was the chief cause of the thriving condition of that Parganna,"

Bombay Presidency and Central Provinces.

"The Kurmis & Kunbis are in reality one class of people, and yet are known in various parts of the country by these separatė designations, and under them are sub-divisions into numerous tribes, some of which do not intermarry. They are very industrious and persevering, commonly thrifty and fruga, and living in the enjoyment of health and much social comfort,'

The Principal Nations of India.

"The Kunbi is fond of asserting his independence. The following are some of his proverbs: "Where it thundori there the Kunbi is a landlord;" "Crores follow the Kunbs but the Kunbi follows no man." *

*Sinapur Seuttlement Rel or,73; Lunknow Seuttlement Repart, 128.

W. Crooke's Tribes and Castes of N. W. P. and Oudh

"Colonel Dalton regards the Kurmis of Bihar as some of the earliest Aryan colonists of Bengal, a brown tawny coloured people, of an average height, well proportioned rather highly framed, and with a fair amount of good looks."

"In Oudh† they (Kurmis) have traditions of having been landowners before the Rajout conquest and Mr. Butt remarks that the same is the case iu Lucknow."

"In Gorakhpur are found the Patanwars. Saithwars, whom Doctor Buchanan identifies with the *Audhias* of Behar who claim there to be of the highest dignity and the purest blood and are usually cultivators, whilein Bengel they often enlist in the native army or serve as constables."

Bombay Gazetteer, Satara, Vol. XIX, Page 75.

"Marathas are found all over the district. The 1881 Census includes them under Kunbis from whom they do not form a separate caste. The distinction between Kunbis and Marathas is almost entirely social, the Marathas as a rule are better ofl and preferring war and service as constable or a messenger to husbandry, The Satara Marathas seem to have no histories or legendary evidence as to when and from where they came in to the district. Though somewhat fairer in colour and more refined in manners as a class cannot be distinguished from Kumbis with whom all eat and the poorer marry."

Bombay Gazetteer, Belgaum, Vol, XXI.

Page 126.

"The Marathas are returned as numbering 11,9,300 and are found all over the district. They have come in to the district from Satara and other parts of the Deccan...They wear the sacred thread and are careful to perform the regular Hindu observances. Cultivating Marathas are called Kunbis or Kulvadies...The Marathas have no objection to dine with them but they do not as a rule intermarry. There is no objection to a son of Maratha marrying Kunbi daughter; and occasionally daughters of poor Marathas are given in marriage to a rich Kunbi...The Marathas are hard working, strong, and hardy and hospitable, but hot tempered. As soldiers they are brave and loyal...They are landholders, husbandmen, pleaders, traders, labourers, soldiers, writers, messengers and servants."

Bombay Gazetteer, Khandesh, Vol, XII,

Page 68,

"Marathas are said tol have originally come from Nasik, Poona, Satara and Ahmadnagar during the reign of the last Peshwa; are of 2 classes...Though generally called Marathas, they have special surmanes known to familiar friends, such as Gaekwar, Mahante, Jagtap, Sinde, Nimbalkar and Paver. They eat with Tilola or Tilora Pajna and other Kunbls."

Bombay Gazetteer, Kolhapur, Vor. XXIV,

Page 65,

"Marathas are returned as numbering 62287 and are found over the whole State. The Kolhapur Marathas have

a special interest as their head the Maharaja of Kolhapur is the only representative of Sivajee the founder of the Maratha power...Marathas cannot be distinguished from Marathi speaking Deccan Kunbis with whom all eat and the poorer intermarry...Kolhapur Marathas claim to belong to 4 branches or vnns as, Brahma vuns or the Brahma Branch. Shesh vuns or the Serpent branch, Som vuns or the Moon branch and Surya vuns or the sun branch."

"At the khati feast Marathas sit in full dress each with a sword by his side. Marathas do not allow widow marriage, know nothing of polyandry, and practise polygamy."

Imperial Gazetteer of India, New Edition, Vol V. Pages 97 and 98. Ahmadabad District.

"The Kunbis who number 101000 are an important class. Some have risen to high positions in Government service or have acquired wealth in trade but the majority are engaged in Agriculture and form the greater part of the peasant proprietors in Gujrat. There is no real difference of caste between Kunbis and Patidars though Patidars will not now intermarry with ordinary Kunbis. The latter are divided inlo 3 classes—Levas Kadvas, Anjans. Female infanticide owing to the ruinous expenses attached to marriage having been found prevalent among the Kunbis, the provisions of Bombay Act VIII. of 1870 were applied to the Kadva and Leva Kunbis. Next in position to the Kunbis are the Rajputs."

Vol. VIII, Bombay Presidency, Pages 300 and 304.

"The general proportion of females recorded in 1901 is 938 to 1000 males in British Districts. In Sindh the

proportion is very low. An excess of females over males is noticeable among the low castes and wild tribes. Infanticide formerly prevailed among the Rajputs and Kunbis of Gujrat but is believed to be no longer practised. The cause of this barbarous practice was the difficulty of securing bridegrooms form the sections of these castes with whom custom prescribed that intermarriage should take place."

"The Marathas consist of 1900000 Kunbis, 350000 Konkanis, and 1500000 Marathas not otherwise specified. The term Maratha is in some respects loosely applied, that it is difficult to determiue its precise significance. It is variously used to describe members of the various castes living in Maharashtra those whose mother tongue is Marathi and more correctly perhaps, to designate the descendants of Sivaji's warriors including the Maratha Kunbis and below-Ghat Maratha who were the backbone of the Peshwa's Confederacy. It is the common impression at the present day that the Marathas properly so called aro divided in to two groups which do not intermarry, but Kunbi or agriculturist being the inferior, and the warrior, landowner or high class Maratha claiming superior origin............But the dividing line is not of the nature of permanent barrier and can be passed by wealthy Kunbis with ambition in proportion to their means."

Revd. Sherring's Hindu Tribes and Castes, Vol. III P. 253.

The Unity of the Hindu Race.

"The Kumbhi, or Kurmi caste as it is variously styled, is in point of numbers the principal branch of the cultivating castes, aud, as every body acquainted with the subject knows, is a very fair representative of all suchcastes The Kurmi his a strong bony hand natural to a man of his

employment. His complexion is of a deep Mahogany colour, never black nor approaching to it. He is sometimes and in Upper India frequently, tall and powerful, is manly, out-spoken, and independent in manner and is altogether free from the cringing obsequiousness so peculiar to many of the self-contemning outcasts below the Sudras. As a drow-back to this, he is rather dull of intellect which is no matter of surprise considering the nature of his duties, which in every country exercise a deadening influence on the understanding. These castes exhibit various qualities, not seen in lower castes, and forming striking characteristics of the higher. They are free from the servility and sense of fear, amounting frequently to terror which are so distressingly visible among the outcaste races in their intercourse with the superior castes."

GOVERNMENT ORDER, No $\frac{251}{\text{VIII--186 A. 6}}$ dated 21st March 1896 to the Inspector General of Police, N. W. P., and Oudh.

Police Department.

"3 His Honor is however, of opinion that Kurmis constitute a respectable community which he would be reluctant to exclude from Government service."

ఇతి శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతీ
కృతిషు సుభాషావిభూషితాయాం జయార్థప్రకాశి
కాయాం కూర్మక్షత్రియ నిరూపణ విషయే
ఇతి వాస పరే ప్రచ్ఛన్నరాజకుల నిర్ణ
యాఖ్యే తృతీయభాగే తృతీయః
సముల్లాసః సంపూర్ణః.

ఓమ్.

# జయార్థప్రకాశిక.

---

## చతుర్థసముల్లాసము.

అస్మద్దేశస్థితార్యవర్యులారా!

౧ మేలుఁజెందుటకు ముఖ్యసాధనము ధర్మము అట్టిధర్మమునుదె లుపుటకు మూలప్రమాణము వేదము. అట్టివేదమున వాదుకవలసినయర్థమును సులభముగా దెలుపుటచే స్మృతియును ధర్మమునకు ముఖ్యప్రమాణమనంబడుచున్నది. అందువల్లనే,

శ్లో॥ శ్రుతిస్తువేదోవిజ్ఞేయోధర్మశాస్త్రంతు వైస్మృతిః।
తేసర్వార్థేష్వమీమాంస్యేతాభ్యాం ధర్మోహినిర్బభౌ॥
మనుస్మృతిః ౨ అ. ౧౦ శ్లోకము.

అని మనుస్మృతియు నీప్రకారము నొక్కి వక్కాణించు చున్నది. ఇంతియేగాక పరాశర మాధవీయమందును నైవిధినే దెలియ బడు చున్నది.

శ్లో॥ శ్రుతింపశ్యంతిమునయః స్మరంతిచ తథాస్మృతిం।
తస్మాత్ప్రమాణ ముభయం ప్రమాణైః ప్రమితంభువి॥
పరాశరమాధవీయము. ౨ పత్రము.
మఱియును ఇందునకు గాళిదాసుకూడ,

శ్లో॥ శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్॥ రఘువంశము ౨ సర్గ.

అను నీవాక్యముఁజెప్పి సాక్ష్యమిచ్చుచున్నవాడు. ఈవిచారణవలన శ్రుత్యర్థమే స్మృతి ప్రతిపాదింపబడుచున్నదని దెలియబడినది.

౨ ఇట్లు శ్రుత్యర్థమునే స్మృతులన్నియు బోధించు నెడల శ్రుతిస్మృతులనిధర్మశాస్త్రములు రెండువిధముల జెప్పుటకు కారణమేమైయుండునోయని మీకు బూర్వమువలె శంకపొడమును. ఇందులకు బ్రత్యు

త్తరమేమన్నను శ్రుత్యర్థ పరిజ్ఞానాశక్తులగు వారల కుపకరించునట్లు వై
దికభాషయందు నిగూఢములై గంభీరార్థయుక్తములగు నాచారవ్యవ
హారములను లౌకిక సంస్కృతమున భిన్నభిన్న కాలములలో వేఱువేఱు
ఋషులచే నప్పటప్పటి దేశకాలజనితాధి భావముల కనుగుణ్యమగునటు
లు సర్వజ్ఞులైన ఋషులచే స్మృతిరూపముగ రచింపబడినదనునదియే ము
ఖ్యకారముగాని మఱొండుకారణము గన్పట్టుట లేదు.

ఈవిషయమునుగూర్చి నీమధ్య రేపల్లి తా॥ మైనేనివారిపాలెము
లోను బందరునోబిల్ కాలేజి సంస్కృతపండితులగు బ్రహ్మశ్రీ శిష్ట్లా నృ
సింహశాస్త్రుల్లవారు మాతో 1919 సం॥ డిసంబరు నెల 25, 28 తేదీలలో
బూర్వోక్తవిధిననుసరించి స్మృతులు రచింపబడి యుండలేదనియు, పూ
ర్వమొకానొకప్పుడు వేదములలో కొంతభాగము నశించినదనియు, ఆ
నశించినభాగమును పూర్తిజేయుటకై సర్వజ్ఞులగు మహాఋషులు దివ్య
జ్ఞానమువలన కనుగొని అఖిలమైన శృత్యర్థములనే స్మృతిరూపముగ ర
చించిరని వక్కాణించియున్నారు. ఇట్లు శ్రీశాస్త్రులవారు జెప్పిన వచ
నము సరియైయుండలేదనిమాత్రము వక్కాణించుచున్నాము. ఏలయ
నినచో సర్వజ్ఞులగు మహాఋషులు ఖిలమైన శ్రుతులననుసరించి స్మృతు
లను రచించినదే నిశ్చయమైయుండినచో యీస్మృతులు అన్నియుగము
లయందును మార్పులను జెందక నొకేవిధముగ నుండవలయును. ప్రస్తు
తమట్లుగాక నీక్రిందిప్రమాణము ననుసరించి దేశకాలజనితాధి భావము
లనుబట్టి యుగయుగమునకు భిన్నభిన్నస్మృతులను రచించినట్లుయాక్రిం
ది ప్రమాణవచనము గన్పడుటచే శ్రీశాస్త్రులవారు జెప్పినట్లు చెప్పు
టకు వలనుపడదని జెప్పియున్నాము.

శ్లో॥ కృతేతుమానవాధర్మాః త్రేతాయాం గౌతమాస్మృతాః। ద్వా
పరేశంఖలిఖితాః కలౌ పారాశరస్మృతాః ॥ పరాశరస్మృతి.
౧ అ. ౨౧.

ఇదియునుంగాక నొక పరాశరస్మృతిని దృష్టాంతముగ గ్రహిం చి తదితరస్మృతులనుగూర్చి అనువాదించి జూచెదము. సర్వజ్ఞులగు ప రాశరమహాఋషి దివ్యజ్ఞానము వలన ఖిలమైన శ్రుత్యర్థములను సంగ్ర హించి పరాశరస్మృతిని జెప్పినదే నిశ్చయమై యుండినచో నీకలియుగ మునకా పరాశరస్మృతియందుదహరించిన ధర్మములన్నిటికిని మార్పుల ను జెందకయుండవలయును. ప్రస్తుతమట్లుండక వృద్ధపరాశరస్మృతియ ని నొకగ్రంథము గన్పడుచున్నది. అందున పూర్వోక్తపరాశరస్మృతి లో వచించిన ధర్మములను ఖండించుకొని నవీనధర్మములను గొన్నిటిని స్థాపించుకొనినట్టు నాగ్రంథమువల్లనే దెలియబడుచున్నది. ఒకవేళ శ్రీ శాస్త్రులు-వారీ క్రిందిప్రమాణములను జూపించి వారివాదము నెగ్గించు కొనదలచిరేని ఆప్రమాణవచనములు మావాదమునకు బాధకము కలు గజేయ జాలవు.

శ్లో॥ కైలాసశిఖరేరమ్యే సర్వదేవర్షిసంయుతే। దర్భాసనేస మాసీన మృషిభిః పరివారితం। సర్వవేదార్థతత్వజ్ఞం సర్వశాస్త్ర విశా రదం। సర్వధర్మప్రవక్తారం వృద్ధపారాశరంమునిం। మనుసంవ ర్తహారీత యాజ్ఞవల్క్యపారాశరాః। ఋషయస్తు సమాగమ్య పప్రచ్ఛుధర్మకాంక్షయా॥

ఇందులకర్థమేమన్నను ౧ మనువు, ౨ సంవర్తుడు, 3 హారీతు డు, ౪ యాజ్ఞవల్క్యుడు, ౫ పారాశరుడు. అను నామములుగల ఋ షులు ధర్మమును తెలియవలెననెడి కోరికచేతవచ్చి మనోహరమైనట్టియు సమస్తదేవఋషులచే గూడుకొనినట్టియు. కైలాసపర్వతాగ్రమునందు దర్భాసనముమీద కూర్చుండి ఋషులచేత చుట్టుకొనుబడినట్టియు, అన్ని వేదార్థములను తెలుసుకొనినట్టియు, అన్నిశాస్త్రములను దెలుసుకొని నట్టియు, అన్నిధర్మములను జెప్పదగినట్టియు, మునవశీలుడైన వృద్ధపా రాశరునిగూర్చి ప్రశ్న జేసిరి.

అని యిట్లుండుటచే మొదటజెప్పినపరాశరస్మృతి గ్రంథకర్తయ గు పారాశరులును, ఈవృద్ధపారాశరులును భిన్నులై యుండుటచేనొక వే

శ ప్రత్యేకముగ ధర్మములను జెప్పినను చెప్పవచ్చునని జెప్పినచో మొదటి పరాశరస్మృతి గ్రంథకర్తయగు పారాశరులు సర్వజ్ఞులగు వ్యాసులతండ్రికైగా శృతిప్రతిపాదకుడై అచింత్యమైన మహిమగలవారై నుండినట్లు యీక్రింది పరాశర మాధవీయమున విద్యారణ్యులచే జెప్పబడియున్నది.

వ్యాఖ్యానము॥ సమహిమావాచవ్యాసః పారాశర్య ఇతిశ్రుతౌ పరాశరపుత్రత్వముపజీవ్య వ్యాసస్యస్తుతత్వాత్ । యథాసర్వ సంప్రతిపన్నమహిమ్నా వేదవ్యాసస్యాపిస్తుతయే పరాశరపుత్రత్వముపజీవ్యతే। తదాకిమువక్తవ్య మంచింత్య మహిమాపరాశరఇతి కించవాజసనేయశాఖాయాం వంశబ్రాహ్మణే వేదసంప్రదాయప్రవర్తక గురుశిష్య పరంపరాయాం పరాశరస్య పుత్ర పౌత్రాశ్చ్యా్రియంతే కౌశికాయనిఘృత కౌశికాద్ఘృతకౌశికః। పారాశర్యాయణాత్పారా శర్యాయణఃపారశర్యాత్ పారాశర్యో జాతూకర్ణ్యాదితి। తస్మాత్పారాశరోఽపిమను సమానఏవ। ఏవ ఏవన్యాయో వశిష్ఠాత్రి యాజ్ఞవల్క్యాదిషు యోజనీయః। తత్తద్విషయ శ్రుతిముపలంబాత్ ॥ ఇట్లు పరాశర మాధవీయము ౨ పత్రము.

అను నీప్రకారముయుండుటచే శృతి ప్రతిపాదకులైన పరాశరులకన్నను వృద్ధపరాశరులనుగూర్చి నీవృద్ధపరాశరస్మృతియందుతప్ప తదితరగ్రంథముల యెందెచ్చటను గన్పడుటలేదు.

ఇందువలన శృతి ప్రతిపాదకమైన పరాశరులవారికి శ్రీశాస్త్రులవారిదివరలో జెప్పిన దివ్యజ్ఞానము కొఱవడియున్నదని మనము గ్రహింపవలయును. ఇట్లు గ్రహించినచో మహర్షులకు శ్రీశాస్త్రులవారు మున్నుజెప్పిన సర్వజ్ఞత్వాది గుణములుకూడా లేనివి యగుచున్నవి. ఇట్టితరి నామహర్షులు జెప్పిన స్మృతులుకూడా అప్రామాణ్యమును బొందుచున్నవి. ఏలయనినచో మనవలె వారును గ్రంథములు రచించడమును మరియొకరాగ్రంథముల నాక్షేపించి ప్రత్యేకగ్రంథములు రచిం

ఛిన్నదానివలె అగుచున్నది. ఇందువన శ్రీశాస్త్రుల్లవారి వాదము స్వవచన వ్యాఘాతముతో గూడిన వాదమని మీరు గుర్తెరుగవలయును.

ఇదియునుగాక మనుస్మృతికి బదులు వృద్ధమనుస్మృతి 2 వశిష్ఠస్మృతికి బదులు వృద్ధవశిష్ఠస్మృతి, 3 యాజ్ఞవల్క్యస్మృతికి బదులు వృద్ధ యాజ్ఞవల్క్యస్మృతి అని యీప్రకారము స్మృతికి ప్రతిస్మృతి గన్పట్టుచున్నది. ఇందువలన సర్వజ్ఞులగు మహాఋషులు ఖిలమైన శ్రుత్యర్థములను దివ్యజ్ఞానముచే గ్రహించి స్మృతిరూపముగ జెప్పిరని జెప్పుట కన్న శ్రుత్యర్థపరిజ్ఞానాశక్తులగు వారల కుపకరించు నటుల వైదికభాషయందు నిగూఢములైన గంభీరార్థయుక్తములగు నాచారవ్యవహారములను లౌకిక సంస్కృతమున దేశకాలజనితాధి భావముల కనుగుణ్యముగునటుల, శ్లో॥ శ్రుతింపశ్యంతి మునయః స్మరంతిచతథాస్మృతిం। తస్మాత్ప్రమాణముభయం ప్రమాణైః ప్రమితంభువి॥ అను నీవచనప్రకారము స్మృతులను రచించిరని బూహ్వోక్తవిధిని జెప్పుట యుక్తమైయున్నదని మేము జెప్పితిమి.

ఇందులకు శ్రీశాస్త్రుల్లవారాక్షేపించినదేమన్నను,

శ్లో॥ శ్రుతింపశ్యంతిమునయః స్మరంతిచ తథా స్మృతిం॥

అను నీప్రమాణవచనములో స్మరంతి (తలచిరి) అను పదమునకు దివ్యజ్ఞానముచే ఖిలమైన శ్రుత్యర్థములను తలంచిరని యర్థమును జెప్పిరి. ఎందువలననినచో. వేదములనంతములనియు, అందులో కొన్ని భాగములు నశించినవనియు, అందులకు బేరుయూరు లేని యీశ్రుతి జెప్పుచున్నదని చెప్పియున్నారు.

శ్రు॥ అనంతావై వేదాః॥

ఇందువలన వేదములనంతములనియు, ప్రస్తుతము ముద్రితములైనవి కొన్నిభాగములే యున్నవనియు, ఆయనంతవేదములలో కొన్ని వేదములు నశించనవనియు, అట్టినశించిన వేదభాగములనే బూహ్వోక్త

లగు సర్వజ్ఞులైన పరాశరాది మహాఋషులు దివ్యజ్ఞానముచే బూర్వో క్తములైన ఖిలశ్రుతులను స్మరించి ప్రస్తుతములోనుండునట్టి స్మృతులను రచించిరని వచించిరి. శ్రీశాస్త్రుల్లవారిట్లు జెప్పుటకు వలనుపడదనిమా యాక్షేపణము దెలియపఱచునప్పటికి నిరుత్తరులైరి. ఎట్లనినచో వేదము లనంతములని బైశృతియందుండినను మనము నాలుగు వేదములనియే గ్ర హించవలయును. వేదములొకటి రెంటికి మించి యుండుటచే బహువ చనమున అనంతములని జెప్పబడినది. ఇందులకుపబృహ్మణముగా య జుర్వేదాంతర్గతమైన కఠోపనిషత్తుయందు సర్వవేదములుయేపదము (ప్ర ణవమును) జెప్పుచున్నవో అట్టి ప్రణవమును జెప్పుమని నచికేతుడు యమునిగూర్చిప్రశ్నించియుండినట్లు యీక్రిందివాక్యము జెప్పుచున్నది.

శృ॥ సర్వేవేదా యత్పదమామనంతి। కఠోపనిషత్॥

ఇందులో సర్వేయనప్పుడు నాలుగు వేదములనియు మూడు వేద ములనియు గుర్తెఱుగతగియున్నది. ఎందులకనినచో నిందులగూర్చిబై విధిని కొన్ని శృతిస్మృత్యాది ప్రమాణములు గన్పడుచున్నవి.

శృ॥ ఏతన్మహాభూతస్య నిశ్వసితమేవై తదృగ్వేదో యజుర్వేదస్సా మవేదో ధర్వాంగిరసః। ఇతి శతపథ బ్రాహ్మణే॥

శృ॥ అగ్నే ఋగ్వేదో వాయోర్యజుర్వేదః సూర్యాత్సామవేదో అం గీరసాదధర్వవేదః। శతపథబ్రాహ్మణే॥

శృ॥ ఋగ్వేదఏవాగ్నే రజాయత। వాయోర్యజుర్వేద స్సామవేదో ఆదిత్యాదంగీరసో అధర్వవేదః। ఇతిఐతరేయ బ్రాహ్మణే॥

శ్లో॥ అగ్నిర్వాయురవిభ్యస్తుత్రయం బ్రహ్మసనాతనం। దుదోహయ జ్ఞసిద్ధ్యర్థ మృగ్యజుస్సామలక్షణమ్॥
మనుస్మృతిః. ౧ అ. ౨౩ శ్లోకము.

ఇదియునుంగాక, శ్లో॥ శృతింపశ్యంతిమునయః॥ అనునప్పుడుము నులు శృతినిజూచి ఆప్రకారము స్మృతిరూపమున స్మరించిరి. అనగాత

లచిరి. అని చెప్పినప్పుడు దివ్యజ్ఞానముచే సర్వజ్ఞులైన మునులు చెప్పిర నిచెప్పుట వెఱ్ఱియభిప్రాయమై యున్నది. ఏలయనినచో ప్రత్యక్షముగ యుండినవస్తువును మెచ్చుట నైనను జూచుట కలుగును గాని ఎన్నడో యుండి ప్రస్తుతమట్టి వస్తువులేకయు అట్టివస్తువును జూడకయు జూచితి మని చెప్పుట పొసగనేరదుగదా. ఒకవేళ సర్వజ్ఞులైన మునులు దివ్య జ్ఞానముచే జూచిరని చెప్పినచో నాదివ్యజ్ఞానమువలనే యాశ్రుతులను క నుగొని అట్లుగనే యెందుకొఱకు వ్రాయక స్మృతిరూపముగ వ్రాయు టకు కారణమేమైయుండునో యోచించి జూడుడీ. మరియు కాళిదాసు యును, శ్లో॥ శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్॥ అని రఘువంశముద్వి తీయసర్గయందు ఉపముగ చెప్పియున్నాడు. ఇది ఉపమేయమై యుండిన ప్పుడు ఉపమానోపమేయములకు సామ్యము స్పష్టముగా నుండినప్పుడు ఉపమాలంకారమని చెప్పుట యగునుగదా, ఇట్టితరి యెన్నశోసణించిన వేదములను ఉపమానముగ చెప్పుట యెట్లు పొసగగలదు. అది ఉపమా లంకార మెట్లగును. కాబట్టి ఇపుడు ఖిలమైనశ్రుతుల ననుసరించి సర్వ జ్ఞులైన మహాఋషులు స్మృతులను రచించక ప్రస్తుతము ముద్రితములై న వేదచతుష్టయములనుండియే శ్రుత్యర్థ పరిజ్ఞానా శక్తులగు వారికుపక రించునటుల వైదికభాషయందు నిగూఢములైన గంభీరయు కములగు నాచారవ్యవహారములను లౌకిక సంస్కృతమున దేశకాలజనితాది భావ ముల కనుగుణ్యమగునటుల, శ్లో॥ శ్రుతింపశ్యంతి మునయః స్మరంతిచ త థాస్మృతిం। తస్మాత్ప్రమాణ ముభయం ప్రమాణైః ప్రమితంభుః॥ అను నీవచనప్రకారము సర్వజ్ఞులైన మునులు స్మృతులను రచించిరనిమీరును ఒప్పుకొనక తప్పనిసరియైయున్నదని మాయభిప్రాయము.

ఇదియునుంగాక బూర్వోక్తమైన మా యభిప్రాయము ననుస రించి పరాశరస్మృతిలో ౧ అధ్యాయము ౨౦, ౨౧, శ్లోకములగు నీ క్రిందిశ్లోకములందును, ఇందులకు వ్యాఖ్యానములగు పరాశర మాధవీ యమునందును, తదనుగుణ్యమైన ఆంధ్రపరాశరస్మృతియందు చెప్పబ డియుండుటచే నాప్రమాణవాక్యము లిచ్చట వ్రాయుచున్నాము.

శ్లో॥ కల్పేకల్పే క్షయోత్పత్త్యా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః। శ్రుతిస్స్మృతి సదాచారనిర్ణేతారశ్చ సర్వదా। నకశ్చిద్వేదకర్తాచ వేదం స్మృత్వాచతుర్ముఖః। తథైవధర్మాన్స్మరతిమనుః కల్పాంతరేంతరే॥

పరాశరస్మృతిః ౧ అ. ౨౦, ౨౧ శ్లోకము.

విద్యారణ్యవ్యాఖ్యానము. ఏవంచసతి ప్రకృతేపి కల్పాంతరే ధర్మాన్ స్మరతీతి పదత్రయం పూర్వార్ధేనుషంజనీయం। చతుర్ముఖ స్తస్మిన్మహాకల్పే పరమేశ్వరేణదత్తం వేదంస్మృత్వాతత్రప్రకీర్ణే వర్ణాశ్రమాదిధర్మాన్ సంకలయ్యస్మృతి గ్రంధరూపేణోపనిబధ్నాతి। తదాచపి తామహవచనాని। తత్రతత్రనిబంధనకారై రుదాహ్రియంతే। చతుర్ముఖస్యస్మృతి శాస్త్రకర్తృత్వం మనునాప్యుక్తం। ఇదంశాస్త్రంతుకృత్వాసౌ మా మేవస్వయ మాదితః। విధివద్గ్రాహయామాస మరీచ్యాదీనహంమునిరితి। యధా చతుర్ముఖ స్తథేవచ స్వాయంభువోమను స్తస్మిన్ స్తస్మిన్నవాంతరకల్పే వేదోక్తధర్మాన్గ్రధ్నాతి। మనుగ్రహణేనాత్ర యాజ్ఞవల్క్య విష్ణ్వాదయ ఉపలక్ష్యంతే। తదేవం ప్రతిమహాకల్పంతే సతేన చతుర్ముఖేన ప్రత్యవాంతర కల్పంచ తైస్తైర్మన్వాదిభిః స్మృతిప్రణయనాద్ధర్మాదేః ప్రవాహనిత్యత్వం సిద్ధం। ఏతదేవాభిప్రేత్యాశ్వమేధికే పర్వణి పఠ్యతే। యుగేష్వావర్త మానేషు ధర్మోప్యావర్తతేపునః। ధర్మేష్వావర్తమానేషు లోకోప్యావర్తతేపునరితి। యుగశ్చేదేవ ధర్మవైలక్షణ్య మభ్యుపేత్య ధర్మానితి బహువచననిర్దేశః। తదేవ వైలక్షణ్యం ప్రతిజానీతే॥ పరాశరమాధవీయము. ౨౦. పత్రము.

ఇటుపై వివరించిన స్మృతివాక్యములకుదగు ఆంధ్రపరాశరస్మృతిలోనుండు పద్యమును యీక్రింద వ్రాయుచున్నాము.

మ. ప్రతియుగమందు నీశ్వరుడు బ్రహ్మయు విష్ణువువీరలాశ్రుతి
స్మృతులనునిర్ణయింత్రు శృతిసృష్టికి గర్తలు లేరు భారతీ
పతినిగమమ్ములఃవ్వని కృపన్వినుపించినవానిగొంచు స
మ్మతిస్మరియించుచుఁ స్మృతులొనర్ప్రధరస్మనుముఖ్యధీమతుల్
ఆంధ్రిపరాశరస్మృతి ప్రమబింబము. ౧౫.

3 ఇందులోను అనగా శృతి, స్మృతితో సమానముగా నున్న దని ఉదహరింపబడినను యీస్మృతి శృతితో సమానముగాజాలదు. మతియేమన్నను తక్కిన ఇతిహాస పురాణ ప్రమాణముల కంటెను యీ స్మృతి ప్రబలమనునదియే వివక్షితము. ఈస్మృతులు ఇతిహాస పురాణ ప్రమాణములకంటెను ప్రబలమైయున్నదను విషయము బూర్వమీమాంసలో స్మృత్యధికరణోదుంబరాది కరణములయందు దెల్లమగును. ఎందులకన్నను శృత్యర్థమును స్మృతులు జెప్పినవనిచెప్పినను స్మృతిదేశకాలభేదముల ననుసరించి మారుచుండుటచే శృతితో సమానము స్మృతి గాజాలదని మాయాశయము నిందుమూలమున వెల్లడిపఱచు చున్నామని వ్రాయుచున్నాము.

మరియు నీవిషయము మనుస్మృతియందునుగూడా నీక్రింది బ్రమాణముచే దెలియుచున్నది.

శ్లో॥ ధర్మజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశృతిః॥
మనుః ౨ అ ౧3 శ్లోకము.

ఇందుచే శృతి విరుద్ధస్మృతిభాగము పరిగ్రాహ్యముకాదు అయినను యట్టివిషయము క్వాచిత్కముగాని ప్రాయికముగాదు. అందువలన స్మృత్యుక్తధర్మములు ఆచారములు వ్యవహారములు మున్నగు సకల విషయములు ప్రాయికముగ శృతిచోదితములేమైయున్నవి. కొందరను కొనినట్టు శృత్యర్థమును స్మృతులుబోధింపవని మేమెన్నడునుజెప్పియుండలేదు. స్మృతులలోని విషయము లన్నియువేదములయొక్క భాషాంతరీకరణమేయని జెప్పుటకు మేము సమర్థులముగాము. స్మృతులుభిన్న

భిన్న కాలములయందు వేఱువేఱుఋషులచే నప్పటప్పటి దేశకాలజనతాదిభావముల కనుగుణ్యామగునటుల రచింపబడినవి. ఇట్టి స్మృతులలో స్వార్థపరుల కుపయుక్తముగ కల్పించి జేర్చినవి గొన్ని గలసి విషసంపృక్తాన్నమువలె తిలతండుల న్యాయమున ఇది తథ్యమని గ్రహించుటకు వీలులేనట్టు గన్పట్టుచున్నవి.

ఈస్మృతికర్తలైన సర్వజ్ఞులగు ఋషులు శృతుల తాత్పర్యమును లెస్సగ నెఱిగినవారలుగాని అన్యులుగారు. అట్టివారలు శృతి విరుద్ధార్థంబులు బలుకుదురని జెప్పుటకెట్లు జెల్లును. కాబట్టి శృతివిరుద్ధార్థంబులగు స్మృతివాక్యములను స్వార్థపరులెవరో స్మృతులలో జేర్చిరని మేము బూర్వమున జెప్పిన వాక్యము సత్యమైయుండునని మీరునొప్పుకొనక తప్పని సరియగుచున్నది.

౪ అట్టి స్మృతు లెవ్వియనినచో ఈక్రింద వివరింప బడినవియై యున్నవి.

౧ మనుస్మృతిః.
౨ అత్రిస్మృతిః.
౩ విష్ణుస్మృతిః.
౪ హారీతస్మృతిః.
౫ యాజ్ఞవల్క్యస్మృతిః.
౬ ఉశనస్మృతిః.
౭ ఆంగీరసస్మృతిః.
౮ యమస్మృతిః.
౯ ఆపస్తంబస్మృతిః.
౧౦ సంవ
౧౧ కాత్యాయనస్మృతిః.
౧౨ బృహస్పతిస్మృతిః.
౧౩ పరాశరస్మృతిః.
౧౪ వ్యాసస్మృతిః.
౧౫ శంఖస్మృతిః.
౧౬ లిఖితస్మృతిః.
౧౭ దక్షస్మృతిః.
౧౮ గౌతమస్మృతిః
౧౯ శాతాతపస
౨౦ వశిష్టస్మృతిః.

ఈపై వివరించిన ముఖ్యస్మృతులు గాక మఱికొన్ని ఉపస్మృతులుగన్పట్టుచున్నవి. అవియవ్వియనినచో యీక్రింద వివరింపబడినవియైయున్నవి.

౧ నారదస్మృతిః.
౨ పులస్త్యస్మృతిః.
౩ క్రతుస్మృతిః.
౪ దేవలస్మృతిః.
౫ మరీచస్మృతిః.
౬ పితామహస్మృతిః.
౭ వ్యాఘ్రపాదస్మృతిః.
౮ భరద్వాజస్మృతిః.
౯ ఆశ్వలాయనస్మృతిః.
౧౦ బోధాయనస్మృతిః.
౧౧ భృగుస్మృతిః.
౧౨ మార్కండేయస్మృతిః.
౧౩ గోభిలస్మృతిః.
౧౪ కౌశికస్మృతిః.
౧౫ జాబాలస్మృతిః.
౧౬ ప్రజాపతిస్మృతిః.
౧౭ శౌనకస్మృతిః.
౧౮ గర్గస్మృతిః.
౧౯ పుణ్డరీకస్మృతిః.
౨౦ పైఠీనసస్మృతిః.
౨౧ నారాయణస్మృతిః.
౨౨ విశ్వామిత్రస్మృతిః.
౨౩ లౌగాక్షిస్మృతిః.
౨౪ వృద్ధమనుస్మృతిః.
౨౫ వృద్ధవశిష్ఠస్మృతిః.
౨౬ వృద్ధయాజ్ఞవల్క్యస్మృతిః.
౨౭ వృద్ధపరాశరస్మృతిః.
౨౮ బుధస్మృతిః.

ఇంతియేగాకను మఱికొన్ని స్మృతులుండినటుల తెలియుచున్నవి. ఇందులో గొన్ని శ్లోకరూపములుగను గొన్ని వాక్యరూపములుగను న్నవి. ఇవి యెవ్వారులచే రచింప బడినవనిన చో ఆయాస్మృతుల నామంబుల నిరూపించినయెడల అవి యొక్కొక్క ఋషిపేర నున్నవి. అందువలన ఆయాఋషులచే రచిపపబడినవని యెన్న పలయును. ఇందులకొక్క సందేహమైన హేతువు గలదు. ఈస్మృతులలో శ్లోకరూపముగానున్న స్మృతులు యాఋషుల కాలమున బుట్టినవనియే నెన్న వలయును. ఇందులో నత్ర్యంగిర బృహస్పతి దక్ష గౌతమాదులు మిక్కిలి బురాతనులు. వీరలు వాల్మీకికంటెనుగూడా అతిప్రాచీనులు. ఇట్లుండుటచే వాల్మీకిబుట్టుటకు మున్ను వేదమంత్రములుదక్క ఛందోబద్ధగ్రంథములు లేవని ప్రసిద్ధమైయున్నది. అందువల్లనే వాల్మీకిని గూర్చి యాదికవియని వర్ణించుటకు రామాయణము ప్రథమమున ఛందోబద్ధముగా రచించుటయే కారణమైయున్నది. ఇట్లగునప్పుడు అత్ర్యంగిర బృహస్పతి

దటి. స్మృతులయందు ఛందోబద్ధమగు శ్లోకరూపమైన కవిత్వము యుం డుటచే బూర్వోక్తరీత్యాసంశయగ్రస్తమైన విషయముగా నున్నదని మీకును దోచకమానదు. ఇంతియేగాక నీస్మృతులలోనే కొందఱు శిష్యులు ప్రశ్నము జేయగా నాయాఋషులు జెప్పిన వాక్యములేయాస్మృతులని కానవచ్చుచున్నవి. ఎచ్చటనైనను ప్రశ్నలు ప్రత్యుత్తరములు వాక్యరూపముగా నుండుట సహజము. ఇట్లుండ నెప్పటికప్పుడు నాప్రశ్నకులైనవారు శ్లోకరూపములగు వాక్యములచే ప్రశ్నలు చేయుచుండిరనియు, ఆఋషులు శ్లోకరూపములగు ఉత్తరములను జెప్పిరనియు, ఇట్లని నమ్ముటకు యోగ్యమై యుండలేదని మాత్రము దెలియజేయుచున్నాము.

౫ ఇదియునుంగాక మనువు జెప్పనది భృగుమహాఋషి గ్రంథరూపముగ రచించినట్లు యీక్రింద వివరించునట్టి మనుస్మృతి వచనముచే దెలియుచున్నది.

శ్లో॥ ఇదంశాస్త్రంతుకృత్వా సౌమామేవ స్వయమాదితః। విధివద్గ్రాహయామాస మరీచ్యాదీం స్త్వహం మునీన్ ॥ ౫౮॥ ఏతద్వో యం భృగుశాస్త్రం శ్రావయిష్యత్య శేషతః। ఏతద్ధిమత్తోధిజగేసర్వమేషోఖిలంమునిః॥ ౫౯॥ తత స్తథాసతేనోక్తో మహర్షిర్మనునాభృగుః। తానబ్రవీదృషీన్ సర్వాన్ ప్రీతాత్మా శ్రూయతామితి॥ ౬౦॥ మనుః ౧ అ. ౫౮, ౫౯, ౬౦.

ఇదియునుంగాక విజ్ఞానేశ్వరుడు యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యానముసేయుతఱి యాజ్ఞవల్క్యుడు ప్రశ్నోత్తరరూపముగా జెప్పిన వాక్యములను తచ్ఛిష్యుండెవ్వడో శ్లోకరూపముగ రచించెనని జెప్పియున్నాడు. ఆవ్యాఖ్యానపంక్తులనే యిచ్చట వ్రాయుచున్నాము.

వ్యాఖ్యానము॥ యాజ్ఞవల్క్యశిష్యః కశ్చిత్ప్రశ్నోత్తర రూపం యాజ్ఞవల్క్య ప్రణీతం ధర్మశాస్త్రం సంక్షిప్య కథయామాస। యథామనుప్రోక్తం భృగుః। తస్యచాయం ప్రథమశ్లోకః॥

అని యీప్రకారము జెప్పియుండుటచే ఋషులవచించిన వాక్యములను సంగ్రహించి వారిశిష్యులు గ్రంథ రూపంబుగ స్మృతులను రచించినట్లు గానవచ్చుచునన్నవి.

ఇందునను ఒక్కసంశయముగలదు. అదియెద్దియన యీస్మృతి కర్తలైన ఋషులును తచ్ఛిష్యులును సమకాలంబువారలే గదా. ఇట్టి తచ్ఛిష్యులు రచించిన స్మృతులు ప్రమాణంబులు గావాయన్నినచో సమకాలంబులు గావని దెలియుచున్నది. ఇందులకును దృష్టాంతము జూడుడి. స్వాయంభువమనువు కాలంబులోనివారైన భృగుమహాముని చెప్పినట్లున్న మనుస్మృతిలోని స్వాయంభువు మనువుగాక మఱియారుగురుబుట్టిన వెనుక తాను జెప్పినట్లు యీక్రింది వచనమున గానవచ్చుచున్నది.

శ్లో॥ స్వాయంభువస్యాస్య మనోష డ్వంశ్యా మనవోప రే. సృష్టవం
తః ప్రజాస్స్వాస్స్వా మహాత్మా నోమహౌజసః॥
మనుః. ౧. అ. ౬౧ శ్లోకము.

ఇందులోని మరీచ్యాదులన్నను సృష్ట్యాదియందే బ్రహ్మమానసపుత్రులై బుట్టిరని బురాణములయందు గన్పట్టుచున్నది.

ఇందువలన మున్ను మన్వాదులు శిష్యుల కుపదేశించిన ధర్మములు శిష్యప్రశిష్య పరంపరాగతములయ్యెననియు, చిరకాలమునకు నాపరంపరలోని వారలెవ్వరో గ్రంథరూపములుగా జేసిరనియు మనమూహింపవలసి యున్నది.

ఇందున మఱియొక విషయముకూడా విచారింపవలసియున్నది. అదియెద్దియన్నను మన్వాదులు జెప్పినమాటలే యీ మనుస్మృత్యాది గ్రంథములయందు జెప్పంబడినవా లేక తత్కాలంబున యుండినవారలు బూర్వోక్తవిధిని మఱికొన్నింటిని జేర్చి జెప్పియున్నారా, అను విషయమైయున్నది. ఇందులో మన్వాదులు జెప్పిన మాటలు మాత్రమే జెప్పిరని జెప్పుటను అవకాశము జిక్కుటలేదు. ఎట్లంటిరేని మనుస్మృతి

యందు ౯ అధ్యాయంబున సంతానంబులేని విధవకుని యోగంబున దేవర సపిండాదులవలనంబులో త్పత్తి సేయవలయునని జెప్పి అనియో గము వేనుని రాజ్యకాలంబున నుండెననియు నాపిదప వారలా ధర్మం బు గూడదని పరిహరించిరనియు ఈప్రకారము జెప్పి నియోగము ని షేధింప బడి యున్నది.

శ్లో॥ అయంద్విజైర్హి విద్వద్భిః పశుధర్మోవిగర్హితః। మనుష్యాణా మపిప్రోక్తో వేనరాజ్యం ప్రశాసతి॥ ౬౬॥ సమహీమఖిలాంభుం జన్రాజర్షి ప్రవరః పురా। వర్ణానాం సంకరంచక్రే కామోప హతచేతసః॥ ౬౭॥ తతఃప్రభృతియోమోహాత్ ప్రమీతపతికాంస్త్రి యం। నియోజయత్యపత్యార్థంతం విగర్హంతి సాధవః॥ ౬౮॥ మను॥ ౯. అ. ౬౬, ౬౭, ౬౮.

ఈశ్లోకములలోనుండు వేనుడనువానిగూర్చి ప్రజలకందఱికి మొ దటివాడగు స్వాయంభువమనువు జెప్పుట సందర్భముగాదుగదా. ఇంతి యేగాక విధవానియోగము వృద్ధపరాశరస్మృతిలో నీక్రిందిశ్లోకముచేక లియుగవర్జనీయంబులలో బరిగణింపబడి యున్నది.

శ్లో॥ దీర్ఘకాలంబ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ। విధవాయాం ప్ర జోత్పత్తౌ దేవరస్య నియోజనం॥ వృద్ధపరాశరస్మృతిః॥ ౯ శ్లో.

ఇదియట్లుండ సకలధర్మసారజ్ఞుడైన వేదవ్యాస మహర్షితాన్స్వ యముగా నియోగవిధిని విధవలయందు ధృతరాష్ట్రాదులను బుట్టించె నని మహాభారతమున దెల్లముగ దెలియుచున్నది. ఇదిద్వాపరాంతము నజరిగినదను విషయము అందఱు గుర్తెరిగినదేగదా. ఇట్టిశోతి కలియు గమున నిషేధించిన విధవానియోగము వేనుని రాజ్యానంతరమునిషే ధింపబడినదని మనుస్మృతి జెప్పుట యెట్లునగునో మరియు ఈవిధవాని యోగము వేనరాజ్యము గడచినది మొదలు నిషిద్ధమనుటకు ఎట్లుపొ సగునో యోచించి జూడుడీ.

౮. శృతిప్రసిద్ధమైన యీమనుస్మృతి వ్యాసుల కన్నను బూర్వమందేయుండెనని మన వైదికబ్రాహ్మణుల తలంపైయున్నదిగదా. ఇట్టిసమయమున వ్యాసులకు యీవిధవా నియోగము నిషేధమని మనుస్మృతిలోని విషయముదెలియకబోయెనా, లేక తెలిసివిషయలోలుడై ప్రవర్తించెనా. ఈవిషయము దెలియబఱచుటకు ఈ మీ వైదికబ్రాహ్మణసోదరులు బాధ్యులైయున్నారు. ఒకవేళ బ్రాహ్మణసోదరులు జెప్పుటకు బాధ్యులు గాకబోయిరేని యిట్టివాక్యము లాధునికలచే గల్పించి గ్రంథముల జేర్చిరని మనమూహింపవచ్చును. అందువలన మన్వాదిస్మృతులయందు గానవచ్చు వాక్యంబులెల్లను మన్వాదులు జెప్పినవిగావనిస్పష్టముగా దెలియవచ్చును. అట్లగుసడల మన్వాదులు ధర్మములను జెప్పుటయే కల్లయనియును, ఈస్మృతి గ్రంథములన్నియు నాధునిక కల్పితములేయనియును, ఇట్లు మనమూహింపవచ్చుననినచో అట్లనుటకు వీలైయుండలేదు. వేదములయందేననగా బ్రాహ్మణములయందు మనువుజెప్పిన ధర్మము మిక్కిలి హితమని వచింపబడియున్నది. ఇందువలన యీమనుస్మృతి బ్రాహ్మణముల కంటెను అతిప్రాచీన మైనదిగా మనమూహింపదగినదైనను బూర్వపు విద్వాంసులు యీబ్రాహ్మణ గ్రంథములను వేదతుల్యముగా నెంచియున్నారు. అందువలన యీమనుస్మృతి వేదముసందును ప్రాధాన్యమై యున్నదని వ్రాయుటకు హేతువైయున్నది. ఈస్మృతులలో జెప్పిన ధర్మములు తరుమగా వేదతాత్పర్యము ననుసరించియున్నవి. అయినను యీస్మృతులయందు వేదోక్త ధర్మములకు వ్యతిరిక్తమైన విధులు బహుళముగ గన్పట్టుటచేవాటినిమెవరో స్వార్థపరులు వ్రాసిరని యింతకుబూర్వమే వక్కాణించియున్నాము. ఈస్మృతులయందగి విశేషించిన వేదోక్తధర్మముల కనుసరించిసధర్మములు బహుదూరదృష్టిచే నైహికాముష్మికానేక ఫలోపయోగములగునట్లు జెప్పబడియున్నవని బుద్ధిమంతులకు దెల్లమగుచున్నది. ఈపైనుదహరించిన స్మృతులలో మనుస్మృతి ప్రాధాన్యమైనటుల వచించిన బ్రాహ్మణాదివాక్యములను ఇచ్చట జిత్రించుచున్నాము.

శ్రు॥ యద్వై కించ మనురవదత్తద్భేషజమ్॥ ఇట్లు తైత్తరీయ బ్రాహ్మణము.

శ్రు॥ మనుర్వైయత్కించి దవదత్తద్భేషజం భేషజతయాః॥ ఇట్లుచాందోగ్యోప నిషత్తు॥

శ్లో॥ యఃకశ్చిత్కస్య చిద్ధర్మో మనునాపకీర్తితః। ససర్వోభిహితో వేదే సర్వజ్ఞానమయోహిసః॥ ఇట్లు మనుస్మృతిః ౨ అ. ౭ శ్లో.

శ్లో॥ వేదార్థోపనిబద్ధత్వాత్ప్రాధాన్యం హిమనోస్మృతమ్। మన్వర్థవిపరీతాతు యాస్మృతిస్సానశస్యతే। తావచ్ఛాస్త్రాణి శోభంతే తర్కవ్యాకరణానిచ। ధర్మార్థమోక్షోపదేష్టా మనుర్యావన్న దృశ్యతే॥ ఇటు బృహస్పతివచనము.

శ్లో॥ పురాణంమానవోధర్మ స్సాంగోవేదశ్చికిత్సితమ్। ఆజ్ఞాసిద్ధాని చత్వారి నహంతవ్యాని హేతుభిః॥ ఇట్లు మహాభారతవచము.

రెండియు తక్కిన స్మృతులలో యాజ్ఞవల్క్యాత్రి విష్ణ్వాదిస్మృతులు ప్రబలంబులై యున్నవి. ఆటుపైన నారదాదిస్మృతులుకూడా ప్రబలంబులని యాస్మృతులవల్లనే తెల్లంబగును.

౭ ఇదివరలో వైదికమత రీత్యాస్మృతులకు కొంతకాల నిర్ణయము తారుమారుగా గ్రహించియున్నాము. ప్రస్తుతము లౌకిక మతరీత్యా మనుస్మృతి క్రీస్తుశకము రెండవశతాబ్దములకు బూర్వమే వ్రాయబడెననియు, యాజ్ఞవల్క్య స్మృతియు నారదస్మృతియు నేటికించుమించుగ ౧౮౦౦ సం॥ల క్రింద వ్రాయబడెననియు పాశ్చాత్య పండితులు కాలనిర్ణయమును జేసియున్నారు. పరాశరస్మృతినిగూర్చి నాలోచించినచో పరాశరస్మృతియందు అష్టాదశస్మృతులను గురించి పరాశరస్మృతలలో జెప్పునప్పుడీ క్రిందిశ్లోకమునందు నాపస్తంబస్మృతి ప్రస్తావనమువచ్చి యున్నది.

శ్లో॥ ఆపస్తంబకృతాధర్మా శంఖస్య లిఖితస్యచ। కాత్యాయనకృతా
శ్చైవ తథాపారిచేతసాన్మునేః॥

పరాశరస్మృతి ౧ అధ్యాయము. ౧౫ శ్లోకము,

ఇందువలన నాపస్తంబునియొక్క కాలమునుగూర్చి మనము గు ర్తెరుగతగియున్నది. అందువిషయమై శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు గారు తమ యాంధ్రులచరిత్ర ప్రథమభాగము నాలవప్రకరణము ౭౫ వ పత్రము ౫వ పంక్తిమొదలుకొని యీక్రిందివిధమున వ్రాసియున్న దానిని మేమును ఒప్పుకొనివ్రాయుచున్నాము.

> ఆపస్తంబధర్మసూత్రములను జక్కగ బరిశోధించి యాంగ్లభాష లోకి భాషాంతరీకరించిన డాక్టరు బూలరుదొరగారీ సూత్రకారుడాంధ్రదేశములోని వాడనియు క్రీస్తునకు బూర్వమునాలగవ శతాబ్దమునగాని యైదవ శతాబ్ధమునగాని యుండి యుండుననియు వ్రాసియున్నారు.

ఈకారణము వలన నాపస్తంబుని జన్మమిప్పటికి సుమారు ౨౩౨౧ సంవత్సరములైనట్టు దెలియబడినది. ఈపరాశరస్మృతి యాపస్తంబునికి తదనంతరము వ్రాయబడినట్లు పైశ్లోకమువలన గుర్తించియున్నాము.

ఈస్మృతులలోను ౧ మన్వాదులు జెప్పిన ధర్మములు గొన్నియును, ౨ స్మృతికర్తలగు గ్రంథకర్తలు జెప్పినధర్మములు గొన్నియును, 3 ఆధునికులచే ప్రక్షిప్తములుగ జేర్చిచెప్పినవిగొన్నియును, ఇట్లు నన్నియుగలిసి స్మృతియను గ్రంథరూపమున విరాజిల్లుచున్నదని బూర్వోక్తములైన హేతువులచే నిరూపించిజెప్పుచున్నాము.

ఇట్లు గ్రంథములలోను పైవాటియొక్క వివరణంబులు గుర్తెఱుగుటకై ఇదివరలో విధవానియోగ నిషేధక వచనంబులచే జెప్పిన యంశంబులుగాక నీక్రింది శృతిధర్మములకు వ్యతిరిక్తములై నాధుని కాలచే గల్పింపబడిన స్మృతివాక్యములను చిత్రించి మీామనంబుల కెఱుక పఱచుచున్నాము.

౮. ఇందులోను జయార్థప్రకాశిక మొదటి భాగము, అజ్ఞానతిమిరభాస్కరములో నుదహరించిన శుక్లయజుర్వేదము ౨౬ అధ్యాయము ౨వ మంత్రమగు, శ్రు॥ యథేమాంవాచం కళ్యాణీ మావదానిజనేభ్యః॥ అను నీశ్రుతియందును, తదితరములైన అనేక శ్రుతిస్మృతి ప్రమాణవచనముల యందును స్త్రీశూద్రుల కందఱికిని వేదాధ్యయనాధికారము గలదని గన్పట్టుచుండ నైశ్రుతి స్మృత్యాదులకు వ్యతిరిక్తములుగను ఈక్రిందవ్రాయునట్టి గొన్నిస్మృతివాక్యములలో స్త్రీశూద్రాధ్యయనవిధి గూడదని నిషేధించుచున్నది.

౧ సూ॥ అథహాస్యవేద ముపశృణ్వత స్త్రపు జతుభ్యాం శ్రోత్రప్రతిపూరణముదాహారణే జిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేదః॥
గౌతమస్మృతిః॥ ౧౨ ఖండము ౪ వాక్యము.

అనగా శూద్రుడు వేదమును వినినేని చవులో సీసముగాని, లక్కనుగాని కరిగించిబోయవలయును. మరియును శూద్రుడు వేదమునుచ్చరించినచో జిహ్వచ్ఛేదనము చేయవలయును. ధరించినచో (సంపూర్ణముగ నధ్యయనము జేసినచో) శరీరమును భేదించ వలయునని జెప్పు చున్నది.

ఈసూత్రమునకు హరిదత్తాచార్యులు జేసిన వ్యాఖ్యానములో శూద్రుడు బుద్ధిపూర్వకముగ వేదమును వినకూడదనిమూలసూత్రమునకు వ్యతిరిక్తముగ శూద్రులయందు దయతలచి జెప్పియున్నాడు. అయిన నీయభిప్రాయము మూలవాక్యము నందుండు యంత కఠినముగ గన్పట్టదు

౨ శ్లో॥ నశూద్రాయమతిందద్యాన్నోచ్ఛిష్టం నహవిష్కృతం।
నచాస్యోపదిశేద్ధర్మం నచాస్యవ్రత మాచరేత్॥
మనుస్మృతి ౪ అధ్యాయము ౮౦ శ్లోకము.

3. శ్లో॥ నావిస్పష్టమధీయీతనశూద్రజనిసన్నిధౌ।
ననిశాంతే పరిశ్రాంతో బ్రహ్మాధీత్యపునః స్వపేత్॥
మనుస్మృతి ౪ అధ్యాయము ౯౯ శ్లోకము.

మరియును శూద్రునికి వేదమును జెప్పగూడదు. శూద్రుని స మీపమున స్వరవర్ణాదులచే స్పష్టత లేక యుండినట్లుండినను అనగా నక్ష రములు దెలియునట్లుగనైనను చదువగూడదు. బ్రాహ్మణాదిసేవజేయు ని శూద్రుని కెంగిలన్నమునుకూడా బెట్టగూడదు. మరియు సగము హోమముచేయగా మిగిలిన హవిస్సును బెట్టకూడదు. అతనికిధర్మ ముల నుపదేశముచేయగూడదు. వెండియు నతనిచే నే వ్రతముల నాచ రింపజేయగూడదని మనుస్మృతిలో పై అభిప్రాయములిచ్చునట్టి వాక్య ములు గన్పట్టుచున్నవి.

శ్లో॥ శ్వక్రోష్టుగర్ద భోలూక సామభాగా ర్తనిస్వనే। అమేధ్యశ్శవ శూద్రాంత్యశ్మశాన పతితాంతికే॥

యాజ్ఞవల్క్యస్మృతి ఆచారకాండము ౧౪౭ శ్లో.

ఇదియునుం గాక అమేధ్యశ్శవ శూద్రాంత్యమునందు వేదో చ్చారణము చేయకూడదని జెప్పుచున్నది. మరియును,

శ్లో॥ వేదాక్షరవిచారేణ శూద్రస్యనరకంధ్రువమ్॥

పరాశరస్మృతి ౧ అధ్యాయము ౬౬ శ్లోకము.

శ్లో॥ శ్వచర్మణి యథాక్షీర మపేయం బ్రాహ్మణాదిభిః తద్వచ్ఛూ ద్రముఖాద్వాక్యం శ్రోతవ్యం నకదాచన। పండితస్యాపి శూద్ర స్య శాస్త్రజ్ఞానరతస్యచ। వచనంతస్యనగ్రాహ్యం శునోచ్ఛిష్టం హవిర్యథా। శూద్రోజ్ఞానావలేపేన బ్రాహ్మణావ్యాభషతేయది। వయాతినరకంఘోరం యావదాభూత సంప్లవం। శూద్రంచ ప్రతి పాదకం। గర్భంచజారజాతంతు దూరతః పరివర్జయేత్॥

పరాశరమాధవీయము. ౬౩ పత్రము,

అనగా శూద్రుడు వేదాక్షర విచారణజేసెనేని నరకమునుబొం దుట నిశ్చయము. మరియు బ్రాహ్మణాదులు కుక్కచర్మమునందు పా లుబోసి నాపాలనుయెట్లుగ్రహించరో అట్లు శూద్రముఖమునుండి రా బడిన వాక్యమును గ్రహించగూడదు. ఇదియునుంగాక బ్రాహ్మణాదు

లు కుక్కముట్టుకొన్న హావిస్సునట్లు వదలెదరో అట్లుగ శూద్రుకుపం
డితుడైనను, శాస్త్రజ్ఞానరతుడైనను, విడువతగినది. ఇంకియు బ్రా
హ్మణాదులతో శూద్రుడు జ్ఞానవంతుడై భాషించినచో నరకమును జెం
దుచున్నాడు. అను నీప్రకారము పరాశరమాధవీయము ౭౬౩ పత్ర
మునందు జెప్పబడియున్నది. ఇట్లు స్మృతులలో పెక్కులు గన్పట్టుచు
న్నవి వాటిని గ్రంథవిస్తరభీతిచే వదులుటయైనది.

ఈవాక్యములన్నియు బూర్వోక్తమైన జయార్థప్రకాశిక మొద
టిభాగము అజ్ఞానతిమిరభాస్కరమున యుదహరించిన శుక్ల యజుర్వే
దాంతర్గతమగు ౨౬ అధ్యాయము ౨ మంత్రమునకు వ్యతిరిక్తములు
గ గన్పట్టుచున్నవి.

శ్లో॥ ధర్మజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశ్రుతిః.
మనుస్మృతి ౨ అధ్యాయము ౧౩ శ్లోకము.

ఇట్లు వ్యతిరిక్తముగ నుండుటచే ధర్మజిజ్ఞాసమానానాం ప్రమా
ణం పరమస్మ్రుతిః అను నీమనుస్మృతివాక్యము ధర్మజిజ్ఞానులగు వారు
ధర్మనిర్ణయములయందు శృత్యర్థమునే గ్రహించి ధర్మజిజ్ఞాన చేయవల
యుననియు, శృత్యర్థమునకంటె వ్యతిరిక్తములైన వాటిని విడవతగిన
దనియు విధిగ జెప్పియుండుటచే పై వాక్యములన్నియు శృతివిరుద్ధార్థ
ములను దెలియజేయుటవలన సాధునికులచే బూర్వోక్తమగు డిల్లీ సా
మ్రాజ్యము నుండి ఉదహరించిన ప్రకారము కల్పితములను గల్పించి
స్మృతులలో జేర్చినవగుటచే ప్రమాణభూతములైన వాక్యములుగాను
న్నవని యెన్నుటకు వీలులేదు.

ఇటుపై శూద్రులధనార్జన విషయమునుగూర్చి శృతిప్రమాణము
లను తద్భిన్నములైన స్మృతిప్రమాణములనుజూచి శృతిప్రమాణములకు
వ్యతిరిక్తములైన స్మృతిప్రమాణములను యీక్రింది భాగమున ఖండిం
చు చున్నాము.

శృ॥ స్వాధ్యాయాన్మాప్రమదః। ఆచార్యాయ ప్రియంధన మాహృ
త్యప్రజాతంతుం మావ్యవత్సేత్సీః। సత్యాన్నప్రమదితవ్యం। ధర్మా

న్నప్రమదితవ్యం। కుశలాన్నప్రమదితవ్యం। భూత్యై నప్రమదిత
వ్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం నప్రమదితవ్యం। దేవపితృకా
ర్యాభ్యాంన ప్రమదితవ్యం। తైత్తరీయోపనిషది శిక్షావల్లి॥

అర్థము. స్వాధ్యాయాత్। వేదాధ్యయమునుండి, మాప్రమ
దః। ప్రమాదమునుచేయవద్దు, అనగా హెచ్చరికనుండి తప్పియుండవ
ద్దు, ఆచార్యాయ। గురువుకొఱకు, ప్రియం। ఇష్టమైన, ధనం। ధనము
ను, ఆహృత్య। తీసుకొనివచ్చి విద్యానిష్క్రియము కొఱకు గురువునకు
ఇచ్చి ఆచార్యునిచేత అనుజ్ఞయివ్వబడినవాడవై, ప్రజాతంతుం।సంతా
నమును, మావ్యవచ్ఛేత్సీః। విచ్ఛిత్తినిచేయవద్దు, అనగా భంగమునుచే
యక ప్రయత్నమునుచేయవలయును, సత్యాత్। సత్యమునుండి, నప్రమ
దితవ్యం। ప్రమాదమునుపొందకూడదు, అనగా మఱచిఅయినను అబ
ద్ధముచెప్పకూడదు. ధర్మాత్। ధర్మమునుండి, నప్రమదివ్యం। ప్రమాద
మునుపొందకూడదు, కుశలాత్। క్షేమమునుండి, నప్రమదితవ్యం। ప్ర
మాదమును పొందకూడదు. అనగా తన రక్షణమునకైన కార్యముల
నుండి ప్రమాదమునుపొందకూడదు. భూత్యైః। ఐశ్వర్యము కొఱకు,
అనగా ఐశ్వర్యముకొఱకు మంగళయుక్తమైన కార్యములనుండి, నప్ర
మదితవ్యం। ప్రమాదమును పొందకూడదు, స్వాధ్యాయప్రవచనాభ్యాం।
అధ్యయన అధ్యాపనములనుండి, నప్రమదితవ్యం।ప్రమాదమునుపొంద
కూడదు, దేవపితృకార్యాభ్యాం। దేవకార్య పితృకార్యములనుండి, న
ప్రమదితవ్యం। ప్రమాదమును పొందకూడదు.

తాత్పర్యము. ఈఅనువాకమునందు వేదాధ్యయనానంతరము
శిష్యునిగురించి బ్రహ్మజ్ఞానముకంటె పూర్వము వేదోక్తకర్మలను చేయ
దగినవిగా నుపదేశించుచున్నాడు.

ఓ శిష్యుడా నీవు సత్యమును పలుకుము. ధర్మమునుచేయుము.
అధ్యయనమువలన ప్రమాదమును పొందకుము. ఆచార్యుడనైన నా
కొఱకు అభీష్టమైన ధనమునుతెచ్చి ఇచ్చి సంతానమును విచ్ఛేదము
చేయక పుత్రోత్పత్తియందు పుత్రకామ్యాది కర్మచేత ప్రయత్నముచే

యము. సత్యమువల్లనున్ను, ధర్మమువల్లనున్ను, ఆత్మరక్షణకొఱకైన కార్యములవల్లనున్ను, ఐశ్వర్యముకొఱకైన మంగళయుక్తములగు కార్యములవల్లనున్ను, దేవపితృకార్యములవల్లనున్ను, ఎన్నటికి ప్రమాదమును పొందకుము.

శంకరభాష్యము॥ స్వాధ్యాయాత్। అధ్యయనాన్మాప్రమదః। ప్రమాదంమాకార్షీః। ఆచార్యాయ ఆచార్యార్థం ప్రియం ఇష్టం ధనం ఆహృత్య ఆనీయదత్వా విద్యానిష్క్రియార్థం ఆచార్యేణచానుజ్ఞాతోనురూపాన్దారానాహృత్య ప్రజాతన్తుం ప్రజాసన్తానం మావ్యవచ్ఛేత్సీః। ప్రజాసన్తతేర్విచ్ఛిత్తిర్న కర్తవ్యా। అనుత్పద్యమానేపి పుత్రే పుత్రకామ్యాదికర్మణా తదుత్పత్తౌయత్నః కర్తవ్యః ఇత్యభిప్రాయః। ప్రజాప్రజనప్రజాతిత్రయ నిర్దేశసామర్థ్యాత్। అన్యథా ప్రజనశ్చేత్యే తదేకమేవావక్ష్యత్। సత్యాన్నప్రమదితవ్యం ప్రమాదోనకర్తవ్యః సత్యాచ్చప్రమదనం అనృత ప్రసంగః ప్రమాదశబ్దసామర్థ్యాత్ విస్మృత్యాప్యనృతంన కర్తవ్యమిత్యర్థః అన్యథాऽసత్యవచన ప్రతిషేధఏవస్యాత్। (ధర్మాన్నప్రమదితవ్యం) ధర్మశబ్దస్య అనుష్ఠేయ విశేషవిషయత్వాద ననుష్ఠానం ప్రమాదః నకర్తవ్యః। అనుష్ఠాతవ్యఏవ॥ (ధర్మఇతియావత్ ఏవం) కుశలాత్। ఆత్మరక్షార్థాత్కర్మణో న ప్రమదితవ్యం। భూతిః విభూతిః తస్యైభూత్యై భూత్యర్థాన్మంగళయుక్తాత్కర్మణః నప్రమదితవ్యం। (స్వాధ్యాయప్రవచనాభ్యాం నప్రమదితవ్యం) స్వాధ్యాయోऽధ్యయనం ప్రవచన మధ్యాపనం తాభ్యాం నప్రమదితవ్యమితి క్వచిదధికం దృశ్యతే। తేహినియమేనకర్తవ్యేత్యర్థః। (దేవపితృకార్యాభ్యాం నప్రమదితవ్యం) దైవపిత్రే కర్మణీకర్తవ్యేత్యర్థః॥

విద్యారణ్యభాష్యము. అధ్యయనేన గృహీతస్య స్వాధ్యాయస్యవిస్మృతిః ప్రమాదః తంమాకుర్యాత్। బ్రహ్మహత్యాసమంజ్ఞేయమధీతస్యచనాశన మితిస్మృతేః। గోసువర్ణవస్త్రాదిరూపం యద్ధనమాచార్యస్యప్రియం తద్విద్యా దక్షిణార్థం సంపాద్యగురవే సమర్ప్యతతో వివాహంకృత్వా ప్రజాయాః పుత్రపౌత్రాది రూపాయాస్తతుర్విస్తారస్తస్య

వ్యవచ్ఛేదంమాకార్షీః। పూర్వోక్తయోస్సత్య ధర్మయోః కదాచిదాలస్యాదన నుష్ఠానం ప్రమాదః సోపినకర్తవ్యః। కుశలంక్షేమస్తేనతత్కారణంకర్మ నివక్షితం తచ్చద్వివిధం లౌకికంచేతియో భోగ్యగా మయావిస్యాద్యోవా కామయేత సర్వమాయుర్యామితి తస్మా ఏతాఋష్టిం నిర్వపేదిత్యాదిక మాయురారోగ్య ప్రదంవైదికం। చికిత్సాదికం లౌకికం భూతిరైశ్వర్యం తయాతత్కారణ ముపలక్ష్యతే। తత్రాపివాయవ్యంగ్ం శ్వేతమాలభేత పశుకామ ఇత్యాదికం వైదికం లౌకికం కుశలభూత్యోరభావే ముక్తిహేతు కర్మానుష్ఠానా సంభవాత్తయోర ప్రమాదోనుశాసనీయః। గృహీతస్వాధ్యాయస్య విస్మృతిరూపః ప్రమాదః పూర్వం నివారితః। అత్రతు అధ్యాపనియస్వాధ్యాయ బ్రహ్మయజ్ఞయో రనుష్ఠానరూపః ప్రమాదోనివార్యతే। పౌరాణాదికం వినాయకవ్రతానంతవ్రత దేవకార్యం ప్రతిసాంవత్సరికాదిక పితృకార్యమ్॥

ఈవేదశ్రుతియందు సమస్తప్రజలు సత్యమును పలుకతగినదిగను, ధర్మ ప్రవర్తములై నుండుటకును, ఎల్లప్పుడు విద్యాధ్యయనమునందు ప్రమాదమును బొందక యుండగలందులకును, ఆచార్యులకు ప్రియముగు ధనమునిచ్చి పుత్రోత్పత్తి నిమిత్తమై గృహస్థాశ్రమమున బ్రవేశించుటకును, ఐశ్వర్యయుక్తములగు మంగళకరమగు కార్యములయందు సార్వదా ల త్నించుటకును, దేవపితృ కార్యములయం దెన్నటికిని ప్రమాదమునుజెందక జేయుటకును పరమేశ్వరు డాజ్ఞయిచ్చినట్టు తెలియుచున్నది.

ఇట్టిస్థితిలో శూద్రుడు ధనార్జనముచేయగూడదని యీక్రిందిమనుస్మృతివాక్యములు బూర్వోక్తమైన, శ్రు॥ భూత్యైన ప్రమదితవ్యమ్॥ అనగా ఐశ్వర్యయుక్తమగు మంగళకరమైన కార్యములనుండి ప్రమాదమునుబొందవద్దని జెప్పినవాక్యములకు వ్యతిరిక్తములుగ జెప్పుచున్నవి.

శ్లో॥ శక్తేనాపిహిశూద్రేణ నకార్యోధన సంచయః।
శూద్రోహిధనమాసాద్య బ్రాహ్మణానేవ బాధతే॥

మనుస్మృతి ౧౦ అధ్యాయము ౧౨౯ శ్లోకము.

అవగా ధనసంచయమునుజేయుటకు సమర్థుడయ్యెను. శూద్రు డు దారపుత్రాది పోష్యవర్గ పంచయజ్ఞోప యోగములకన్నను అధిక ముగు ధనసంచయమును జేయరాదు. ఏలయనినచో ధనమధికముగనుం డుటవలననున్ను, శాస్త్ర మెరుగకుండుట వల్లనున్ను, బ్రాహ్మణులను బాధించువాడై శుశ్రూషను చెయ్యనే చెయ్యడు గనుక ధనసంచయ మును శూద్రుడు చెయ్యకూడదు.

ఒకవేళ శూద్రుడు బూర్వోక్తశ్లోకమునకు వ్యతిరిక్తముగ ధన సంచయము జేసినచో బ్రాహ్మణుడా ధనమును బలాత్కారముగ గ్ర హించినను రాజు నాబ్రాహ్మణుని దండించగూడదని యీక్రింది శ్లోక ముచే దెలియబడుచున్నది.

శ్లో॥ విస్రబ్దం బ్రాహ్మణశ్శూద్రా ద్ద్రవ్యోపాదానమాచరేత్।
నహితస్యాస్తికించిత్స్వం భర్తృహార్య ధనోహిసః॥
మనుస్మృతిః ౮ అధ్యాయము ౪౧౭ శ్లోకము.

అవగా బ్రాహ్మణుడు దాసుడగు శూద్రునివలన ధనమును ని స్సంశయముగ గ్రహించవచ్చును. ఎందువలననినచో నాశూద్రునికిం చుకయైనను నాధనమునం దధికారము లేదు. దాసుడగు శూద్రునివల న సంపాదించబడిన ధనమునకు స్వామియే యజమానుడుగనుక నాధన మును బలాత్కారముగ గ్రహించినను బ్రాహ్మణుని రాజు దండించ గూడదు. ఒకప్పుడీధర్మము ప్రాచీనకాలమగు మనుస్మృతికాలమునజె ప్పినదై యున్నది గాని ప్రస్తుతకాలమునకట్లు జెప్పియుండలేదనివచిం చితిరేని ఈకలియుగమునకువిధించిన పరాశరమాధవీయములోయీక్రిం దివిధమున శూద్రుడు ధనసంచయము జేయగూడదనిజెప్పుచున్నది.

శ్లో॥ సంచయాంశ్చన కుర్వీత జాతుశూద్రః కథంచన।
సేవయాహి ధనంలబ్ధ్వావశే కుర్యాద్గరీయసః॥
పరాశరమాధవీయము. ౯౩ పత్రము.

అనగా శూద్రుడు ధనసంచయమును జేయకూడదు. అతని ఐా వృవర్గమునకై సేవచేతనే ధనమును బొందవలయును. అధిక ధన సంచ యమును మాత్రము జేయగూడదని బూర్వశ్లోకములతో నన్వయించు కొనవలయును.

ఈస్మృతివాక్యములు బూర్వోదాహృతమైన శృతిప్రమాణమున కు వ్యతిరిక్తముగ నుండుటచే, శ్లో॥ ధర్మజిజ్ఞా సమానానాం ప్రమాణం పరమం శృతిః॥ అను నీమనుస్మృతిశ్లోకము ననుసరించి కల్పితవాక్యము లుగ నాధునికులచే జేర్చబడినవని జెప్పుచున్నాము.

౧౦ ఇటుపైన గొన్నిస్మృతివాక్యములను జిత్రించుచున్నాము. అవి బూర్వోదాహృతమైన యాన్యవద్యాని కర్మాణి॥ అను నీశృతికి వ్య తిరిక్తముగ నుండుటచే కల్పితములైన వాక్యములుగ నుండుట వలనవి శ్వసించ గూడదు.

> శృ॥ యాన్యనవద్యానికర్మాణి। తానిసేవితవ్యాని। నోఇతరాణి।యా న్యస్మాకగ్ం సుచరితాని। తానిసేవితవ్యాని। నోఇతరాణి తైత్తరీయోపనిషత్। శిక్షావల్లి॥

అర్థము. అనవద్యాని। నిందితములుకాని, కర్మాణి। కర్మలు, యాని। ఏవో, తాని। ఆకర్మలను, త్వయా। నీచేతను, సేవతవ్యాని। చే యదగినవి, ఇతరాణి। అన్యములైనవాటిని, నో। చేయకూడదు, యా ని। ఏవి, అస్మాకం। ఆచార్యులమగుమాకు, సుచరితాని। శుభచరిత ములో, తాని। అవి, త్వయా। నీచేతను, ఉపస్యాని। ఉపాసింపదగినవి, అనగా చేయదగినవి, ఇతరాణి। అన్యములైనవి, నో। చేయకూడదు.

శంకరభాష్యము. యాన్యపిచాన్యాని అనవద్యాని అనిందితాని శిష్టాచారలక్షణాని కర్మాణి తానిసేవితవ్యాని కర్తవ్యానిత్వయా। ఇత రాణిసావద్యాని శిష్టకృతాన్యపి నోకర్తవ్యానిన కర్తవ్యాని యాన్యస్మా కం ఆచార్యాణాం సుచరితాని శోభనచరితాని ఆమ్నాయాద్య విరు ద్ధానితాన్యేవ త్వయోపాస్యాని। అదృష్టార్థాన్యను ష్ఠేయానినియమే న కర్తవ్యానీత్యేతత్ నోఇతరాణి విపరీతాన్యాచార్య కృతాన్యపి॥

విద్యారణ్యభాష్యము. క్షేమైశ్వర్య కారణాని కర్మాణిద్వివిధా
నీ అనిందితాని నిందితానిచ। తత్రపూర్వోదాహృతాన్యా యుష్కామే
ష్టి ప్రతిగ్రహయాజనాదీని అనిందితాని కర్మాణి యానితాన్యేవ సేవిత
వ్యానీతరాణితు। అభిచారదీని శత్రువధద్వారా కర్మవత్ క్షేమహేతు
త్వేపీ తాత్కాలిక క్షేమపదాభి చారాదికం దుఃఖహేతు ద్వారానరక
ప్రదత్వేన నిందితత్వాన్న సేవ్యాని॥

ననుశిష్టాచారస్యాపి శృతిస్మృతి వత్ప్రమాణత్వాదాచార్యస్య
తవసంబంధీని చరితాని సర్వాణ్యపిసేవితవ్యానీత్యా శంక్యతత్రాపి విశే
షదర్శయతి। ద్వివిధచరితం దైవం మానుషంచేతి తచ్చోభయం భగవా
నుదాజహార। అభయంసత్వసంశుద్ధి జ్ఞానయోగవ్యవస్థితిః। దానందమ
శ్చయజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవం। అహింసాసత్య మక్రోధస్త్యాగ
శ్శాంతిరపైశునం। దయాభూతేష్వలోలత్వం మార్దవంహ్రీరచాపలం।
తేజః క్షమాధృతిశ్శౌచ మద్రోహోనాతిమానతా। భవంతి సంపదందై
వీ మభిజాతస్యభారత। దంభోదర్పోభిమానశ్చ క్రోధపారుష్య మేవచ।
అజ్ఞానంచాభిజాతస్య పార్థసంపదమాసురీం। దైవీసంపద్విమోక్షాయ ని
బంధాయాసురీమతేతి తత్రాస్మాకం సంబంధీనియాన్య భయాదీని సుచ
రితాని త్వయాతాన్యేవ సేవితవ్యాని॥ నతుదంభాదీని। అయంన్యాయః
సర్వత్రశిష్టాచారే యోజనీయః। తథాహిజామదగ్న్యః పరశురామః పి
తురాజ్ఞయా స్వజననీంజఘానేతి। అత్రపిత్రాజ్ఞా పరిపాలనరూపం సు
చరిత మాహర్తవ్యంనతు మాతృవధారూపం దుశ్చరితం। ఏవమన్యద
ప్యుదాహార్యమ్॥

ఇట్లు ఏవినిర్దోషములై యున్నవో అట్టిపనులు చేయతగినవిమిగి
లినపనులు చేయతగినవికావు. ఏవిమాకు మంచినడతలో అవి నీచేతజే
యదగినవి. మిగిలిన పనులు చేయగూడదు. అని యిట్లు పరమేశ్వరు
డాజ్ఞయిచ్చి యుండునప్పుడు ఇట్టి వేదవాక్యములకు వ్యతిరిక్తముగ నీ
క్రింది స్మృతివాక్యములు జెప్పుచున్నవి. అట్టిశృతివ్యతిరిక్తములైనస్మృ
తివాక్యములను వ్రాయుచున్నాము.

౧౧ శ్లో॥ ఏకమేవతు శూద్రస్య ప్రభుకర్మసమాదిశత్।
ఏతేషామేవవర్ణానాం శుశ్రూషామనసూయయా॥
మనుస్మృతి ౧ అ ౯౧ శ్లోకము.

శ్లో॥ శూద్రంతుకారయేద్దాస్యం క్రీతమక్రీతమేవవా॥
దాస్యాయైవహిసృష్టో సౌబ్రాహ్మణస్యస్వయంభువా॥
మనుస్మృతి ౮ అధ్యాయము ౪౧౩ శ్లోకము.

అనగా బ్రహ్మ శూద్రునకు అసూయలేకుండ బ్రాహ్మణాదివర్ణత్రయములవారికి సేవజేయుకొరకే నిర్మించెను. మరియును బ్రాహ్మణుడు శూద్రునకు జీతమిచ్చియైనను ఇవ్వకయైనను వానిచే బలాత్కారముగ దాస్యమును జేయించి కొనవలయును. బ్రాహ్మణునికి దాస్యముచేయించుకొనుటకుగాను శూద్రుని బ్రహ్మచే సృష్టించబడెను. అనియిట్లు జెప్పబడియున్నది. ఈయభిప్రాయము వేదాంతశాస్త్రమును బోధించు శృతివిరుద్ధార్థమైయున్నది. ఎందువల్లననగా సమస్త జీవులు కర్మల ననుసరించి సృష్టింపబడినవి అని జెప్పుచుండ యీస్మృతి వాక్యములు బ్రాహ్మణసేవజేయుటకొరకే శూద్రుని సృష్టించెనని జెప్పుటవిరుద్ధమైయున్నది. ఇట్లు పరమేశ్వరుని సంకల్పముండజాలదని నాబాలగోపాల విదితమైయున్నది. ఒకవేళ శూద్రుడు సేవజేయుటయందు యిచ్ఛలేనివాడైనచో శిల్పాదికర్మలచే జీవించదగినవాడుగాని మఱియునే కార్యమునైనను జేసి జీవించగూడదని పైశృతికి వ్యతిరిక్తముగ నీక్రింది స్మృతివాక్యములు జెప్పుచున్నవి.

శ్లో॥ అశక్నువంతుశుశ్రూషాం శూద్రః కర్తుంద్విజన్మనాం। పుత్రదారాత్యయంప్రాప్తో జీవేత్కారుక కర్మభిః। యైకర్మభిఃప్రచరితైః శశ్రూష్యంతే ద్విజాతయః। తానికారుక కర్మాణి శిల్పాని వివిధానిచ॥

మనుస్మృతి ౧౦ అధ్యాయము ౯౯, ౧౦౦ శ్లోకములు.

అనగా శూద్రుడు ద్విజశుశ్రూషచేయుట కిచ్ఛగించనిచో దారపుత్రాదుల కన్నములేక నవస్థపడుచుండినప్పుడు సూపకారాది కారుక

కర్మములచే బ్రతుకవలయును. అనగా ద్విజుల గృహముల నంటజేసు కొని జీవించతగినదేగాని మఱొండువిధమున జీవించుటకు వలనుపడదు.

ఇందులోను మొదటవచించిన శ్లోకములలో ద్విజశుశ్రూష జేయుటకే భగవంతుడుశూద్రుని సృష్టించినప్పుడును అతనికి ద్విజశుశ్రూషవల్లనే జీవనోపాధియని ఇట్లు భగవంతుడు విధించినదే నిశ్చయమై యుండునప్పుడు నట్టి విధ్యుక్తధర్మమును విడనాడి యన్యమార్గమునవెళ్లుట కేఱికిని శక్యముగాదు. ఏలయనినచో నోటితో మాట్లాడవలయునని భగవంతుడు విధించియుండునప్పుడు మఱియొక యవయవముతో మాట్లాడుటకెట్లు వలనుపడదో నట్లుగ బూర్వోక్తవిధియు జరుగతీరవలయును. ఇపుడీవిధి యట్లుగాక మఱియొకవిధమున గన్పట్టుచున్నది. ఎట్లనినచో మొదట సేవజేయవలయుననిజెప్పి అట్టిసేవయందు అశక్తుడైనప్పుడు పచనాది క్రియలుజేసి జీవించవలయునని జెప్పుట అసంభవములు కాబట్టి యీశ్లోకములెవరో స్వార్థపరులు పూర్వోత్తరవిషయములకు సంబంధములేక కల్పించి చేర్చినవని నమ్ముటకు వీలైనవిగా నున్నవి. ఈశ్లోకములకు వ్యతిరిక్తములుగ పరాశరస్మృతియందు నీక్రింది శ్లోకములచే జెప్పుచున్నవి.

శ్లో॥ శూద్రస్యద్విజ శుశ్రూషా పరమోధర్మ ఉచ్యతే।
అన్యథాకురుతే కించిత్తద్భవేత్తస్య నిష్ఫలమ్॥
పరాశరస్మృతి ౧ అధ్యాయము. ౬౮ శ్లోకము.

గీ. పాఱులనుగొలిచియుంటయే పరమధర్మ
మంద్రునాలవజాతి కల్లదియుపేక్ష
జేసి యెన్నేనిగర్మముల్ జేసికేని
వారలకుదానసెంతయు ఫలములేదు.

ఆంధ్రపరాశరస్మృతి ప్రథమబింబము ౭౫ పద్యము.

౧౨ ఈప్రమాణవచనముల శూద్రునికి ద్విజశుశ్రూషకన్నను మించిన ధర్మమును జెప్పియుండలేదు. ఇందులకు వ్యతిరిక్తముగనొకా

నొక శూద్రుడు ప్రవర్తించి వ్యవసాయ కర్మలు జేసుకొనినచో అల్పా
యువును బొందునని భీతిగొల్పునట్టుగ నీక్రిందిశ్లోకమున జెప్పియున్నది.

శ్లో॥ వికర్మకురుతే శూద్రా ద్విజ శుశ్రూషయోజ్ఝితా।
భవంత్యల్పాయుష స్తేవై నిరయంయాంత్య సంశయమ్॥

పరాశరస్మృతి ౨ అధ్యాయము. ౧౪ శ్లోకము.

గీ. ద్విజులకొలువులునూని వివిధములైన
పనులుజేసెదు శూద్రుల వయసుతఱుగు
ననుచుజెప్పినయివి సనాతపు ధర్మ
మర్మములునాల్గు కొల్లముల మానవులకు.

ఆంధ్రపరాశరస్మృతి ప్రథమబింబము ౫౮ పద్యము.

విద్యారణ్యవ్యాఖ్యానము. కలాద్విజశుశ్రూషా వర్జితాశ్శం
క్యాహ। వికర్మేతిలాభాధిక్యేన విశిష్టజీవన హేతుత్వాత్కృష్యా
దికం వికర్మేత్యుచ్యతే। ద్విజశుశ్రూషయాతు జీర్ణవస్త్రాదికమే
వలభ్యత ఇతినలాభాధిక్య మతోధికలిప్సయా కృష్యాధికమేవ
కుర్వంతోయ దిద్విజశుశ్రూషాం పరిత్యజేయు స్తదాతేషామై
హికాముష్మికంచహీయతే॥

పరాశరమాధవీయము ౯౯ పత్రము.

అనగా ద్విజశుశ్రూషవలన జీర్ణవస్త్రములును ఉచ్ఛిష్టాన్నమును
తప్ప అతిశయము లభించదని యేశూద్రుడైనను ద్విజశుశ్రూషనువది
లిబెట్టి వికర్మలనగా వ్యవసాయాదికర్మలనుజేసినేనివాడు అల్పాయువై ని
హాపరలోకములను రెంటిని బొందజాలడు.

ఇవియు వైశ్యస్మృతికి వ్యతిరిక్తమునగనిందితవచనములుగ గన్పట్టుచు
న్నవి. అందువలన కల్పితములని వాకొనుచున్నాము.

శ్లో॥ వర్ణత్రయస్యశుశ్రూషాం కుర్యాచ్ఛూద్రః ప్రయత్నతః।
దాసవద్బ్రాహ్మణానాంచ విశేషేనసమాచరేత్॥

హారీతస్మృతిః ౨ అధ్యాయము. ౧౧ శ్లోకము.

అనగా శూద్రుడు వర్ణత్రయమువారికి శుశ్రూష జేయుచు నం దులో బ్రాహ్మణునికి దాసునివలె విశేషించి సేవ జేయవలయును. ఇ దియునుం గాకను,

శ్లో॥ అయాచిత ప్రదాతాచ కృషింవృత్త్యర్థమాచరేత్।
పాకయజ్ఞవిధానేన యజేద్దేవమతింద్రితః॥

హారీతస్మృతిః ౨ అధ్యాయము ౧౨ శ్లోకము.

అనగా, శూద్రుడు బ్రాహ్మణుడు యాచించకము నుపేదాన ముచేయుచు వృత్తికొఱకు సేద్యము జేసుకొని పాకయజ్ఞవిధానముచే భగవదారాధనము జేయవలయునని హారీతస్మృతి పైస్మృతివాక్యముల కన్నిటికి వ్యతిరిక్తము జెప్పుచున్నది. ఈయభిప్రాయమునే శూద్రుడు తరించగలందుల కొఱకు చక్కని మార్గమని కొందఱు మాతోనింతకు బూర్వము వాదించియున్నారు.

ఈశ్లోకములో శూద్రునికని జెప్పియుండ లేదుగాని హారీతస్మృతి* యందు శూద్రధర్మములు జెప్పునప్పుడుయీశ్లోకముతో జేర్చి జెప్పియుండు టచే నీశ్లోకమును శూద్రధర్మముక్రింద పరిగణించి జెప్పుటయగుచున్నది.

ఇటుపై శూద్రుడు ద్విజశుశ్రూష జేసినచో వేతనము క్రింద నే మిచ్చుటగలుగునో నావిషయము కొంచము నీక్రింది ప్రమాణవచనము లచే చర్చించి జూచెదము.

౧౩ శ్లో॥ ఉచ్ఛిష్టమన్నందాతవ్యం జీర్ణానివసనానిచ।
పులాకాశ్చైవధాన్యానాం జీర్ణాశ్చైవ పరిచ్ఛదాః॥

మనుస్మృతి ౧౦ అధ్యాయము, ౧౨౫ శ్లోకము.

అనగా ప్రకృతము ద్విజుల నాశ్రయించిన శూద్రునకు ఉచ్ఛిష్టా న్నమున్ను జీర్ణములగు అనగా తమరుకట్టుకొని భుక్తములగు వస్త్రము లనివ్వవలయును. ఇంతకుబూర్వము, శ్లో॥ నశూద్రాయమతిందద్యాత్ నోచ్ఛిష్టం నహవిష్కృతం॥ అను నీశ్లోకమున జెప్పిన విషయముద్విజ శుశ్రూష జేయని శూద్రునకు ఎంగిలినన్నము నైనను బెట్టగూడదని

చెప్పబడినది. ఇచ్చట ద్విజ శుశ్రూష జేయునట్టి శూద్రునకు మాత్ర ముఎంగిలన్నమును బెట్టవచ్చునని జెప్పుటయైనది. మఱియు నీశూద్రు నకీవిధమున జీవనోపాధి జెప్పి అతని కుటుంబమునకు గాను ధాన్యముల లో పులాకములనగా నాళ్లు చోళ్లు మొదలగునవి అట్టి శూద్రునికివ్వ వలయును. అనియిట్లు జెప్పుచున్నది.

శ్లో॥ శూద్రాణామధికంకుర్యా దర్చనం న్యాయవర్తినాం।
ధారణంజీర్ణవస్త్రస్య విప్రస్యోచ్ఛిష్టభోజనమ్॥
హారీతస్మృతిః ౨ అధ్యాయము. ౧౩ శ్లోకము.

ఇదియునుంగాక న్యాయ వర్తియగు శూద్రుని బ్రాహ్మణోచ్ఛి ష్టము చేతను జీర్ణవస్త్రము చేతను గౌరవించ తగినదని బూర్వోక్తమైన హారీతస్మృతి ప్రమాణముచే దెలియబడుచున్నది.

౧౪ ఇట్టిపైన శూద్రుడుఉద్యోగ మొనర్చుటనుగూర్చి అయో గ్యుడనియు నతని ఉద్యోగము యత్నముచే నివ్వంకుండా యుండవల యుననియు నీక్రింది ప్రమాణములచే దెలియబడుచున్నది.

శ్లో॥ యత్రవిప్రోనవిద్వాంస్యాత్ క్షత్రియంతత్ర యోజయేత్।వైశ్యం
వాధర్మశాస్త్రజ్ఞంశూద్రంయత్నేనవర్జయేత్॥మనుస్మృతిః౮
అధ్యాయము. ౨౦ శ్లోకము. కుల్లూకభట్టు వ్యాఖ్యానము.
మఱియునీశ్లోకముశుక్రనీతి ౪ వ అధ్యాయము. ౫వ ప్రకరణము.
౧౪ శ్లోకము. ౪౩౨వ పత్రమునందును జెప్పబడియున్నది.

శ్లో॥ దశప్రోక్తాః పురోధాద్యా బ్రాహ్మణాః సర్వఏవతే। అభావేక్ష త్రియాయోజ్యాస్తదభావే తథోరుజాః। నైవశూద్రాస్తు సం యోజ్యా గుణవంతోఽపిపార్థివైః॥
శుక్రనీతిః ౨ అధ్యాయము. ౪౨౬, ౪౨౭.

శ్లో॥ సేనాధిపః క్షత్రియస్తు బ్రాహ్మణస్తదభావతః।
నవైశ్యోనచవైశూద్రః కాతరశ్చకదాచన॥
శుక్రనీతి ౩ అధ్యాయము. ౪౨౯, ౪౩౦.

అనగా రాజు తనయుద్యోగులలో విద్వాంసుడైన బ్రాహ్మణు
డు దొరక్కపోయినచో ధర్మశాస్త్రజ్ఞుడైన క్షత్రియునుగాని వైశ్యునిగా
ని యుంచవలయును. మరియును రాజు తనసమీపమునయుండు దశ ప్ర
కృతులను యుద్యోగస్థానములయందు బ్రాహ్మణులనే యుంచ వలయు
ను. వీరుదొరక్కపోయినచో క్షత్రియునుగాని వైశ్యునిగాని యుంచవల
యును. శూద్రుడు గుణ సంపన్నుడైనను యత్నముచే వదిలిపెట్ట వల
యును, ఇదియునుంగాక రాజు తన సేనాధిపతిని నియోగించడములో
క్షత్రియునైనను బ్రాహ్మణునైనను యుంచవలయును. వైశ్యునిగాని
శూద్రునిగాని యత్నముచే వదిలిపెట్టవలయును.

అనియిట్లు జెప్పియుండుటచే శూద్రుని ఉద్యోగస్థానముల యం
దుంచగూడదని తెలియుచున్నది. ఈయభిప్రాయము, శ్రు॥ కుశలాన్న
ప్రమదితవ్యం॥ అను నీశ్రుతికి వ్యతిరేకమైన యభిప్రాయమైయుండుటచే
శ్లో॥ ధర్మజిజ్ఞాస మానానాం ప్రమాణం పరమంశ్రుతిః॥ అను నీవాక్యము
చేనీ వాక్యములన్నిటిని ఖండింపబడినవని తెలియజేయుచున్నాము.

౧౫ ఇదియునుంగాక బ్రాహ్మణుడు దుఃశీలుడైనప్పటికిని పూ
జనీయుడై యున్నాడనియు శూద్రుడు జితేంద్రియుడైనను పూజనీయు
డుగాడనియును, ఇట్లు నీక్రిందివచనముచే జెప్పబడుచున్నది.

శ్లో॥ దుఃశీలోపి ద్విజపూజ్యోనతు శూద్రోజితేంద్రియః।
కఃపరిత్యజ్య గాందుష్టాం దుహేచ్ఛీరవతీంఖరీమ్॥
పరాశరస్మృతి ౮ అధ్యాయము ౩౫ శ్లోకము.

గీ. చెవటియయ్యును బాఁపండు సేవనీయు
డవనికాపు జితేంద్రియుడయ్యు బూజ
గొనననర్హుఁడు చెడుగని గోవువిడిచి
పాడిగాడిదె పిదుకఁబోవు వాఁడుగలఁడె.

ఆంధ్రపరాశరస్మృతి ద్వితీయబింబము ౯౮.

అనగా బ్రాహ్మణుడు దురాచారముగలవాడైనను పూజనీయు
డైయున్నాడు. శూద్రుడు జితేంద్రియుడైనను పూజనీయుడుగా జాల
డు. అనియిట్లు జెప్పుచున్నది.

౧౩. శ్లో॥ శూద్రోఽపిద్వివిధో జ్ఞేయః శ్రాద్ధీచైవేతరస్తథా। శ్రాద్ధిభోజ్యస్తయోరుక్తో హ్యభోజ్యస్త్వితరోమతః॥ ప్రాణానర్థాంస్తదారాన్బ్రాహ్మణార్థం నివేదయేత్। సశూద్రజాతిభిర్భోజ్యః సదభోజ్యః శేషఉచ్యతే॥ విష్ణుస్మృతి ౫ అ. ౧౦, ౧౧ శ్లో.

అనగా శూద్రుడు శ్రాద్ధి, ఇతరుడు, అని యిట్లు రెండువిధములగునట్టి భేదములుగలవాడై యున్నాడు. బ్రాహ్మణులకొరకు తనప్రాణమును, ధనమును, భార్యను, అను నీమూటిని యెవడిచ్చుచున్నాడో వాడు శ్రాద్ధిఅనువాడగును. పూర్వోక్తములగువాటిని బ్రాహ్మణుని కొఱకెవ్వడివ్వడో వాడు ఇతరుడనువాడగును. శ్రాద్ధియను వానియింట బ్రాహ్మణాదులు భుజించవచ్చును. ఇతరుడనువానియింట బ్రాహ్మణాదులు భుజించకూడదు.

ఇనియిట్లు జెప్పియుండుటచే బ్రాహ్మణుని కొఱకు ప్రాణమును, ధనమును, భార్యను, ఇచ్చువాడైనచో భుజించుటకు తగినవాడగుచున్నాడనియు, తదితరుడగు వానింట భుజించుటకు యోగ్యుడుగానివాడగుచున్నాడనియు, దెలియుచున్నది. ఇట్లుగ బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకు నైకమత్యము గలదని మనమూహించవలయును.

౧౪ ఇంతియేగాకను శూద్రునికి శిక్షావిషయములో నీక్రిందివిధమున జెప్పియున్నదాని జూచినచో ఘోరముగగన్పట్టుచున్నది.

శ్లో॥ శతంబ్రాహ్మణమాక్రుశ్య క్షత్రియోదండ మర్హతి।
వైశ్యోప్యర్ధశతంద్వేవా శూద్రస్తువధమర్హతి॥
మనుస్మృతి ౮ అధ్యాయము. ౨౬౭ శ్లోకము.

అనగా బ్రాహ్మణుని నీవు దొంగవనుట మొదలగు మాటలను మించినాడిన క్షత్రియునకు నూరుపణములుదండము విధించవలయును, ఈలాగునే వైశ్యునకు నూటయేబదిగాని యిన్నూరుగాని పణములను గౌరవలాఘవ విచారముచే దండము విధించవలెను. శూద్రుడట్లుబ్రాహ్మణుని మించనాడెనేని దెబ్బలు కొట్టించడము మొదలగు కఠినశిక్ష జేయువలయును లేక చంపుటయోగ్యమైయున్నదని జెప్పుచున్నాడు.

ఇందుచే శూద్రుడు బ్రాహ్మణుని తిట్టినంతమాత్రమున చంపు టనుగూర్చి శిక్ష జెప్పినప్పుడు శూద్రునివిషయమై నెంతఘోరముగ స్మృతులలో వ్రాయబడియున్నదో వేఱుగ జెప్పలేకనే దెలియుచున్నది.

౧౮ ఇటుపై శూద్రునికి మోక్షవిషయమునుగూర్చి స్మృతుల లో జెప్పియున్న దానిని యేమివిచారించెదము.

శ్లో॥ జప స్తప స్తీర్థయాత్రా ప్రవ్రజ్యా మంత్రసాధనం।
దేవతా రాదనంచైవ స్త్రీ శూద్ర పతనానిషట్॥
అత్రిస్మృతి ౧ అధ్యాయము. ౧౩౩ శ్లోకము.

శ్లో॥ యద్బ్రాహ్మణేనాపహృతం ధనంతత్పరలోకదం।
శూద్రాయదత్తమపి యన్నరకాయైవ కేవలం॥
శుక్రనీతి ౨ అధ్యాయము. ౪౦౨ శ్లోకము.

అనగా జపము, తపము, తీర్థయాత్ర, సన్యాసము, మంత్రసాధనము, దేవతారాధనము, అను నీయాఱింటిని స్త్రీశూద్రులవలంబించిరేని పతితులగుదురు. ఇదియునుంగాక బ్రాహ్మణుడు బ్రాహ్మణేతరుని సొత్తును దొంగిలించినేని యాద్రవ్యము యజమానునికి పరలోకము నిచ్చునదియైయున్నది. ఆయజమానుని భక్తిపూర్వముగ శూద్రున కిచ్చినదైనను నాద్రవ్యము పరలోకమునకు హేతువైనదిగాక నరకము నిచ్చునదియై యున్నది.

౧౯ ఇట్టి శృతి విరుద్ధార్థకములైన కల్పితప్రమాణము లెన్నియో గన్పట్టుచున్నవి వాటినన్ని యచ్చట వ్రాయుటకు గ్రంథవిస్తర భీతియగునని దలచి విరమించితిమి.

ఇట్టిస్థితిలోను కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగు వారు సచ్ఛూద్రులనిగాని శూద్రులనిగాని జెప్పుట కెట్లుజెల్లును. ఒకవేళనిట్లు జెప్పిన బూర్వోక్తధర్మములన్నియు వీరికె జెందియుండవలయును. అట్లు వీరియందాధర్మములు జెందియున్నవని జె

ప్పుట కేవిధమునను శక్యముకాదు. కాబట్టి బూర్వోక్తులగు కమ్మవారు మొదలగువారు కూర్మకులావతంసులైన సూర్యవంశజులగు క్షత్రియులై యున్నారని చెప్పుచున్నాము.

ఇట్లు బూర్వోక్తులగు కమ్మవారు మొదలగు వారిని క్షత్రియులనిచెప్పవచ్చుడు బ్రాహ్మణునికి బదునాఱుసంవత్సరముల వఱకును క్షత్రియులకు నిరువదినాలుగుసంవత్సరముల వఱకును ఉపనయనములేనియెడల వ్రాత్యులని ధర్మశాస్త్రములు చెప్పబడుచున్నవిగదా నిట్టితఱికమ్మవారు మొదలైనవారికి యజ్ఞోపవీతధారణములుగావించి క్షత్రియులని చెప్పుట కెట్లుచెల్లును. కాబట్టి బూర్వోక్తులగు కమ్మవారు మొదలగువారిని సచ్ఛూద్రులని యెందులకు జెప్పగూడదని యిట్లు వచించితిరేని అట్లు చెప్పుటకు వలనుపడదని మాత్రము వ్రాయుచున్నాము. ఎందులకనినచో ఈకమ్మవారు మొదలగువారు బూర్వోక్తప్రకారము నాపద్ధర్మమువలన ప్రచ్ఛన్నరూపులై యుండుటచే యుధిష్టిరాదులవలె ప్రాయశ్చిత్తవిధి అనవసరమని దలచుచున్నాము.

అయిన నొకవేళ ప్రాయశ్చిత్తవిధి కావలయుననిరేని అధర్వణవేదమునందు నాప్రాయశ్చిత్తవిధి జెప్పబడియున్నది. అట్టి ప్రాయశ్చిత్తవిధి ననుసరించి ప్రాయశ్చిత్త మొనర్చుకొని క్షత్రియోచితమైన యజ్ఞోపవీతాది చిహ్నములను ధరించి మేము క్షత్రియులమని జెప్పుకొనుటకు ఈకమ్మవారు మొదలగువారికేయభ్యంతర ముండబోదని మాయభిప్రాయము.

ఇట్లేవరైనను యీసంఘములోనివారు ప్రాయశ్చిత్త మొనర్చుకొని యజ్ఞోపవీతాది చిహ్నములు ధరించుకొనినవారున్నారాఅనినచో శ్రీకూర్మకులావతంస రాజా శివఛత్రపతి (శివాజి) గారు తమ నలువదవయేటను యజ్ఞోపవీత ధారణమును జేసుకొనియుండినట్లు శ్రీయుత. కె. వి. లక్ష్మణరావుగారు తమచేరచింపబడిన శివాజీచరిత్ర ౧౩వ ప్రకరణములో జెప్పియున్నారు. ఆప్రకరణమిచ్చట జెప్పుటకు గ్రంథవిస్తరభీతిచే విరమించితిమి.

ఆంధ్రమహాశయులారా!

ఇప్పటికి నెంతో కాలవిలంబమై మీకు శ్రమగలిగినట్లు మేము దలచుటచే నిదివరలో జరిగిన విచారణవలన మీసంశయములన్నియు నివారణమై యుండుననియెంచి పర్యవసానముగ నొకటి రెండు మాటలనుజెప్పి విరమించుచున్నాము. కూర్మకులావతంసులును సూర్యవంశజులును క్షత్రియులునైన కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు ఉత్తరప్రాంత భూములనుండి (౧) బలభద్రుడనురాజుతో గూడుకొని ౧౨౦౦౦ సంవత్సరములక్రిందట నీదక్షిణప్రాంతభూములకు చనుదెంచిరనిఇదియేగ్రంధములో ౭౭ వ పత్రమునందును (౨) మరియుబూర్వోక్తులగు కమ్మవారు మొదలగువారు, ధర్మశీలుడనురాజుతో గూడుకొని నుత్తరప్రాంత భూముల నుండి దక్షిణప్రాంత భూములకు బూర్వమువలె చనుదెంచిరని ఈగ్రంధమున ౮౮ వ పత్రమునందును, (3) పెండియును దురాత్ముడగు నందునియొక్క ఆజ్ఞానుసారము సాంఖ్యప్రముఖులతో గూడుకొని యుత్తర ప్రాంతభూములనుండి దక్షిణప్రాంతభూములకు నీకమ్మవారు మొదలగువారువచ్చిరనియీగ్రంధమున ౧౩౧ వ పత్రమునందుండు మార్కండేయోత్తర పురాణగాధనుబట్టి దెలియుచున్నది.

ఇట్లుబూర్వోక్తములైన ఈమూడుగాధలయందును ఈకమ్మవారు మొదలగువారు ఉత్తర భూములనుండి దక్షిణభూములకు వచ్చిరని జెప్పినవార్త ఏకగ్రీవముగ వచించినట్లు దెలియుచున్నది.

ఈప్రకారము జెప్పిన మూడుగాధలలో నేగాధ ప్రమాణమైయున్నదను విచారము నీగ్రంధమున ౧౩౯ వ పత్రమునందు ప్రశ్నోత్తర పూర్వకముగ గొంత విచారించియున్నాము. అందులోను మార్కండేయోత్తర పురాణవాక్యములు సహేతుకములై యుండుటచేత లవత్తరమైన ప్రమాణవాక్యములగ నున్నవని జెప్పుటగలిగినది.

ఇట్టితరి కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు కూర్మకులావతంసకులగు సూర్యవంశజులైన క్షత్రియులైయున్నారని ముమ్మాటికిని జెప్పుచు శ్రుతి ప్రతిపాదకులగు సంఘ

సంన్యస్తులైన శ్రీమచ్ఛంకర భగవత్పాదులను స్తుతించుచు నీవిషయమింత టితో విరమించుచున్నాము.

ఇట్లు జగచ్చక్రవర్తియగు జగద్గురుమూర్తిని బూర్వోక్తమైనప్రకాశస్వరూపుడగు పరమేశ్వరునిప్రార్థించి పాఠకులగు మీకును, జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకులనిర్ణయమను ఈగ్రంథమును వెలిబుచ్చుటకు సర్వస్వాతంత్ర్యమును మాకు కలుగజేసిన పంచమజార్జి సార్వభౌమునకును మంగళప్రదమగు గాతయని యీక్రిందిశ్లోకముచే నా శీర్వచనమొనర్చుచు నింతటితో నీవిషయమును విరమించుచున్నాము.

శ్లో॥ ప్రజానాంమఙ్గలం భూయాత్పాలకానాంచ మఙ్గలం।
మఙ్గలం సర్వ భూతానాం భూపతే రస్తు మఙ్గలం।
పఞ్చమో నో మహారాజ్ఞో జార్జి క్షితి పతి ర్వసట।
రాజ్ఞ్యాక్తై స్సపరివారైః జీయాద్వర్ష శతం ప్రభుః॥

ఇతి శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతీ
కృతిషు సుభాషావిభూషితాయాం జయార్థప్రకాశి
కాయాం మూర్ఖశబ్దార్థ నిరూపణ విషయే
స్మృతిప్రామాణ్యా ప్రామాణ్య విచా
రణ పరే ప్రచ్ఛన్నరాజకుల నిర్ణ
యాఖ్యే తృతీయభాగే చతుర్థః
సముల్లాసః సంపూర్ణః.

సర్వము సంపూర్ణము.

శ్లో॥ దృష్టం కిమపిలోకేస్మి న్ననిర్దోషం ననిర్గుణమ్।
ఆవృణుధ్వమతోదోషా వివృణుధ్వంగుణాన్బుధాః॥

ఆంధ్రనగరము.
ఆర్యావర్తాంతర్గతము.

# తప్పొప్పుల పట్టిక.

---

ఈగ్రంథము ముద్రణమగునప్పుడు కొన్ని అవసరములగు కార్యములుగలుగుటచే మధ్యమధ్య విడనాడి పోవుటవలన కొన్నితప్పులు పడినవి కాబట్టి చదువరులు గ్రంథమసంగతముగ దోచిన చోట నీతప్పొప్పులపట్టికను జూచుకొనవలయును.

## ఉపోద్ఘాతములో గల తప్పులు.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 4 | శబ్ధము | శబ్దము. |
| 1 | 9 | శాంశ ములో | అంశములో |
| 2 | 23 | శబ్థార్థము | శబ్దార్థము |
| 4 | 12 | యవలంభించి | యవలంబించి |
| 4 | 24 | కామతోభ | కాములోభ |
| 8 | 9 | గబ్ధము | శబ్దము |
| 9 | 13 | ఓశుద్రీ | ఓశుతుద్రీ |
| 11 | 14 | శాత్రిహ్మ | శాత్రిహ్మణ |
| 12 | 20 | జీవబ్రహ్మవర్ణణము | జీవబ్రహ్మైక్యము |
| 13 | 15 | శబ్ధము | శబ్దము |
| 14 | 21 | నమశు | నమశ |
| 15 | 9 | కృష్ణవేద | కృష్ణయజుర్వేద |
| 15 | 15 | పాసాగంశ్చ | వాసాగంశ్చ |
| 16 | 21 | కర్మారాది | కర్మాకారాది |
| 17 | 5 | వను | వపను |
| 20 | 20 | శుకనీలి | శుక్రనీతి |
| 21 | 5 | దైత్రేయ | దైతేయ |
| 21 | 18 | మంధర | మందర |
| 24 | 4 | అధి | ఆది |
| 26 | 5 | తలపడుచున్న | తలపబడుచున్న |
| 26 | 16 | లవనియు | గలవనియు |
| 26 | 18 | వసుగర్భ | వసుగర్భి |
| 27 | 16 | శేద్ర | శేంద్ర |
| 28 | 12 | వాజనేయ | వాజసనేయ |
| 28 | 15 | శ్రకల | శకల |
| 28 | 26 | దేవతలి | దేవతలు |
| 29 | 20 | స్తనయిత్నలె | స్తనయిత్నవే |
| 30 | 8 | యుత్తము | యుత్తరము |
| 30 | 8 | రనుటకున | రనుటకును |
| 30 | 25 | దేహా | దేవా |
| 36 | 12 | రాజరాక | రాజరాజ. |
| 39 | 9 | 25, 29 | 25, 28 |

## జయార్థప్రకాశికలోనితప్పులు.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 13 | శిక్షావర్లి | శిక్షావల్లి |
| 2 | 25 | శానపత్రము | శాసనపత్రము |
| 4 | 4 | వృధక్ | పృధక్ |
| 7 | 9 | ౨ | 8 6 ౨ కృష్ణమూర్తి |
| 11 | 8 | తాను | తాసు |
| 11 | 15 | తాను | తాసు |
| 13 | 19 | ఉవచార | ఉపచార |
| 14 | 7 | శుద్ది | శుద్ధి |
| 22 | 11 | వాచ్యత్వ | వాచ్యత్వము |
| 23 | 20 | పేరావేయలేదు | 23 ౫ ఇట్లుకూర్చి |
| 26 | 5 | నియభిప్రాయము | నీయభిప్రాయము |
| 18 | 14 | పిశ్వామిత్రః | విశ్వామిత్రః |
| 36 | 5 | ఉపవాద్యతే | ఉపపాద్యతే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 39 | 17 | ద్దామ | ద్ధామ |
| 40 | 20 | కాళీకాంచ | కాళీకాచ |
| 42 | 1 | వ్యూహం | వ్యూహం |
| 47 | 22 | గృవ | గృప |
| 54 | 15 | శిలాంజా | శిలాంబా |
| 54 | 19 | సహాద్రిఖండే | సహ్యాద్రిఖండే |
| 56 | 7 | మహా | మహః |
| 59 | 21 | త్స్వర్గ | త్స్వర్గ |
| 71 | 2 | కల్స | కల్ప |
| 72 | 5 | ఘుర్న | దుర్న |
| 72 | 6 | చరంతకీర్తి | చిరంతనకీర్తి |
| 73 | 12 | వివశ్వతః | వైవశ్వతః |
| 73 | 23 | బాక ధైప్రసితఋషిబాం బ్రైప్రసిదంపి | |
| 76 | 21 | నిర్ణమను | నిర్ణయమను |
| 82 | 27 | పదమును | పద |
| 82 | 12 | ౫ పేరలేదు | ౮౨ పేజిలో ౫ ఇక |
| 88 | 13 | పురాణంలో | పురాణములలో |
| 89 | 24 | 1530 సం॥ | 1533 సం॥ |
| 97 | 20 | సెయ్యాలి | సయ్యాలి |
| 100 | 7 | ఇందులవిషయము | ఇందులవిషయము |
| 102 | 6 | పూరువంశ | పురువంశ |
| 102 | 23 | కతుడు | కౌతు |
| 104 | 23 | నహ్యాద్రి | సహ్యాద్రి |
| 104 | 25 | నహాయము | సహాయము |
| 113 | 4 | అజన | అభిజన |
| 121 | 13 | యంమ | యందును |
| 132 | 5 | కరందత్వా | వందత్వా |
| 132 | 20 | దీశాధిపః | దేశాధిపః |
| 134 | 5 | జనలో | దనలో |
| 139 | 14 | ఒక | ఒకే |
| 155 | 7 | విప్ర | విప్ర |
| 166 | 19 | వ్యాఖ్యాతే | వ్యాఖ్యతే |
| 166 | 21 | జారతాతంతు | జారజాతంతు |
| 167 | 22 | ౯ పేరాలేదు | ౯ పేర ఇటుపై |
| 199 | 13 | సక్తవ్యః | సక్తవ్యః |
| 172 | 20 | ఉపస్యాని | ఉపాస్యాని |
| 183 | 2 | ౨౨ పేరాలేదు | ఇప్పటికి అనుస్థలమున ౨౦ పేరాయుండవలయును |



ఓమ్.

# ప్రకటన.

ఆంధ్రమహాశయులారా!

స్వస్తిశ్రీ శ్రీమత్పరమహంసేత్యాది సకలబిరుదావళి విరాజమాన, స్వామి జీ. యస్. బి. సరస్వతీగారిచే రచియింపబడిన గ్రంథములపట్టిక.

౧ జయార్థప్రకాశిక మొదటిభాగము, అజ్ఞాన తిమిరభాస్కరము, ఇది శాయపురాగ్రహార నివాసులగు హవిర్యాజి కూనపులి పూర్ణయ్య శాస్త్రుల్గారు, పండిత జంధ్యాల గౌరీనాథశాస్త్రి, బి.ఏ., బి.ఎల్., గారు, మరియు శ్రీమాన్ మాడభూషి వాదమత్తేభ కంఠీరవ సింహాద్ర్యప్పళాచార్యులుగారు, శ్రీపుష్పగిరి సంస్థానాస్థానవిద్వాంసులగు బ్రహ్మశ్రీ మల్లాది ఆంజనేయశాస్త్రుల్గారు ఈమొదలగువారు స్త్రీ శూద్రాదులకు వేదాధికారము లేదని వాదించిన వీరివాదములను ఖండించుకొనుచు స్త్రీ శూద్రాదులు మొదలుకొని సర్వమానవకోటి కంతయు వేదాధికారము గలదని నిర్ణయించి చెప్పుచున్నది.

రెండవముద్రణమచ్చగుచున్నది. రు. 2-0-0.

౨ జయార్థప్రకాశిక రెండవభాగము, ప్రశ్నార్ణవాపోశనపాంతమాల, ఇది బ్రహ్మముఖ బాహూరుపాదములవలన వర్ణోత్పత్తిగలిగినదని శెకింద్రాబాదునివాసులగు బ్రహ్మశ్రీ చిఱుకుల అప్పయ్యశాస్త్రిగారు, మహారాజరాజశ్రీ శివపురపు వీరభద్ర పాకయాజిగారు, ఈయుభయులచే రచింపబడిన ప్రశ్నార్ణవాపోశనమను గ్రంథము ఖండించుకొనుచు గుణకర్మవిభాగములవల్లనే వర్ణోత్పత్తియైనదని నిర్ణయించి చెప్పుచున్నది.

అచ్చగుచున్నది. రు. 2-0-0.

3 జయార్థప్రకాశిక మూడవభాగము, ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము, ఇది కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈ మొదలగువారు సచ్ఛూద్రులని వాదము లొనర్చిన బ్రహ్మశ్రీ జెంము కూరి నృసింహశాస్త్రుర్లవారు బ్రహ్మశ్రీ కాశీ కృష్ణమాచార్యులవారు, పానకాల్ల శాస్త్రుర్లవారు, మరియు బందరు నోబిల్ కాలేజి సంస్కృత పండితులగు బ్రహ్మశ్రీ శిష్టా నృసింహశాస్త్రుర్లవారు, ఈ మొదలగు వారలయొక్క వాదములను ఖండించుకొని శ్రీయుతులగు బూర్వోక్తులైనవారు కూర్మకులావతంసులగు సూర్యవంశజులైన క్షత్రియులైయున్నారని ఘంటాపథముగ నిర్ణయించి జెప్పుచున్నది.

అచ్చు పూర్తియైయున్నది. రు. 3-0-0.

4 జయార్థప్రకాశిక నాలగవ భాగము, ప్రణవార్థవిచారము, ఇది మహారాజరాజశ్రీ కోటంరాజు ఆనందరావు మొదలగు గుంటూరు మండలాంతర్గత పండితవర్యులతో వాదములొనర్చి శృతిస్మృతి ప్రమాణముల ననుసరించి ప్రణవార్థమును నిర్ణయించి జెప్పుచున్నది.

గ్రంథము సిద్ధమగుచున్నది.

5 జయార్థప్రకాశిక ఐదవభాగము, రజస్వలా వివాహ ఖండన సమండనము, ఇది సెకిందరాబాదు నివాసులగు బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి గారు, మహారాజరాజశ్రీ శివపురపు వీరభద్ర పాకయాజి గారు, ఈయుభయులచే స్త్రీలకు రజస్వలానంతరము వివాహములు జేయకూడదని నుడివిన నుడువులను ఖండించుకొనుచు ముఖ్యముగ స్త్రీలకు రజస్వలానంతరమే వివాహములు జేయదగునని నిర్ణయించి జెప్పుచున్నది.

గ్రంథము సిద్ధమగుచున్నది.

౬ జయార్థప్రకాశిక ఆఱవభాగము, పర్యటనమీమాంస, ఇది తెనాలి తాలూకా కొల్లూరు గ్రామ వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ భాగవతుల మార్కండేయశాస్త్రుర్లవారి ప్రోత్సాహముచే రచింపబడుచుండి సగ్రంథమైయున్నది. ఇందులో ద్విజాతులు ద్వీపాంతరాదియాత్రలు జేసినను దూష్యముగాదని నిర్ణయించి జెప్పుచున్నది.

గ్రంథము సిద్ధమగుచున్నది.

౭ జయార్థప్రకాశిక ఏడవభాగము, వేదసంగ్రహము, ఇది వేద చతుష్టయములయందుండు విషయములను సంగ్రహించి జెప్పుచున్నది. ఇందులో ప్రథమకూర్పు యందుండు విషయముల కన్నను ఈ రెండవ కూర్పున విశేషించి వ్రాయబడుచున్నది.

గ్రంథము సిద్ధమగుచున్నది.

ఈగ్రంథములను గోరువారు ఇందుకూరిపేట నెల్లూరుజిల్లా అను యీప్రకారము అడ్రస్సువ్రాసి యీక్రింద సంతకము జేసియుండు నా పేర నుత్తరమువ్రాసినచో, వి. పీ. గా పుస్తకములు బడయుదురు.

ముద్రణము పూర్తిగాని గ్రంథములను గోరువారి చిరునామకములను రిజిస్టరు జేసుకొని యుండి ఆయాగ్రంథములు ముద్రణముపూర్తి యైనతోడనే, వి. పీ. గా బంపుచున్నాను.

ఇందుకూరిపేట,<br>నెల్లూరుజిల్లా,<br>14-3-20.

ఇట్లు భవద్విధేయుడు,<br>గాడేపల్లి మురళీమనోహరరావు,<br>బాలకవి.